# THE ANDHRA PRADESH LEGISLATIVE ASSEMBLY DEBATES

[*Part II—Proceedings other than Questions and Answers*]

OFFICIAL REPORT

---

*Eighteenth Day of the Sixth Session of the Andhra Pradesh Legislative Assembly*

---

## ANDHRA PRADESH LEGISLATIVE ASSEMBLY

*Saturday, the 16th November*, 1957

The House met at Half Past Eight of the Clock

[MR SPEAKER IN THE CHAIR]

## QUESTIONS AND ANSWERS

(SEE PART I)

## CALLING ATTENTION TO A MATTER OF URGENT PUBLIC IMPORTANCE RE CHANGE IN THE MODE OF PAYMENT OF HAK-E-MALIKHANA

మిస్టర్ స్పీకర్. 74వ నిబంధనక్రింద శ్రీ పి. నరసింగరావుగారు ఒక నోటీసిచ్చారు. వారు దానినిగురించి చెబితే మంత్రిగారు సమాధానం చెబుతారు.

*శ్రీ పి. నరసింగరావు (హుజూరాబాదు-జనరల్) : అధ్యక్షా, తెలంగాణా ప్రాంతంలో పట్టాదార్లు హక్కెమాలిఖానా, తాటిచెట్టుకు O S. 2-4-0 చొప్పున, ఈతచెట్టుకు 1-14-0 చొప్పున యివ్వడం జరుగుతూ వుండేది. అయితే హక్కెమాల్ఖానా కంట్రాక్టర్లు తహసీలు ట్రెజరీలో జమచేయడం, ఆ తరువాత తహసీల్దారు Refund statement ప్రతి సంవత్సరం తయారుచేసి ఆ మొత్తాన్నంతా తన పేర తీసుకుని విడివిడిగా యీ హక్కుదార్లకు ఎవరెవరికెంత యివ్వవలసి వుంటుందో వారందరికీ M. O. ల ద్వారా distribute చేయడం ఒక ఆచారముగా ఉండేది. కాని యీ సంవత్సరం Accountant General గారు తహసీల్దారు Refund statement కు submit చేసి యీ డబ్బుతీసుకుని పంపించడం rules కు విరుద్ధమని

objection raise చేయడంవల్ల కొన్ని లక్షల రూపాయలు తహసీలు ట్రెజరీలో వుండిపోయాయి వేలాది పట్టాదారులు ప్రతి నాలుగు రూపాయలకు వేరు వేరుగా Refund statement submit చేయాలంటే D T O లకు తహసీలుకు పని విపరీతముగా పెరుగుతుంది చాలా యిబ్బందిగాకూడా వుంటుంది అందు చేత Accountant General గారు చెప్పిన rule ను సడలించి యింతకుముందున్న ప్రకారం తహసీల్దారులే Refund statement తయారుచేసి డబ్బు M O ల ద్వారా అందజేసే సౌకర్యం అల్లానే వుంచాలని మంత్రిగారిని కోరుతున్నాను ఇంతకు ముందు కరీంనగరం జిల్లా కలెక్టరుగారు కూడా ప్రభుత్వానికి వ్రాసినట్లు ఇంకా సమాధానం రానట్లు తెలుస్తున్నది ప్రజలు చాలా ఆందోళన చెందుతున్నారు. కాబట్టి యింతకుముందుండే సౌకర్యం అదేవిధంగా వుండేటట్లు మంత్రిగారు చూడాలని కోరుతున్నాను

*రెవిన్యూమంత్రి శ్రీ కె. వెంకటరావు అధ్యక్షా, ఇది ప్రజలకు ఆందోళన కలుగవలసిన విషయం కాదు ఎందుచేతనంటే ప్రజలందరికీ హక్కే మాల్ఖానా రాదు కనుక, ఇది దానికి సంబంధించిన పట్టాదారులకు రావాలి దేశంలో పట్టాదారులే ప్రజలుకాదు 6,75,000 రూపాయలు కరీంనగర్ జిల్లాలో distribute చేయవలసి వుంది అంతేకాక ఖమ్మంజిల్లాలో, ఇతర జిల్లాలలో యీ సమస్య వుంది Accounts ఎలా వుండాలి ఎలా payments యివ్వాలనే విషయంలో ప్రధానంగా Accountant General గారిదే అధికారం అందువల్ల యీ విషయం గురించి జరుగుతున్న నూతన మార్పు వారు suggest చేసినది సాధ్యయోగ్యంకాదనీ, దానిని మామూలుగా M O ల ద్వారానే పంపించడం న్యాయం అని ప్రభుత్వం యొక్క అభిప్రాయం ఈ విషయం గురించే Accountant General కు వ్రాయడం జరిగింది వారుకూడా ఆలోచిస్తున్నారు వారి యొక్క జవాబు రాగానే హక్కేమాల్ఖానా M O ల ద్వారా ఎవరిది వారికి పంపడం జరుగుతుంది అంత తొందరగా ఎవరికయినా కావలసివుంటే వారు చెప్పినట్టు రసీదు తహసీలులో యిచ్చి యిప్పుడు తీసుకోడానికి అభ్యంతరం లేదు కాని 4 లేక 8 చెల్లుండి తహసీలుకు 70 మైళ్ళ దూరంలో వున్నవారు అక్కడకువెళ్ళి తీసుకోవాలంటే రావలసిన దానికంటె ఖర్చు లెక్కువవుతాయి. మార్చేటటువంటి యత్నంలోనే ప్రభుత్వం వుంది Accountant General గారితో ఉత్తర ప్రత్యుత్తరాలు జరుగుతున్నాయి ఆయన అంగీకరించగానే యీ ఏర్పాటు తప్పకుండా జరుగుతుందని మనవి చేస్తున్నాను.

## REPORT OF THE SELECT COMMITTEE ON THE ANDHRA PRADESH COMMERCIAL CROPS (ASSESSMENT) BILL, 1957

*Sri K Venkata Rao* Mr Speaker, Sir, I beg to present the report of the Select Committee on the Andhra Pradesh Commercial Crops (Assessment) Bill, 1957

*Mr Speaker* The report of the Select Committee on Andhra Pradesh Commercial Crops (Assessment) Bill, 1957, is presented to the House

## THE ANDHRA LAND REVENUE (ADDITIONAL WET ASSESSMENT) (ANDHRA PRADESH AMENDMENT) BILL, 1957

*Clause* 3 (Contd)

*Sri M Nagi Reddi* (*Macherla*) Mr Speaker, Sir, I beg to move

" For the words 'thirty-seven and half per cent', substitute the words ' twenty-five per cent ' in sub-clause 1 (a) of clause 3. "

*Mr Speaker*. Amendment moved

*శ్రీ ఎమ్ నాగిరెడ్డి. మొట్టమొదటి సవరణలో "37½% బదులు 20% పెట్టా" అన్నప్పుడు "ఇదివరకే 18¾% వుంది. ఇక 1¼% మాత్రమే కదా" అనే దృష్టితో మంత్రిగారు simple గా త్రోసివేశారు ఈ సవరణ సందర్భంలో ఒక విషయం ప్రభుత్వదృష్టికి తెస్తున్నాను 25% అంటే consolidated wet assessment మీద రూపాయికి 0-4-0 చొప్పున నీటితీరువ పెంచబడుతుంది. నీటి సరఫరా క్రమంగా అవుతుందని నమ్మకంలేని చిన్న చిన్న నదుల క్రిందున్న భూములపై కూడా యిది పడుతుంది ఇది చాలా ఎక్కువనే విషయం ప్రభుత్వ దృష్టికి తీసుకువచ్చాము. మేము పెట్టిన సవరణ ప్రకారం రూపాయికి 0-2-0 మాత్రమే తగ్గుతుంది. Consolidated assessment మీద రూపాయికి 0-4-0 పెరుగుతుంది. అందువల్ల యీ సవరణను ఆమోదించి యీ సంవత్సరానికి కొంతటితో నైనా వదిలివేయటానికి యిప్పటికయినా ఆలోచించాలని ప్రభుత్వదృష్టికి తెస్తూ యీ సవరణను ప్రతిపాదిస్తున్నాను.

శ్రీ బి శ్రీరామమూర్తి (విజయనగరం) అధ్యక్షా, ఇందులో ముఖ్యమైన విషయం ఒకటి వుంది Wet assessment వేసేటప్పుడు అందులోనే land revenue, water rate రెండు వుంటాయి.

శ్రీ కె వెంకటరావు ఒక్కొక్కటి vote down చేయగా ఇవాళ మూడు amendments వున్నాయి ఒక్కొక్కటి ఒక్కొక్క figure ను fix చేస్తుంది అందులో శ్రీ శ్రీరామమూర్తిగారిది కూడా వుంది అందుచేత ఈ మూడు amendments ను కలిపి discussion కు పెట్టి ఓటుకు పెడితే బాగుంటుంది

మిస్టర్ స్పీకర్ ఆ విషయం నిన్న నేను వారికి చెప్పాను కాని వారు దానికి అంగీకరించలేదు

శ్రీ కె వెంకటరావు అందుచేత ప్రతిదానికి discussion జరగాలంటారు?

మిస్టర్ స్పీకర్ త్వరగానే ముగుస్తుంది

శ్రీ బి శ్రీరామమూర్తి Wet assessment వేసేదానిలో consolidated rate వుంది. అందులోనే Water rate వుంది ఈ water rate ఎంత per cent వున్నదో ఎవరూ నిర్ధారణచేసి చెప్పటానికి వీలులేదు ' Wet assessment వేసేటప్పుడు water rate ఎంత per cent వుండాలో land revenue ఎంత per cent ఉండాలో నిర్ణయించలేదు కాని ఈ assessment లో water rate 75% వుందని for the purpose of calculation" అని విడదీయటంజరుగుతోంది ఇట్లా అంచనా వేయటము చాలా దారుణంగా వుంది కేవలం water rate element 75% వుందని చెప్పడం దారుణమైన విషయము ప్రభుత్వం ప్రచురించిన ఒక కరపత్రం వలన ఎంత per cent వుండాలనేది ప్రభుత్వం నిర్ణయించలేదని స్పష్టంగా తెలుస్తున్నది. కాని తరువాత వేసిన అంచనాలలో 75% వుందని హెచ్చు అంకెను fix చేయటం జరిగింది దానివల్ల విపరీతమైన ఫలితాలు కలుగుతున్నవి. పేదా సాదా అనే తేడా లేకుండా ప్రతి ఒక్కరిమీద ఈ water rate పడుతున్నది. ఈ water rate ను హెచ్చుచేస్తే అది ప్రతిఒక్కరిమీద పడటానికి అవకాశముపుంది. 25% మాత్రమే land revenue మీద పడుతున్నది అందువల్ల హెచ్చు భూమిగల ఆసాములకు ఎక్కువ ఆదాయముగల భూస్వాములకు ఈ సర్చార్జి భారము తగ్గించే అవకాశము కల్గుతోంది. 75% అని water rate పెంచటంవల్ల బీద వారికి పెద్ద దెబ్బ తగులుతున్నది

శ్రీకాకుళం జిల్లాలో పల్లపు భూమిపై ఎకరానికి రు 6-8-0 శిస్తు చెల్లించవలసివస్తున్నది అంటే land revenue రు 1-10-0 అవుతుంది మిగిలిన 4-14-0 water rate గా వస్తుంది. శ్రీకాకుళం జిల్లాలో dry rate రు 2-13-0 వుంది దానిలో రు 1-10-0 land revenue అయితే దాని అర్థం ఏమిటో నాకు తెలియటంలేదు, అదేవిధంగా విశాఖజిల్లాలో wet assessment 9-5-0 వుంది అందులో 2-6-0 land revenue portion ఉంటున్నది డ్రై రేటు 3-9-0అవుతుంది అందుచేత water rate ను పెంచినట్లు బాగా కన్పిస్తోందని మనవి చేస్తున్నాను ఇదివరకే water rate ను పెంచారు దీనిని మరల పెంచటం సబబైన విషయముకాదు అయినా తప్పనిసరిగా పెంచాలని అంటే సూత్రప్రాయంగా దానిని అంగీకరిస్తూ 25% వరకు పెంచాలని విజ్ఞప్తి చేస్తూ ఈ సవరణను ఆమోదించాలని మంత్రిగారిని కోరుతున్నాను

* శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు (నందిగామ) అధ్యక్షా, ఇదివరకు ఉన్నదానిని రు 0-3-0 పెంచాలని మంత్రిగారు చెబుతుంటే రు 0-3-0 కాక రు 0-1-0 పెంచాలని మేము చెబుతున్నాము అంటే ఎకరానికి 0-2-0 తగ్గుతుంది మొత్తం వేసుకొన్న అంచనా 15 లక్షలు అయితే 4.5 లక్షల కంటే ఎక్కువ తగ్గదు రైతులపైనే పన్ను వేస్తున్నారు. కనుక వారు ఆ భారాన్ని మోసేస్థితిలో లేరుకనుక మా సవరణను ఆమోదించాలని కోరుతున్నాను 25% ఆమోదించటం సమంజసముగా వుంటుంది కనుక 18¾ లేక 7% కు పెంచాలని నేను కోరుతున్నాను

శ్రీ కె. వెంకటరావు · అధ్యక్షా, నిన్న చెప్పినదానికంటే యింకా చెప్పవలసినది ఏదీలేదని మనవి చేస్తున్నాను

*Mr Speaker* The question is :

"In sub-clause 1 (a) of clause 3 for the words 'thirty-seven and half per cent', substitute the words 'twenty five per cent'."

The motion was negatived

*Sri P Sundarayya*. Sir, I demand a division

The House then divided.

Ayes : 40 ; — Noes . 70

The motion was negatived.

*Sri M Nagi Reddi* Mr Speaker, Sir, I beg to move

"In sub-clause 1 (a) of clause 3 for the words 'thirty-seven and half per cent', substitute the words 'thirty per cent' "

*Mr Speaker* Amendment moved

*శ్రీ యం నాగిరెడ్డి అధ్యక్షా, మంత్రిగారికి మేము చెప్పేది అర్థం కావడంలేదో, అర్థంఅయి కూడా ప్రజలు భరించగలరనే ఉద్దేశంలో ఉన్నారో, లేకపోతే మేము చెప్పేది వినదలచుకోలేదో మాకు అర్థం కావడంలేదు కాని మేము పదేపదే ప్రభుత్వ దృష్టికి తీసుకురావలసిన పరిస్థితి ఏర్పడుతోంది అసలు ఇదివరకు basic గా ఉన్న రు 18-12-0 పన్ను ఎక్కువ, Nominal గా కావాలంటే నూటికి 20 చొప్పున వేయండి అంటున్నప్పటికీకూడ ప్రభుత్వం తనకున్న మెజారిటీని ఆధారంగా చేసికొని వినేపరిస్థితిలో లేదని తెలిసి మేము కొంతవరకూ జరిగిరావడం కూడా జరుగుతోంది పెళ్లిళ్ళలో మనకు ఒక సాంప్రదాయం ఉన్నది పెళ్ళిళ్లు జరిగే సందర్భంలో ఎదురు యిచ్చేటప్పటికి వధువువైపువారైనా, వరునివైపువారైనా, మెజారిటీ పార్టీవారైనా, మైనారిటీ పార్టీవారైనా చెరిసగం జరిగిరావాలి ఈ సిద్ధాంతాన్ని మనం బయట అమలు పరుస్తున్నాము కనీసం మేము చెప్పేది వినకుండా "మాకు మెజారిటీవుంది, మేమె జరిగిరాము, మాకు ప్రజల సంగతి పట్టదు" అనేస్థితిలో ప్రభుత్వం ఉండడం విచారించదగిన విషయం మేము చాలావరకు ప్రజల అభిప్రాయాలను తీసుకొని ప్రభుత్వం దగ్గరకు చాలావరకూ జరిగిరావడం జరుగుతోంది "మేము ఏ మాత్రంకూడా యీ సహాయం అందుకోము" అంటే విడాకులకు వచ్చేపరిస్థితి తప్ప యింకొకటి ఉండదు (నవ్వులు) ఏదో nominal గా 1¼ న పైసా అని సుందరయ్యగారు చెపుతున్నారని కళా వెంకట్రావుగారు చెప్పారు నూటికి 37½ న పైసల నుంచి 7½ న పైసలు తగ్గించాలని మేము చెబుతున్నాము ఇదేమీ పెద్ద విషయంకాదు. 100 లో 7½ న. పైసలు తగ్గించమంటున్నాము కాబట్టి మంత్రిగారు ఆలోచించి 37½ నుంచి 30 న పైసలు చేయడానికి అంగీకరించాలని వారి దృష్టికి మరీమరీ తెస్తున్నాను.

శ్రీ కే. వెంటరావు : నేను చెప్పేది ఏమీ లేదు.

*Mr Speaker*. The question is.

"In sub clause 1 (a) of clause 3 for the words 'thirty-seven and half per cent', substitute the words 'thirty per cent'."

The motion was negatived.

*Sri P Sundarayya* Sir, I demand a division

The House then divided

Ayes 41, — Noes 83

The motion was negatived

*Mr Speaker* Under Rule 136, in order to save time and repetition of arguments, a single discussion may be allowed to cover a series of interdependent amendments So, I would suggest that amendments Nos 5 to 12 may be taken up together, and discussed, while they will be put to vote separately

*Sri B Sriramamurthy* I beg to move

" for sub-clause (1) (b) of Clause 3, substitute the following—

'so however that the additional assessment shall not exceed Rs 2/- per acre in respect of the single crop wet land and Rs 4/- per acre in the case of double crop wet land'."

*Mr Speaker* Amendment moved.

ఇందులో అన్నీ ఒకేమోస్తరువి ఉన్నాయి కాబట్టి ఒకే discussion చేయవచ్చు

శ్రీ బి. శ్రీరామమూర్తి ఇది అన్నింటితో సమానమైనది కాదు, ఒక ప్రత్యేకత ఉన్నది మిగిలినవాటికీ, దీనికి చాలా తేడా ఉన్నది. నేను explain చేస్తాను

అధ్యక్షా, నేను ప్రత్యేకించి యీ సవరణ యివ్వడంలో ఒక ముఖ్యమైన కారణం ఉన్నది Per centage ఎంతవరకూ పెంచాలనేది ప్రభుత్వం సూచిస్తున్న విషయం అది సరిపోదని నేను అభిప్రాయపడుతున్నాను విశాఖపట్టణం జిల్లాలో రు. $9\frac{1}{8}$ లు పన్ను చెల్లిస్తున్నారు శ్రీకాకుళం జిల్లాలో రు. $6\frac{1}{8}$ లు చెల్లిస్తున్నారు. Maximum రు $13\frac{1}{8}$లు కంటె పెరగకూడదన్నప్పుడు శ్రీకాకుళం జిల్లాలో ప్రస్తుతం $6\frac{1}{8}$ చెల్లిస్తున్నారు, కాబట్టి అక్కడ యింకా రు. 7 ల వరకూ పెరగడానికి అవకాశం ఉన్నది విశాఖపట్నం జిల్లాలో ప్రస్తుతం రు. $9\frac{1}{8}$ లు చెల్లిస్తున్నారు, కాబట్టి అక్కడ యింకా రు 4 లు వరకూ పెరగడానికి అవకాశం ఉన్నది. అట్లాగే, అనంతపురం జిల్లాలో రు. 10 లు చెల్లిస్తున్నారు, అక్కడ యింకా రు. 3 లు పెరగవచ్చు నెల్లూరుజిల్లాలో 8-14-0 చెల్లి

స్తున్నారు యింకా 4-10-0 పెరగవచ్చు ఆవిధంగా, ముఖ్యంగా వెనుక బడిన జిల్లాలలో పన్నులు పెరగడానికి అవకాశం ఉన్నది కాని బాగా పంటలు పండడానికి అవకాశం ఉన్న డెల్టా ప్రాంతాలలో గోదావరి జిల్లాలలో 14-10-0 చెల్లిస్తున్నారు, 13½ కంటె హెచ్చుశిస్తు ఉండదు, కాబట్టి ఒక్కపైసకూడా ఆ జిల్లాలలో వుండే రైతాంగంమీద పడదు అదేరకంగా కృష్ణాజిల్లా తీసుకుంటే రు 11-14-0 లు శిస్తు చెల్లిస్తున్నారు, కాబట్టి 1-10-0 వారిమీద పడు తుంది గుంటూరుజిల్లాలో 12-8-0 చెల్లిస్తున్నారు కాబట్టి యింకా ఒక రూపాయిమాత్రం ఆ రైతాంగంమీద పడుతుంది దీనినిబట్టి హెచ్చుపంటలు పండిస్తూ ఎక్కువ పన్ను భరించడానికి శక్తిఉన్న రైతాంగం ఉన్న ప్రాంతంలో వారిమీద యీ భారం లేనేలేదు వెనుకబడిన ప్రాంతాలలోని రైతులు యీ పన్నులభారాన్ని భరించలేనిస్థితిలో వుంటే ఆరైతాంగంమీదనే యీ అదనపు పన్ను పడుతోంది ఈ పన్నులు వేయకతప్పదు అని ప్రభుత్వం నిర్ణయించినట్ల యితే, 'రెండు రూపాయలకు మించిన పన్ను విధించము, లేక 4 రూ॥ లకు మించినపన్ను విధించము' అని flat గా ఒక రేటును నిర్ణయించాలి తప్ప, 'per centage ని నిర్ణయించి మొత్తం 13½ కంటె పెరగకూడదు, 14½ కంటె పెరగకూడదు' అన్నప్పుడు యీ భారం కేవలం వెనుకబడిన జిల్లాలవారి నెత్తి మీద వేయడమే ఉద్దేశం అని మేము అభిప్రాయపడక తప్పదు

ఈ సందర్భంలోనే ప్రతిపక్షంతరఫున ఒక విషయం మనవిచేస్తున్నాను మేము యిచ్చిన ఏ ఒక్క సవరణకూ కనీసం సమాధానం చెప్పడానికికూడా మంత్రులెవ్వరూ అంగీకరించని పరిస్థితిలో వుంటే మాకు ఒక్కటే అనిపిస్తున్నది. ఇటుపైన సవరణలను ప్రతిపాదించడమైనా మానుకోవాలి, లేదా ప్రతిపాదించిన సవరణలకు కనీసం మంత్రిగారినుంచి సమాధానం పుచ్చుకోడానికైనా ప్రయ త్నించాలి. ఇదే మాకున్న సమస్య అందుచేత, ప్రతిపక్షానికీ, ప్రభుత్వపక్షానికీ మధ్యన గోడలు లేపుతున్న మంత్రిగారి పద్ధతి బాగా లేదని మనవిచేస్తూ, కనీసం దీనినైనా ఆమోదించాలని విజ్ఞప్తి చేస్తున్నాను.

శ్రీ కె. వెంకటరావు : ఏమీ చెప్పేది లేదు.

*Mr. Speaker*: The question is

"For sub-clause (1) (b) of Clause 3, substitute the following—

'so however that the additional assessment shall not exceed Rs. 2/- per acre in respect of the single crop wet land and Rs 4/- per acre in the case of double crop wet land'."

The motion was negatived.

*Sri P Sundarayya* I demand a division, Sir

The House then divided

Ayes 43, — Noes 78

The motion was negatived

*Sri P Sundarayya* I beg to move

"In sub-clause 1 (b) of clause 3 for the words 'Rupees thirteen and naya paise fifty' subsitute the words 'Rupees ten' "

*Mr Speaker* Amendment moved

*Sri P Sundarayya* I beg to move·

"In sub-clause 1 (b) of Clause 3 for the words 'Rupees twenty and naya paise twenty-five', substitute the words 'Rupees fifteen' "

*Mr Speaker* Amendmeut moved

*Sri M Nagi Reddi* I beg to move.

"In sub-clause 1 (b) of Clause 3 for the words 'Rupees thirteen and naya paise fifty' substitute the words 'Rupees eleven'."

*Mr Speaker* Amendment moved.

*Sri M Nagi Reddi* I beg to move:

"In sub-clause 1 (b) of Clause 3 for the words 'Rupees twenty and naya paise twenty five', substitute the words 'Rupees sixteen and naya paise fifty' "

*Mr. Speaker* · Amendment moved.

*Sri M Nagi Reddi* · I beg to move.

"In sub-clause 1 (b) of Clause 3 for the words 'Rupees thirteen and naya paise fifty', substitute the words 'Rupees twelve'."

*Mr. Speaker* · Amendment moved.

*Sri M. Nagi Reddi*. I beg to move.

"In sub-clause 1 (b) of Clause 3 for the words 'Rupees twenty and naya paise twenty five', substitute the words 'Rupees eighteen' ".

*Mr. Speaker* Amendment moved

*Sri M Nagi Reddi* I beg to move

"In sub-clause 1 (b) of Clause 3 for the words 'Rupees thirteen and naya paise fifty', substitute the words 'Rupees thirteen' "

*Mr Speaker* Amendment moved

*Sri M Nagi Reddi* I beg to move

"In sub-clause 1 (b) of Clause 3 for the words 'Rupees twenty and naya paise twenty five', substitute the words 'Rupees nineteen and naya paise fifty' "

*Mr Speaker* Amendment moved

*శ్రీ పి. సుందరయ్య నీటితీరువను పెంచుతూ ఒక clause ను ఇంతకు ముందు pass చేయడం జరిగింది నీటితీరువ, భూమిశిస్తు, అన్నీ కలిపి wet assessment 13-8-0 రూపాయలకు మించి యుండకూడదని, రెండు పంటలు పండే భూమి అయినట్లయితే 20 రూపాయల 25 నయాపైసలకు మించి ఉండ కూడదు అని ఈ బిల్లులో ఉంది ఈ రీతిగా పెంచినపుడు ఎకరం మాగాణీ భూమికి శిస్తు, నీటితీరువ రెండూ కలిపి 10 రూపాయలకు ఏ పరిస్థితిలోను కూడా మించకూడదని, రెండు పంటలు పండేటటువంటి మాగాణీకి అయినట్ల యితే- ఆరకంగా register అయి ఉన్నట్లయితే ఎకరానికి 15 రూపాయలు మించకూడదని మేము యిచ్చినటువంటి సవరణ ఉద్దేశం నీటి తీరువను ఆధా రంగా తీసుకొని, స్థానిక స్వపరిపాలనకోసం వేసేటటువంటి cess లు, Educational cess లు కూడ అదనంగా పడుతున్నాయి అందుచేత అనేక స్థలాల్లో రేట్లు చాల హెచ్చుతగ్గులుగా ఉంటూ ఉన్నాయి అందుచేత మరీ తక్కువగా ఉన్నచోట ఇదికాస్త పెరిగినా, ఎక్కువగాఉన్నచోట దీనిని తగ్గించేదానికోసం మనం ప్రయత్నించవలసి వుంటుంది "ఎకరానికి ఎంత ఆదాయం వస్తుంది?" అనే విషయం ఆలోచించవలసి ఉంటుంది ఆ విషయం ఆలోచించకుండా ఏదో ఒక ఎకరం ఉంది కాబట్టి శిస్తు వేయాలనే సూత్రాన్ననుసరించి ఈ భూమి శిస్తును విధించడం జరుగుతోంది ఈ విధంగా regressive characterలో భూమి శిస్తు చిన్నచిన్న రైతాంగంమీద వేయబడుతూ ఉంది. ప్రభుత్వానికి బాగా ఆదాయం రావాలన్నట్లయితే దీనిని కొంతవరకైనా తగ్గించి ఎక్కువ భూమి ఉన్నటువంటి వాళ్ళమీద ఎక్కువ ఆదాయం వచ్చేవాళ్ళ మీదా surcharge వేయడం ద్వారానో commercial crop మీద పన్నులద్వారానో, లేకుంటే

అన్నిటికంటే శ్రేష్ఠమైన Agricultural Income tax ను విధించటం ద్వారానో ప్రభుత్వాదాయం పెంచడం సరియైనపద్ధతి, కాని ప్రతి ఒక్కరిమీద ప్రభుత్వానికి డబ్బు కావలసివచ్చినపుడు అదనంగా పన్ను వేసేపద్ధతి చాలా పొరపాటుపద్ధతి పంటలు బాగా పండుతూ ఉండేచోట కొంచెం పెంచండి కాని ఎంత పెంచినప్పటికీ కూడా 10 రూపాయలకు మించి పెంచకూడదు కేవలం పెద్దవాళ్ళమీద, ఆదాయం ఎక్కువ వచ్చే వాళ్ళమీద అయితే 10 రూపాయలుకాదు, 20 రూపాయలు వరకూ పెంచినాసరే మాకేమీ అభ్యంతరంలేదు Surcharge Bill వచ్చినపుడు ఈ విధమైనటువంటి ప్రతిపాదనలు చేస్తాము కాని ఒక ఎకరం అర ఎకరం ఉన్నవాళ్ళమీద, 10 సెంట్లు ఉన్నవాళ్ళ మీద కూడా పెంచడంజరుగుతూంది అందుచేత ఏ పరిస్థితులలోను, ఎకరానికి 10 రూపాయలకు మించి పెంచ కూడదని ఖచ్చితంగా పెట్టుకోవాలి ఎకరానికి 100 సెంట్లు భూమి ఉంటుంది ఎకరానికి 10 రూపాయలు అంటే 10 సెంట్లకు ఒక రూపాయి అని సరిగా ఉంటుంది దశాంశ పద్ధతిప్రకారం చూసుకున్నా Whole process simplify అవుతుంది అందుచేత ఈ రీతిగా ప్రతిపాదన చేయడం జరిగింది

ఇంతకుముందు పేదప్రజలమీద అదనంగా పడకుండా ఉండేందుకు ప్రభుత్వానికి ఎన్నో ఉపాయాలను చెప్పాము "మీరు చెప్పేవి చెప్పుకోండి, మేము చేసేది మేము చేసుకుంటాం" అంటే ఇంక సమాధానంకూడా చెప్పవలసిన అవసరం లేదు చెప్పటానికికూడా ఏమీ సమాధానం లేదు అని మేము అర్థం చేసుకోవలసి వుంటుంది దేశానికి అరిష్టదాయకమైన పరిస్థితి ఏమిటి ? ప్రజలు తిండిలేక మలమల మాడుతున్నా, పంటలు పండకపోయినా, రైతుకు ఒక ఎకరం ఉంటే దానిపై వచ్చే ఆదాయం అతనికి చాలినా, చాలకపోయినా కూడా పన్నులు ఇచ్చుకోవాల్సినటువంటి పరిస్థితులున్నాయి మనదేశముమీద విదేశస్థులు ఎవరయినా దాడిచేస్తే, మనం మన దేశాన్ని రక్షించుకోవలసి వచ్చినప్పుడు తిండి ఉన్నా, లేక మలమల మాడుతున్నా ప్రతి ఒకరం పన్నులుకట్టక తప్పదు. కాని యిపుడు మనదేశములో ఒక ఎకరం, అర ఎకరం, 10 సెంట్లు భూమి ఉన్నవాళ్ళమీదకూడా అదనంగా పన్ను వేయవలసినటువంటి పరిస్థితులు ఏమున్నాయి ? దేశాన్ని అభివృద్ధి చేసుకునేదానికి పన్నులు ఇచ్చుకోగలిగిన వాళ్ళమీద ఎక్కువగా వేయకుండా క్రిందవాళ్ళమీద, చిన్నరైతులమీద వేయడమనేది ఏవిధంగానూ సమంజసం కాదు. ఒకఎకరం ఉన్నా పంట బాగా పండి ఆదాయం బాగా వస్తున్నప్పుడు పంటలకు guarantee ఉన్నచోట 6, 7 రూపాయలు పన్ను కట్టవలసివుంటేదానిని ఏ పరిస్థితులలోనూకూడా 10 రూపాయ

లకు మించకుండా ఉండాలి అన్నదానిని సూత్రంగా పెట్టుకోవాలి ఈవిషయం ఇంతకుముందు (శ్రీ)రామమూర్తిగారు చెప్పారు శాసనసభ దానిని తోసేసిందనుకోండి, ఒకపంట పండే భూములపై 2 రూపాయలు మించకుండా రెండు పంటలుపండే భూములపై ఏ పరిస్థితులలోను 4 రూపాయలకు మించకుండా పెంచాలి ఈరకంగా పెంచిన తరువాతకూడా మాగాణీభూములకు ఎంత పెంచినప్పటికీకూడా ఒక పంట పండే భూములపై ఏ పరిస్థితులలోనూ 10 రూపాయలకు మించకుండా, రెండుపంటలు పండేచోట 15 రూపాయలకు మించకుండా ఉండాలనేది చాలా ముఖ్యమయిన విషయం మంత్రిగారు యీ విషయంలో Land Revenue Commission నొకదానిని వేస్తాము అనిచెప్పారు వారు వేసేటటువంటి Land Revenue Commission ఒక సంవత్సరానికో, 2 సంవత్సరాలకో వచ్చి ఈ పన్నుల విషయమై ఏదో రిపోర్టు యిస్తుంది అది రిపోర్టు యిచ్చినతరువాత ఆలోచిస్తామంటున్నారు.

ప్రభుత్వం ఈ రకంగా పన్నులు వేయడమే తప్పితే తక్కువ ఆదాయం వచ్చువాళ్ళమీద, తక్కువభూమి ఉన్నవాళ్ళమీద ఈ పన్ను అదనంగా పడకుండా ఏమాత్రమైనా ఆలోచిస్తూందా అంటే, ఆలోచించకుండా ఉంది ఆఖరికి యిందుకు మంత్రిగారు సమాధానంకూడ చెప్పకపోతే - అధ్యక్షా! మీరు బలవంతంగా మంత్రిగారిచేత సమాధానం చెప్పించలేరనుకోండి వారు ఏవిధంగా సమాధానం చెప్పకుండా కూర్చుంటారో, అట్లాగే ప్రజలచే ఈ శాసనసభకు ఎన్నుకోబడిన మాకు 250 మంది అటు ఉన్నా, 50, 60 మంది యిటున్నా ఇటువంటి సవరణలు ప్రతిపాదించి division కోరే హక్కు ఉన్నది. అందుచేత మంత్రిగారు "time అయిపోతోంది కాబట్టి మేము సమాధానం చెప్పవలసిన అవసరం లేదు, ప్రజలంతా మా వెనకాలే వుంటారు" అనుకుంటే మంచిదే వారిని అట్లా సమాధానం చెప్పకుండా మొండికేసి కూర్చోమనండి, మేము కూడా మొండికేసుకొని కూర్చుని ప్రతిదానికి సవరణలుపెట్టి ప్రతి సవరణకు division కోరతాము. మేము సవరణలను ప్రతిపాదించినట్లు వాటికి సమాధానాలు వారు యివ్వలేదని పత్రికలలో వస్తాయి ఈ నీటి తీరువామీద 50 సవరణలు కోరారని మాకు పేరు ప్రఖ్యాతులు వస్తాయి. ప్రభుత్వంవారు యిదే రీతిగా జరుపుకోవచ్చు. ఇదివరకే వారు సమాధానం చెప్పారనుకోండి. వారు ఒక పర్యాయం చెప్పిన సమాధానం అందరికీ తెలుసు ఈరకంగా చేస్తూంటే మేము చేయగల్గిందికూడా యింతే. ఈ సవరణ చాలా ముఖ్యమైనది. దీనిని అంగీకరించాలని నేను కోరుతున్నాను.

*శ్రీ జి యలమందారెడ్డి (కనిగిరి) అధ్యక్షా! నేను ముఖ్యంగా రెండు విషయాలు ప్రభుత్వ దృష్టికి తీసుకొని రాదలచాను వెట్ ఎసెస్‌మెంటు మీద 50 శాతము, డ్రై వెట్ కలిపి ఉన్నట్లయితే 37½ శాతము అదనంగా పన్నులు విధిస్తామని చెప్పడంవల్ల మెట్ట ప్రాంతాలలో ఎక్కువ పన్నుపడే అవకాశం ఉన్నది కన్‌సాలిడేటెడ్ వెట్‌రేటు రు 8 లు ఉన్నట్లయితే 8×6 అణాలు అనగా మూడు రూపాయలు అదనపు శిస్తు అవుతుంది కాని ఒక రూపాయి భూమిశిస్తు నీటితీరువ ఏడు రూపాయలు ఉన్నట్లయితే ఏడు రూపాయలలో సగం మూడున్నర రూపాయలు అదనంగా విధించవలసి వస్తుంది దీనివల్ల మెట్ట ప్రాంతాలలో ఎక్కువశిస్తు ఇచ్చుకోవలసి వస్తుంది కాబట్టే ఇటువంటి ఇబ్బందులు లేనివిధంగా ఒకపంట అయితే 10 రూ లు, రెండు పంటలు అయినట్లయితే 15 రూ లు విధించవలెనని మా సవరణలో సూచించడం జరిగింది. మేము సెలక్టు కమిటీలో కూడ ఇటువంటి సవరణ పెట్టాము ప్రతిపక్షంవారు సవరణలు పెడతారు వాటిని అంగీకరించనక్కరలేదనే నెగిటివ్ పాలసీని అవలంబించడం సరయిన పద్ధతికాదని మనవి చేస్తున్నాను ప్రభుత్వ విధానంలో కొంత ఫ్లెక్సిబిలిటీ ఉండాలి ఒక రూపాయి, లేక అర్ధరూపాయి, లేక నాలుగు అణాలు తగ్గించినందువల్ల ఒక లక్షరూపాయల ఆదాయం తగ్గిపోయినట్లయితే కొంప మునిగిపోయినట్లుగా భావించడము సమంజసమయిన విషయంకాదు. ప్రభుత్వ పక్షంనుంచి కొన్ని చిన్న సవరణలు పెడితే అంగీకరించడానికి సిద్ధంగా ఉన్నవారు మేముకూడ అటువంటి సవరణలు పెడితే ఎందుకు అంగీంరించరాదని అడుగుతున్నాను. ఇటువంటి నెగిటివ్ ఆటిట్యూడ్ మంచిదికాదని తెలియచేస్తున్నాను

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య (సత్తెనపల్లి)· నేను నెం 5, 6 సవరణల మీద మాట్లాడుతున్నాను. నీటితీరువ మేగ్జిమమ్‌కు రీచ్ అయిన ప్రాంతములలో దానిని మించకుండా ఒక లిమిట్ పెట్టారు కాని మినిమమ్ శిస్తు ఉన్నచోట్ల రైతులు ఎక్కువ భారాన్ని భరించవలసి వస్తున్నది. ఉదాహారణకు శ్రీకాకుళం జిల్లాలో 6-8-0 విశాఖపట్టణం జిల్లాలో 9-8-0 గోదావరిడెల్టాలో 14-8-0 గోదావరి అప్‌లాండ్సులో 13-8-0, కృష్ణాజిల్లాలో 11-14-0 గుంటూరు జిల్లాలో 12-8-0 మేగ్జిమమ్‌రేట్సు ఉన్నాయి. కొన్ని జిల్లాలలో తక్కువగాను, మరికొన్ని జిల్లాలలో ఎక్కువగాను ఉన్నాయి మేగ్జిమమ్‌రేట్సు ఉన్నచోట్లలో పంటలుకూడ ఉన్నతస్థాయిలో ఉన్నప్రాంతాలు కొన్నిఉన్నాయి పంటవెనుకబడిన ప్రాంతాలుకూడకొన్నిఉన్నాయి మనము శిస్తు విధించేటప్పుడు పర్సంటేజ్

రాలవరకు లెక్కకట్టి, అంతవరకు పన్ను అదనంగా వేయము అని ఒక నిర్ణయానికి రావలసియున్నది Minimum గా ఉన్నవికూడ maximum reach కావాలనే ప్రయత్నం చేస్తే భారమయి పోతుంది Minimum పన్ను, maximum reach కాదు అనే పద్ధతిలో minimum, maximum నిర్ణయించాలి 2, 3 మించకుండా ఉండే పద్ధతిలో నిర్ణయిస్తే ప్రయోజనంగా ఉంటుంది లేకపోతే నష్టంగా ఉంటుంది కనుక ఈ రెండు అమెండ్‌మెంట్సు ప్రభుత్వం అంగీకరించాలని అభ్యర్థిస్తున్నాను

*శ్రీ డి. నరసయ్య (ఇల్లందు-రిజర్వుడు) అధ్యక్షా, ఈ సారైనా మంత్రి గారు సమాధానం చెపుతారని అనుకొంటున్నాను మొత్తంగా ఈ సవరణలు 12 వరకు కలిపి చర్చించుటకు వారు ఒప్పుకొన్నారుకాబట్టి కొంచెం మౌన ముద్ర వదులుతారని ఆశిస్తున్నాను ఇంతకుముందు మాట్లాడిన వావిలాల గోపాలకృష్ణయ్యగారు ఈ సవరణలకు సంబంధించిన వివరాలు మంత్రిగారి దృష్టికి తీసుకువచ్చారు రూ 2 నుంచి 10, 11 వరకుకూడ అక్కడ నీటి తీరువ ఉన్నదని తెలుసుకొన్న తరువాత, 2 రు లు యిచ్చే వానిమీద ఎంత పెద్దభారం పడుతున్నదో అర్థం అవుతుంది కృష్ణా, గోదావరిలాంటి డెల్టా ప్రాంతాలలో తప్ప మిగిలిన ఆంధ్ర జిల్లాలంతటా చిన్నచిన్న చెరువులక్రిందనే వ్యవసాయం జరుగుతున్నది ఆ చెరువులకు నీటి గ్యారంటీ లేదు అక్కడ సేద్యంచేసే రైతాంగంమీద ఈ భారం పడకుండా ఉండడం కోసం, యిప్పుడు వున్న సిస్టములోని ఎగుడు దిగుడులను కొంతవరకయినా సర్దుకొని ఆదాయం పెంపొందించుకొనుటకు మా సవరణలు తోడ్పడతాయి కాబట్టి, వాటిని తప్ప కుండా మంత్రిగారు ఆమోదించాలని కోరుతున్నాను

*శ్రీ బి శంకరయ్య (బుచ్చిరెడ్డిపాలెం-జనరల్) అధ్యక్షా! చిన్న రైతులమీద యీ wet assessment వేయుట సరైన పద్ధతి కాదు అసలు పన్నులు వేయుటకు ప్రతిపక్షం వ్యతిరేకమని ప్రభుత్వ పక్షంవారు చెపుతూ వచ్చారు. కాని రెండు సంవత్సరములుగా వరుసగా వేస్తున్న పన్నులకు మేము యిచ్చిన సూచనలనుబట్టి ప్రతిపక్షంకూడ పన్నులు వేయాలని, ఆదాయం సంపాదించాలని చెపుతూనే ఉన్నది. కాని ఆ పన్నులు యిచ్చుకొన గలిగిన వారిమీదనే వేయవలెనుగాని, తన కుటుంబ పోషణకే చాలనటువంటి ఆదాయం గలవారిమీద వేయరాదని మేము స్పష్టం చేశాము. అందువల్ల ప్రతిపక్షం పన్నులు వేయుటకు వ్యతిరేకమనే మాట పదేపదే వారు చెప్పటం విరమించు

కున్నారు ప్రభుత్వపక్షంవారు యింకా ఏమని చెప్పేవారంటే—మా పార్టీ సిద్ధాంతం యిది మేము పన్నులు వేస్తాము అని చెప్పేవారు కాని ఆ విధముగా యిప్పుడు పదేపదే వారు చెప్పే పరిస్థితిలో లేరు నిన్న, మొన్న, జరిగిన కాంగ్రెసు లెజిస్లేచరు పార్టీలో యీ పన్నుల విషయమై చర్చించి చివరకు ఒకటి రెండు వాయిదాలు వేసుకొని పాస్ చేసుకున్నారె మోగాని యీవాడు పన్నులువేయుట కాంగ్రెసు సిద్ధాంతం అని చెప్పినాకూడ ప్రజలు నమ్మే స్థితిలో లేరని వారు గ్రహించారు 1930 నుంచికూడ, సామాన్య ప్రజలమీద పన్నుల భారం ఎక్కువగా ఉన్నదని, తగ్గించాలని ఆందోళన చేసిన పార్టీలలో కాంగ్రెసు పార్టీ ఒకటి అందువల్ల పన్నులు వేయుట కాంగ్రెసు సిద్ధాంతం అని మాటి మాటికి చెప్పుటకు ఆస్కారం లేకుండా ఉన్నదని కాంగ్రెసు పక్షంలో ఎక్కువ మంది తెలుసుకొన గలుగుతున్నారు పత్రికలలో వచ్చిన వార్తలనుబట్టి, కాంగ్రెసు పార్టీలో జరిగిన చర్చలనుబట్టి, ఈ పన్నులు వేయుటలో కాంగ్రెసు సిద్ధాంతాలకు వ్యతిరేకంగా పోతున్నారని, ప్రజలమీద పన్నులభారం పెంచకుండా తగ్గించాలని, వారు గుర్తిస్తున్నట్లు తెలుస్తున్నది ఆ పన్నులు వేయుట కాంగ్రెసు సిద్ధాంతమని బయట ప్రజలనుకూడ నమ్మించే పరిస్థితిలోలేరు పదిరూపాయల వరకు భూమి శిస్తును రద్దుచేస్తామని ప్రభుత్వం తరపున చేసిన హామీని అమలు పరుస్తామని 1955 లో జరిగిన ఎలక్షనులో వోట్లు అడిగినప్పుడు చెప్పారు అందువల్ల యిప్పుడు కాంగ్రెసు సిద్ధాంతం ఏమిటి? 1930 నుంచి ఒక సిద్ధాంతము చెప్పి, ఓట్లు అడిగేటప్పుడు ఒక సిద్ధాంతంచెప్పి, యివాళ యింకొక సిద్ధాంతం చెపితే ప్రజలు నమ్మే పరిస్థితిలో లేరు భూమిశిస్తు పదిరూపాయల లోపువాళ్ళకు మాఫీ చేస్తామనిచెప్పి, యిది కాంగ్రెసు సిద్ధాంతమని ఓట్లు అడిగి యిప్పుడు ఆ విధంగా మాఫీ చేయకుండా, వాళ్ళందరిమీద యింకా ఎక్కువ చేస్తామని, యిది కాంగ్రెసు సిద్ధాంతమని చెపితే నమ్మే పరిస్థితులు లేవు రైతులమీద అధిక పన్నులు వేసి పంటలు పండక పోయినా పెళ్ళాము మెళ్ళో పుస్తె అయినా, యింట్లో చెంబు తప్పాలా అయినా అమ్మి శిస్తులను తీసుకుంటాము, అంతవరకు రైతులను నిలుపుతాము ప్రతిపక్షం రైతులను నిలిపేది కాదు అని ఆ విధంగా ప్రజలను నమ్మించాలని ఆఖరు ప్రయత్నంగా చేస్తున్నారు ప్రతిపక్షం కమ్యూనిస్టుపార్టీగాని, పి డి యఫ్. గాని, ఎవరూ రైతులను నిర్బంధించి భూములను బలవంతంగా లాక్కుంటామని అనలేదు. ఈ మధ్య మైసూరులో జరిగిన గ్రామదాన సమావేశమునకు వినోబా భావేగారు అందరినీ ఆహ్వానించారు అక్కడ జరిగినటువంటి నిర్ణయాలు బల వంతంగా ఉన్నవని బయట ఎంతోమంది అంటున్నారు. అందువలన కాంగ్రెసు

పక్షం పన్నులే వేస్తారుగాని, ప్రతిపక్షమయితే భూములనే లాక్కుంటారు అని చెపితే ఎవరూ నమ్మరు రైతులనుంచి బలవంతంగా భూములను లాక్కోవలె ననే అభిప్రాయం ప్రతిపక్షానికి ఎప్పుడూ లేదు అందువలన ఆ విషయాన్ని పదే పదే చెప్పవలసిన పనిలేదు చెప్పినప్పటికీ నమ్మే పరిస్థితులులేవు ఇప్పుడు కేంద్ర ప్రభుత్వం పన్నుల విషయంలో ఎంతోమంది నిపుణులతోకూడిన కమిటీలను వేసి దేశమంతటా పన్నులవిధానం గురించి విచారించారు తమ కుటుంబ పోషణకే సరిపోనటువంటి ఆదాయంమీద పన్ను వేయమని వారెవరయినా చెప్పారా? ఆ కమిటీలవారు చేసిన సూచనలు ఏమిటి? ఆస్థులకు విలువకట్టి సంవత్సరానికి యింత పన్ను అని ఎందుకు తీసుకోకూడదు అన్నారు దీనిని కేంద్రప్రభుత్వం అమలులోపెట్టి వ్యవసాయాన్ని మినహాయించింది "ప్రభుత్వానికి ఆదాయం లేదు అందుచేత పన్నులువేసి ఆదాయాన్ని పెంచుకోవాలి" అని ప్రభుత్వం ఒక వైపున చెబుతూ, మరొకవైపున వ్యవసాయ ఆదాయంమీద వేసే పన్నును రద్దుచేయాలని చెబుతున్నారు పేదరైతాంగంమీద పన్నులు వేయటం ప్రభుత్వ విధానం గాని, ఉన్నవాళ్ళమీద పన్నువేయటం ప్రభుత్వవిధానం కాదని దీని వలన మనకు తెలుస్తోంది. ప్రభుత్వం అవలంబించే యీ విధానాన్ని కాంగ్రెసు పార్టీలోని వారూ అంగీకరించడం లేదు ప్రజలూ అంగీకరించటంలేదు ఇది వారి ఎన్నికల ప్రణాళికకుకూడా విరుద్ధంగా ఉందికాబట్టి యీ పన్నుల బిల్లును వాయిదావేయాలని కోరుతున్నాను. సాధారణమయినటువంటి, కుటుంబ నిర్వహణకే చాలనటువంటి భూమిగలవారిని యీ పన్నులనుంచి మినహాయించి మిగిలిన పెద్దపెద్దవారిపై పన్నులు విధించేందుకు వీలుగా ఇప్పుడు యీ బిల్లును వెంటనే వాయిదా వేయవలసిందిగా కోరుతున్నాను.

*శ్రీ యం నాగిరెడ్డి అధ్యక్షా, ఈ సవరణలగురించి అనేకమంది మిత్రులు అనేక విషయాలు ప్రభుత్వదృష్టికి తీసుకువచ్చారు ఈ మూడు పన్ను బిల్లులు ప్రవేశపెట్టినప్పుడు, జనరల్ డిస్కషన్ సందర్భములోనూ కళా వెంకట రావుగారు చెబుతూవచ్చారు "ఆంధ్ర తెలంగాణా ప్రాంతాలలో పన్నుల విధానములో అనేక అవకతవకలు ఉన్నాయి. ఆ పన్నుల విధానాన్ని ఒక పద్ధతి లోకి తీసుకురావటానికి ప్రయత్నిస్తాము. అందుకు సవరణలు త్వరలోనే తీసుకు వస్తాము. కాని ప్రభుత్వానికి ఆదాయం కోసం, యీ లోపలే పన్నులు వేయ వలసివస్తున్నది అందుచేత యీ పన్నులు వేస్తున్నాము" అని. అయితే యీ రెండు ప్రాంతాలలోగల పన్నుల విధానాన్ని ఒక పద్ధతిలో తీసుకురావటానికి కొంత ఆలస్యం పడుతుందని మంత్రిగారే అంగీకరిస్తున్నారు. ప్రభుత్వం పన్ను

లను స్టాండర్డైజ్ చేసి, ఆంధ్ర తెలంగాణాలలోని పన్నులను ఒకేపద్ధతిలోకి తీసుకువచ్చే ఉద్దేశమే నిజానికి ప్రభుత్వానికి ఉంటే, ప్రభుత్వము తప్పనిసరిగా మేము పెట్టిన సవరణలను అంగీకరించవలసి ఉన్నది తెలంగాణా ప్రాంతంలో పన్నుల రేట్లు చాలా ఎక్కువగా ఉన్నాయి ఆంధ్రలో చాలా తక్కువగా ఉన్నాయి తక్కువగా ఉన్న ఆంధ్రప్రాంతంలో వెట్ అసెస్మెంట్ పెంచుతున్నా మంటున్నారు "మేము వేసే వెట్ ఎసెస్మెంట్ ఇంత మోతాదుకు మించి ఉండకూడదు అంతకు ఎక్కువశిస్తు ఉంటే తగ్గా"లని ఉంది ఉన్నటువంటిశిస్తులను స్టాండర్డైజ్‌చేసి, ఎక్కువశిస్తు ఉన్నచోట్లతగ్గించి, రెండుప్రాంతాలలో శిస్తులు సమానస్థాయిలో పెట్టాలనే ఉద్దేశం ప్రభుత్వానికి ఉంటే మేము ఇచ్చిన సవరణను అంగీకరించాలి మేము యిచ్చిన సవరణ సింగిల్‌క్రాప్‌కు పది రూపాయలు, డబుల్ క్రాప్‌కు రు 15 లు అనివున్నది ఇదిగాక ఇంకా సవరణలు ఉన్నాయి 12, 18 రూపాయలు అని వివిధరకాల మా సవరణలు ఉన్నాయి నిజానికి రెండు ప్రాంతాలలోని పన్నులను ఒకపద్ధతికి తీసుకురావాలని, యీ రెండు ప్రాంతాలలోని శిస్తును సమానస్థాయిలోకి తీసుకురావాలని ప్రభుత్వానికి ఉద్దేశం ఉంటే, మా సవరణలు అంగీకరించటములో ప్రభుత్వము ఏమాత్రము సంకోచించ నక్కర లేదు ఎక్కువ శిస్తు ఉన్నచోట తగ్గించి, ఇప్పుడున్న ల్యాండ్ ఎసెస్మెంట్ రేటును అన్ని ప్రాంతాలకు వర్తింపజేసి, పన్నుల విధానాన్ని ఒకే పద్ధతిలో రాష్ట్రమంతా సమన్వయం చేయాలనే ఉద్దేశమే ప్రభుత్వానికి ఉంటే, యీ సవరణలను అంగీకరించాల్సి ఉంటుంది. అలా కాకుండా "తాత్కాలికంగా యీ పన్నులు వేస్తున్నాము ఏ బురదకు ఆ రాయి అడ్డం వేసుకొన్నట్లు, ఇప్పుడు యీ అసెస్మెంట్ వేస్తున్నాము. దానిని అంగీకరించండి" అనటం సరైంది కాదు ప్రతిపక్షం ఎలాగూ సూచనలు చేస్తున్నది ప్రభుత్వపక్షంవారుకూడ అదేవిధంగా సూచనలు చేస్తూంటే, వారి ఆమోదం పొందటంకోసం "కాస్త ఆగండి ముందు ఏదో చేస్తాం"అని ప్రభుత్వం వారు అనటం, ఏ బురదకు ఆరాయి అడ్డం వేసుకొన్నట్లు, తాత్కాలికంగా తప్పించుకోటానికి చేసే ఆర్గ్యుమెంట్ తప్ప వేరొకటి కాదు. ఇప్పుడు మేము పెట్టిన సవరణలు ప్రభుత్వంవారు రేపు పెట్టే స్టాండర్డైజేషన్‌కు దోహదం చేసేటటువంటివి ప్రభుత్వం యీ సవరణలు అంగీకరిస్తే "ప్రభుత్వం ఆరునెలలకైనా, సంవత్సరానికైనా, లేక 1962 కైనా స్టాండర్డైజేషన్ చేస్తుంది ఇకముందైనా మాకు పన్నులభారం తగ్గుతుంది" అని తెలంగాణా ప్రాంతంలో ఉన్న రైతాంగానికి ఒక ఆశ ఉంటుంది ఎన్నికలకు ముందు కాంగ్రెసు పి.సి.సి. చేసిన తీర్మానము అమలు పర్చుటకు వీలయిన యీ సవరణను, ప్రభుత్వపక్షం

వారు చెబుతూన్న వాటికి ప్రథమ సోపానంగా ఉండినటువంటి యీ సవరణలను ప్రభుత్వం అంగీకరించకపోతే, ముందైనా యీ ప్రభుత్వం రైతులకు మేలు చేస్తుందనే నమ్మకంగాని, ఆశగాని ప్రజలకు ఉండదు ప్రభుత్వపక్ష సభ్యులందరూ ఆలోచించండి కనీసం వెనుకబడిన ప్రాంతాలనుండి వచ్చిన ప్రభుత్వపక్ష సభ్యులైనా ఆలోచించండి మనం యీ మీటింగులు అయ్యాక మన గ్రామాలకు, మన నియోజకవర్గాలకు వెళ్ళినపుడు, అక్కడి ప్రజలు మనలను అడుగుతారు మనం ఇక్కడనుంచి యీ పన్నులు తీసుకుపోతున్నాము ప్రభుత్వపక్ష సభ్యులకూ ఉత్తరాలు వస్తున్నాయి టెలిగ్రామ్స్ వస్తున్నాయి పిటీషన్స్ వస్తున్నాయి "వారు నిర్ణయంచేసి చెప్పారు, మేము అంగీకరించటమే" అని చేతులు ఎత్తి బలపర్చినంత మాత్రాన లాభం లేదు రేపు వారు తమ గ్రామాలకు వెళ్ళినపుడు, అక్కడి ప్రజలు నిలవదీసి అడుగుతారు అప్పుడు వారు ప్రజలకు సమాధానం చెప్పుకోవలసి ఉంటుంది కాబట్టి సభ్యులందరూ చేయూత నిచ్చి, యీ అమెండుమెంట్లను ఆమోదించవలసి ఉన్నది "మేము మెజారిటీలో ఉన్నాము మాలో నలుగురైదుగురు చేసిన నిర్ణయాన్ని అందరిమీద రుద్దుతాము" అని అంటే, ఒక్క ప్రతిపక్షంమీద మాత్రమే రుద్దటంకాదు మొత్తం మూడుకోట్ల ఆంధ్రప్రజలమీద రుద్దేటటువంటి యీ పన్నుల విధానాన్ని తీవ్రంగా వ్యతిరేకించాలి "మాకు ఓటు ఇచ్చిన ప్రజలందరిమీద రుద్దేటటువంటిపన్ను" అన్నది ప్రభుత్వపక్షసభ్యులు గమనించి, యీ సవరణలను బలపర్చవలసి ఉన్నది ఆవిధంగా చేయకపోతే, కనీసం తటస్థంగా ఉండాలని కోరుతూ యీ సవరణలను బలపరుస్తున్నాను.

శ్రీ బసవ మానయ్య (అందోలు) అధ్యక్షా! ఆంధ్ర ప్రాంతానికి సంబంధించినంత వరకు భూములపై నీటి పారుదల పన్నును హెచ్చించడము జరుగుతున్నది కాని పరోక్షంగా ఇది తెలంగాణా ప్రాంతానికి కూడ చాలా నష్టదాయకమని మనవిచేస్తున్నాను. తెలంగాణా ప్రాంతంలో, ఏక్ ఫసలా, దో ఫసలా భూములకు (సంవత్సరానికి రెండుసార్లు పంట పండించు భూములకు) 15 రు-నుంచి 30 రు వరకు పన్ను ఉన్నది. ఆంధ్ర ప్రాంతంలో నీటిపారుదలమంచి వరి సాగుచేసే భూములకు 10 రు. వరకు శిస్తు ఉన్నది. అంటే, తెల్లంగాణా ప్రాంతంకన్నా, ఆంధ్ర ప్రాంతములో చాలా తక్కువ శిస్తు ఉన్నది. తెలంగాణా ప్రాంతంలో పన్నులు తగ్గించి, మొత్తం ఆంధ్ర తెలంగాణా ప్రాంతాలలోని పన్నులను సమన్వయం చేయాలని ప్రజలు కోరుతున్నారు, ప్రజాసంస్థలు కోరుతున్నవి. ఇప్పుడు ఆంధ్ర

ప్రాంతంలో నీటిపారుదలనుంచి పండించే పంటభూములకు పన్ను ఎక్కువ చేస్తున్నారు 1366-67 ఫసలీలో 18¾ పర్సెంటునుంచి 37½ పర్సెంటుకు హెచ్చింపబడినది ఇప్పుడు ఒకసారి వరిపంట పండించే భూములకు ఎకరానికి 13-8-0 కు ఎక్కువ కాకుండా, రెండుసార్లు వరిపంట పండించే భూములకు ఎకరానికి 20-4-0 కు ఎక్కువ కాకుండా ఉండేవిధంగా లాండ్ అసెస్మెంటు పెంచబడింది ప్రతిపక్షం సూచించిన సవరణ ప్రకారం ఒకసారి పండించే పంటకు తరిభూమి ఎకరానికి 10 రు లు, రెండుసార్లు పండించే తరిభూమికి ఎకరానికి 15 రు ఉండాలని ఉన్నది ఇది సమంజసంగా ఉన్నది తెలంగాణాలో ఎకరానికి 30 రు ఉన్నది ఆంధ్రలో ఎకరానికి 10 రు ఉన్నది ఇప్పుడు మధ్యస్థంగా ఎకరానికి 15 రు పన్ను వేయాలని పెట్టటం చాలా బాగుంటుంది ముందుముందు యీ రెండు ప్రాంతాలలోని పన్నులను సమన్వయం చేయటానికికూడ ఇది బాగుంటుంది అన్ని పక్షాలనుండి సభ్యులు చెబుతున్న సూచనలు, అభిప్రాయాలు, మాటలు, ఇక్కడ షార్టుహాండు రైటర్సు వ్రాస్తున్నారు దానిని జుడిషియల్ దృష్టితో చూస్తే సెంటు పర్సెంటు ప్రతిపక్షానికే అనుకూలంగా ఉంటుంది ప్రతిపక్షంయొక్క ఉద్దేశానికి బలము సెంటు పర్సెంటు ఉన్నదని వ్రాతమూలకంగా తేలుతున్నది.

కాని డివిజన్‌కు వచ్చేటప్పటికి మాత్రము అది వారి ఇష్టానికి, మనస్సుకు విరుద్ధముగా ఉన్నది ఇది democracy అని ఒప్పుకుంటున్నారు. ఈ దృక్పథము నుంచి వారు ఉద్దేశ్యపూర్వకముగ చేస్తే, ఇతర సభ్యులు కూడ యీ సవరణను గురించి పది రూపాయిల శిస్తుకు బదులు నీటిపారుదలతో రెండుపంటలు పండించే పంటలకు 15 రూపాయిలు శిస్తు అనేది సమంజసముగనే ఉన్నది ఈ విషయమును గురించి గౌ రెవిన్యూమంత్రిగారు కొంచెము దీర్ఘముగ ఆలోచిస్తారని ఆశిస్తున్నాను ఇది రాబోయే తెలంగాణకు, ఆంధ్రకు ఉండే శిస్తుల తేడాను సమన్వయపరచడానికి వచ్చే బిల్లుకు కూడ ఉపయోగపడుతుందని మంత్రిగారికి హృదయపూర్వకముగ మనవిచేస్తూ, యీ సవరణను నేను బలపరుస్తున్నాను.

* శ్రీ కె సుబ్బారావు (హిందుపూరు-జనరల్) : అధ్యక్షా, ఇప్పటివరకూ ప్రతిపక్ష సభ్యులు యీ సవరణను గురించి విశేషముగ మాట్లాడారు. కాని యీ బిల్లులోని clause 3 (b) ను చదివితే తెలుస్తుంది. ఇందులో "So, however, that the additional assessment together with the Land Revenue assessment payable in respect of the land shall not exceed Rs. 13-50 n P. per acre in the case of single crop wet land and

Rs 20-25 n p per acre in the case of double crop wet land" అని clear గా వ్రాసిఉన్నది అంతే కాకుండా సభ్యులు అనంతపురంలో రెండు రూపాయలు ఉన్నదని, చిత్తూరులో యింకా హెచ్చుగా ఉన్నదని చెప్పారు కాని అదికాదు పరిస్థితి ఇప్పుడు ఉండేశిస్తు ఎంతో, ఆశిస్తు మీద 37½% వేస్తుందే కాని అన్నిచోట్లలో 20 రూపాయలు వరకు వేస్తున్నారు అనే భ్రమ కల్పించే టట్లుగా చెబుతున్నారు ఇప్పుడు వుండే single crop wet land కు రెండు రూపాయలే వుంటే, అది పదిరూపాయలకు పెరుగుతుందని ఏదో ఉపన్యాసాలు చేస్తే, ప్రజలందరు యిది తెలుసుకుని ప్రభుత్వము పన్ను జాస్తి చేస్తారనే భావము కలగటానికి ఆస్కారమవుతున్నది ఇప్పుడు ఏ assessment ఉన్నదో ఆ assessment పైన యిప్పుడు వెసే టటువంటి 37½% వేస్తుంది ఎక్కడైనా కాని ఎక్కువ అయ్యేటటువంటి సందర్భములో second crop పెట్టుకున్నప్పటి కిని, రు 25-50 న పై ల కంటె ఎక్కువ కాకుండా ఉండే టటువంటిదిగా ఉన్నది అంతేకాని దీన్ని ప్రజలలో ఊరకనే ఏదో అపోహలు కలిగించటానికి అనంతపురంలో ఉండేవారికి, చిత్తూరులో ఉండేవారికీ అందరికీ కూడ ఒక్కొక్క ఎకరానికి రు 25-50 న పై ల వరకు వేస్తారని భ్రమ కలిపించే టటువంటి ఉపన్యాసాలు చేశారు గనుక అది తప్పు అని అంటున్నాను ఇది సరిగానే ఉన్నది గనుక దీనిని ఒప్పుకోవలసిందిగా ప్రార్థిస్తున్నాను

*శ్రీ టి వీరరాఘవులు (కొవ్వూరు - రిజర్వుడు) అధ్యక్షా, ఇప్పుడు ప్రభుత్వ పక్షమువారు ప్రతిపాదించిన బిల్లును నేను బలపరుస్తూ, ప్రతిపక్ష నాయ కులు అయిన సుందరయ్యగారు చెప్పిన విషయాలను గురించి ఒక్క విషయము మాత్రము మనవి చేయదలచుకున్నాను వారియొక్క ఉపన్యాసములో ప్రభు త్వము యీ పన్ను సన్నకారు రైతులమీదనే వేస్తున్నది, పెద్ద పెద్ద భూస్వా ములమీద వేయడానికి జంకుతున్నదనే భావముతో మాట్లాడారు. అది సరియైనది కాదని నేను మనవి చేస్తున్నాను పన్నులు ప్రభుత్వము విధించకతప్పదు పన్నులు విధించవలసినదే పన్నులద్వారా వసూలు అయిన సొమ్ముతో దేశము ముందుకు పోవలసివున్నదనే భావముతో ప్రతి పక్ష నాయకులు సుందరయ్యగారు కూడ నాతో ఏకీభవిస్తారని అనుకుంటున్నాను అయితే యీ విధింపు అనేది కేవలము పేదరైతుల పైననే, డక్కాపడిన రైతుల మీదనే వేస్తున్నారనేది ఎంతవరకు నిజమో, యీ ఆరోపణ మాత్రము సత్యదూరమైనదని నేను మనవి చేయక తప్పదు. ఎందుకంటే, కేవ లము ఒక్క ఎకరమో, పది సెంటో, అయిదు సెంట్లో ఉన్న పేదవాడు కూడ

కాదు బొత్తిగా ఏ ఆధారము లేకుండాఉండి, రెక్కలమీద ఆధారపడి జీవించే వాడుకూడ పన్నులు కట్టుతునే ఉన్నాడు అతను చుట్ట కొనుక్కుంటే పన్ను యిస్తున్నాడు అగ్గిపెట్టె కొనుక్కుంటే పన్ను యిస్తున్నాడు మూరెడు గుడ్డ కొనుక్కుంటే పన్ను యిస్తున్నాడు భార్యకు రెవిక కొనుక్కుంటే పన్ను యిస్తున్నాడు కాబట్టి అలాంటి పేదవాడు భారము అని అనుకోకుండా పన్ను కట్టుతూంటే, కొద్దో గొప్పో పండించుకొంటున్న ఏమాత్రపు నిరుపేదరైతు అయినా కట్టుకోలేడని చెప్పడము న్యాయముగ లేదు అలాంటి రెక్కలమీద జీవించేవాడు పన్నులు కట్టుతూ పన్నుల భారమునకు భాగస్వామిగా ఉంటున్నప్పుడు ప్రతిపక్ష నాయకులు చెప్పేటటువంటి పేదరైతుకూడ ఎందుకు పన్నులభారమునకు భాగస్వామిగ ఉండటానికి సంశయించుచున్నాడు అనేది అర్థరహితము కాబట్టి అలాంటి పేదవాళ్లుకూడ పన్నులభారమును మీద వేసుకుని దేశకల్యాణానికి తోడ్పడుతూ దేశశ్రేయస్సు కొరకు కృషిచేస్తున్నప్పుడు, యీ పేదరైతులు కూడ అలా ముందుకు రావడమునకు సంశయించకూడదు కాబట్టి యీ విషయము సుందరయ్యగారు జ్ఞాపకము ఉంచుకోవలెనని కోరుతున్నాను భూస్వాములమీద పన్ను వేయటానికి ప్రభుత్వానికి యిష్టములేదని చెప్పారు ఇది నిరాధారమని అంటున్నాను ఎందుకంటే, భూసంస్కరణలు అమలులోనికి తెచ్చుకోవాలని అందరము తలపెట్టుకున్నాము అవి త్వరలో వస్తాయని ఆశించుతూ ఉన్నాము ఆసిద్ధాంతానికి మనమందరము సమ్మతించాము దానికి కావలసినటువంటి లెక్కలు అన్ని తయారు చేసుకుంటున్నాము యీ పరిస్థితులలో యిప్పుడు యీ పన్నుకు బదులు Agricultural Income-tax ఎందువల్ల వేయకూడదు అని అంటున్నారు ఈ విధముగ చెప్పడము, ఎంత సేపటికినీ ప్రజలను మభ్యపెట్టటానికి, పెడమార్గమున పట్టించడానికి పనికి వస్తుంది తప్ప, యీ ధోరణి సరియైనది కాదు ప్రభుత్వంవారికి సహాయపడటానికి తగినరీతిగా ప్రతిపక్షమువారుకూడ నిర్మాణాత్మకమైన సూచనలు చేస్తే చాలా బాగా ఉంటుందని నా అభిప్రాయము. దేశమును మన అందరియొక్క సహాకారముతో ముందుకు తీసుకునిపోవలసి యున్నది దానికి ప్రతి మానవుడు కూడ యింతో, అంతో వీలు అయినంతమటుకు తోడ్పడటానికి త్యాగము చేయాలి. మన దేశము ప్రస్తుతము చాలా బీదస్థితిలో ఉన్నదని అందరికీ తెలుసు పన్నులభారము ఉంటున్నదని కూడ తెలుసు కాని ప్రభుత్వముయొక్క ప్రస్తుత ఆర్థిక పరిస్థితులనుబట్టి, దేశశ్రేయస్సుదృష్ట్యా పన్నులు వేసుకోక తప్పదు. దీనికి అడ్డుపెట్టడము సమంజసము కాదు. కాబట్టి ప్రతిపక్షమువారు constructive suggestions యిచ్చి ప్రభుత్వానికి తోడ్పడకుండా, ఏదో "మేము opposition

పార్టీ కొరకే మాట్లాడుతున్నాము"అని అనకుండా, Opposition Party తరఫున తెచ్చిన ప్రతిపాదనలు అసాధ్యమైనవని వారే చెబుతూ, అవి ప్రభుత్వమువారు ఒప్పుకోలేకపోయారు, వాటికి సమాధానం చెప్పటానికి మంత్రిగారికి ఏమీలేదు అని అనకుండా, ప్రభుత్వము తీసుకునివచ్చిన బిల్లు అవసరమైనదే గనుక దీనిని నేను బలపరుస్తున్నాను ఈ సందర్భములో ప్రతిపక్షమువారు తెచ్చిన సవరణను ఉపసంహరించుకుంటే మంచిదేమోనని అభిప్రాయపడుతూ, సెలవు తీసుకుంటున్నాను

* శ్రీ కె వెంకటరావు అధ్యక్షా, Opposition Party వారు చేసే వాదాలకు ప్రతిదానికి ఒక ఉపన్యాసము చేయడము లేదని వారికి నా మీద ఎక్కువగ కోపము ఉన్నదని నేను అభిప్రాయపడుతున్నాను. వారు చేసే వాదాలలో యిదివరకు చెప్పినవిగాక యింకా ఏదైనా కొత్త points తీసుకుని వచ్చి ఉంటే, వాటికి సమాధానము చెప్పడానికి నాకుకూడా సరదాగానే ఉంటుంది ఇక చెప్పిన దానినే మరల చెప్పవలసి ఉంటున్నది ప్రతిపక్షము ప్రభుత్వపక్షము అంటే; యిది కోడిపుంజుల పందెము వంటిదిగా ఉంటుంది ఒకసారి పందెములోనికి దిగిన తరువాత ఎదురుగానో, చాటుగానో కత్తిపోటు పొడుద్దామని అనుకుంటే మరల దానికి ఏదో జవాబు చెప్పాలనేటటువంటి ఉబలాటము ఉంటుంది అది ఉండడమే గాకుండా దురదకూడ ప్రభుత్వపక్ష సభ్యులకు ఉంటుంది మంత్రులకు అంతకంటే తప్పకుండా ఉంటుంది అందు వల్లనే నేను జవాబు చెప్పడము మానలేదు ప్రతిపక్ష సభ్యులు తెచ్చేవి ఒకటే రకపు సవరణలు కావు ఒకరు 37 అని, యింకొకరు 37½ అని, మరొకరు 35 అని, యీ విధముగ ప్రతిఒక్కరు ఒక్కొక్క విధముగ సవరణలు తెస్తూంటే, ఇక ప్రతిదానికి ఒక్కటే ఉపన్యాసము చేయవలసి వస్తున్నది వీటికి నిన్ననే నేను సమాధానము చెప్పడము, నిన్ననే వాటికి ఓటు వగైరాలు తీసుకోవడము, అంతకు క్రితము consideration లోనికి తీసుకోమని కోరుతూ నాకు దీన్ని గురించి ఉన్న అభిప్రాయములు అన్నీ విపులముగానే చెప్పడము జరిగింది గనుక, యిక ప్రతి ఒక్క క్రొత్త amendment కూ గూడ మంత్రి గారు మూకీభావము వహిస్తున్నారు. వారికి సమాధానము చెప్పటానికి ఏమి లేదు, అని చెబుతూ పోతూంటే, అది న్యాయమైన విషయముకాదు. ప్రతి పక్షమువారికి పట్టుదలగా ఉంటే, ఇక నేను ప్రతిదానికి జవాబు చెప్పవలెనంటే, ఈ మంత్రిత్వము ఒప్పుకున్నందువల్ల యిక్కడ కూర్చోటానికి ఆవశ్యకత నాకుగూడ ఏర్పడింది గనుక కూర్చుంటున్నాను గాని, నేను దీనికి చెప్పవలసిన

సమాధానము అదివరకే పూర్తిగ చెప్పాను. ఇక క్రొత్తగ చెప్పవలసిన విషయము ఒక్కటి ఉన్నప్పటికినీ అది వదలి పెట్టవలెననే ఉద్దేశ్యము నాకుమాత్రము లేదు ప్రభుత్వానికి అంతకంటే లేదు Discussion లో ఎప్పుడైతే క్రొత్త point raise చేస్తారో, దానికి సమాధానము తప్పకుండా వస్తూనే ఉంటుంది ఇప్పుడు, అధ్యక్షా, అంటూ కొంతమంది మాట్లాడారు ఇంతమంది మాట్లాడారు గాని, అందులో ఒక్కరైన క్రొత్త point ఏదైనా తెచ్చారా? Gradation tax ను గురించి చెప్పారు దానికి యిదివరకే సమాధానము చెప్పాను ఎంతసేపటికీ పేదవారు, సాదవారు అంటూ మాట్లాడారు దానిని ప్రతిదినము, ప్రతి సందర్భములోకూడా చెబుతునే ఉన్నారు దానికి జవాబు చెప్పడముకూడ జరుగుతూనే ఉన్నది పదిసార్లు పేదవారు, పేదవారు అంటూ ఉపన్యాసాలు చేస్తే, వాళ్ళువచ్చి కౌగలించుకోవడము లేదు భాగ్యవంతులు, భూస్వాములు అంటే వాళ్ళు మనలను నెత్తిమీద పెట్టుకుని ఊరేగడములేదు అందువల్ల దీనిలో కూడ ప్రత్యేకత ఏమీ కనబడడము లేదు ప్రతిసారిగూడా నేను చెబుతూనే ఉన్నాను

అయితే ఇందులోమాత్రము శంకరయ్యగారికి కాంగ్రెసు పార్టీ యొక్క అభ్యుదయమును గురించి— పాపము! చాలా కష్టముగా ఉంటున్నట్లున్నది, కాంగ్రెసు అభ్యుదయను వారు కోరినట్లయితే, వారుప్రతిపక్షపునై పున అభ్యర్థిగ stand కావలసిన అవసరము వారికి ఉండేదేలేదు మా బాధ మేముపడతాము. వారిబాధను గురించి మేము ఎప్పుడుకూడ అడగడములేదు కాని కాంగ్రెసు పార్టీలో ఓటింగు ఏవిధముగ వచ్చినదో వారికి కావలసివచ్చినది! అధ్యక్షా, మీరు దీన్నిగురించి చర్చించనివ్వరు కాని శంకరయ్యగారు ఒక్కముక్క అన్నారు గనుక నేను దానికి జవాబుచెప్పక తప్పటలేదు ఒకటి, రెండు మెజారిటీతో కాదు, 158 గురు అనుకూలురు 11 మంది వ్యతిరేకులు. ఇంత మెజారిటీ వచ్చింది ఈ రహస్యము నేను చెప్పవలసిన ఆవశ్యకత నాకులేదు కాని, కాంగ్రెసు పార్టీలో ఎవరెవరో వ్యతిరేకంగా ఉన్నారు అని, దానిని గురించి యిష్టములేకుండా ప్రభుత్వముయొక్క మద్దత్తువల్ల ఇది జరుగుతున్నదని ఎవరైనా అపోహపడితే, వారికి ఇచ్చే సమాధానము మాత్రము ఇది. దీన్ని గురించి శంకరయ్యగారు మమ్ములను గురించి ఎప్పుడూకూడ బాధపడవక్కరలేదు. వారు మేము చేసే తప్పులు అన్నీ జ్ఞాపకము పెట్టుకుని, ప్రజానీకం, ప్రజానీకం అని Inverted comas లో పెట్టుకుని వారివద్దకు వెళ్ళి, వారికిచెప్పి, వాళ్ళకు మామీద ఉన్నటువంటి సదుద్దేశ్యమును మార్చుకుంటూ పోవటానికి

ఎప్పటికప్పుడు వారికి అవకాశము ఉన్నది ఆ అవకాశమును exercise చేసుకోవడము న్యాయము కాని ఇక్కడ $30\frac{1}{2}$ ఉండాలా, $31\frac{1}{2}$ ఉండాలా అంటూ యీ విధముగ amendments తీసుకుని వచ్చి discussion లో పెట్టి, వెంకట్రావుగారు దీనికిసమాధానము చెప్పడములేదు, ఆయనకు మతిపమైనా పోయిందేమో, లేకపోతే యింకా ఏమిటో అయిందని అనుకోవడము మాత్రము చాలా పొరబాటైనవిషయము

ఇంకొక విషయము ప్రతిపక్షమువారు చెప్పారు. అది వారి party policy నేనుకూడ దానిని విమర్శించడమునకు యిప్పుడు అదును కాదు. వారు పెట్టుకున్న పేరునుబట్టి మేము పొరబాటు పడుతున్నాము, ఆ పేరు కాకపోతే నాకు దానితో సంబంధము లేదు మార్క్స్ అనేఆయన ఒకరున్నారని, అయన "communism" అని ఒక సిద్ధాంతమును చేశారని, దానికి Lenin గారు ఒక గొప్ప వ్యాఖ్యానము వ్రాశారని, అది రెండు కమ్యూనిస్టు దేశాలలో సుప్రసిద్ధ ముగ ఆచరణలో ఉన్నదని, యిక్కడ Communist party అంటే, ఆయన యొక్క సిద్ధాంతమును ఉల్లంఘించకుండా ఉండే వ్యవహారము చేస్తారని పొరబాటుపడి ఉండవచ్చునేమో మేము అదేగనుక అయితే, సుందరయ్యగారిని అనటానికి ఏమీలేదు కాని శంకరయ్యగారు చెప్పింది మాత్రము అబద్ధము Marx creed నే అమలులోనికి పెట్టిన Lenin creed యే రష్యా, చైనా దేశాలకు పెద్దదేగనుక, పుస్తకాలలోను పత్రికలలో చదువుకుంటె వారు చెప్పింది మాత్రము నిజము కాదు కాదుఅని అంటారా, India కు వేరే ప్రోగ్రాముఉందని అనుకుంటారా, అది వేరే సంగతి కాని పెట్టుకున్న పేరుమాత్రము— నేను నామాలు పెట్టుకున్నాను కాని నేను వైష్ణవుణ్ణి కాను, నేను వీభూతి పెట్టు కున్నాను గాని, నేను విష్ణుభక్తుడనని అనుకొనడం ఏవిధముగ లేదో, ఒక party యొక్క creed అని ఒప్పుకున్నతరువాత దానికి యింతవరకు ప్రపం చానికి తెలిసిన పద్ధతిని దాటి మేము వెళ్ళుతున్నామని చెప్పడము న్యాయమైన విషయము కాదనిమాత్రమే నేను మనవిచేస్తున్నాను.

తరువాత ఎవరిభావాలు వారికున్నాయి, తప్పులేదు, ఆ భావాలనే ప్రజల ఎదుట పెట్టుకుంటున్నాం. ప్రజలయొక్క ఆమోదం ప్రకారం అమలు లోకి వస్తాయి. ఇవ్వాళ నేను అనుకునే భావాలు ఏమీ మారడంలేదు ఆ భావాల ప్రకారమే ముందుకు వెళుతున్నామని నేను మనవి చేస్తున్నాను. ఈ సందర్భంలో వారికివిశ్వాసం చేకూర్చేయత్నం నేను చేయడంకంటె వారుచెప్పిన

మీద ప్రజానీకం—లేక మరెన్ని విశేషణాల నుపయోగించినా, ఆప్రజానీకందగ్గరకు వెళ్ళి వారియొక్క బలంతోటి, వారి అనుకూలత లక్ష్యం అయినంతవరకు పాలిస్తామనే ఉద్దేశ్యంతోనే మా పార్టీ పనిచేస్తున్నది అందువల్ల మా పార్టీమీదకి వెళ్ళవద్దు వారిపార్టీమీదికి వెళ్ళడం ఎప్పుడూ నాకు అలవాటులేదు శ్రీసుందరయ్యగారు ఒక విషయింమాత్రం చెప్పారు "War emergency లో ప్రతివాళ్ళమీద పన్ను వేయడంలో న్యాయంవుంది కాని యివ్వాళ అందరిమీద పన్ను వెయ్యడంలో న్యాయమేముంది ?" అనే ప్రశ్నను వారి ఉపన్యాసంలో వదిలిపెట్టారు నేనీరోజు అనుకునేదేమిటంటే మనం ఎరిగివుండగా కొంచెం హెచ్చు తక్కువగా ఇండియాలో యుద్ధం రాలేదు జపాను యుద్ధం మన సరిహద్దులలోకి వచ్చి వెనక్కు వెళ్ళిపోయింది యుద్ధం అంటే యేమిటో సుమారు 150 సంవత్సరాలనుంచీ అంత గొప్పగా ఎరుగము సిపాయిలు యుద్ధం చేసినప్పుడు కొంతవరకు దేశములో జరిగి వుండవచ్చు కాని యివ్వాళ ఇండియాలో 'War emergency' కంటె 'peace emergency' చాలా ఎక్కువగా వుందని మనవి చేస్తున్నాను ఉద్రేకంలేని సమయంలో మనం చేయవలసిన సమీకరణమీద ఇది జరుగుతుంది అందుచేత యివ్వాళవున్న emergency ని నేను "రామరాజ్యం emergency" అని పిలుస్తున్నాను ఆ "రామరాజ్యం emergency" కోసం ప్రభుత్వం చేసే చర్యలు అవసరమని మేము నమ్ముతున్నాము వాటియొక్క ఫలితంవల్ల దేశానికి వచ్చేలాభాన్ని చూపెట్ట గలుగుతామా, చిరకాలం యీ దేశాన్ని పరిపాలిస్తాము ఈ "రామరాజ్యం emergency" ని వినియోగించుకోవడంలో దానికి పంచవర్ష ప్రణాళిక అనీ, ఇంకోటన్నా ఎన్ని పేర్లు పెట్టినా ఆ ideology ని సరిగా తీసుకువచ్చి దేశంలో స్థిరము చేయలేకపోతామా, వెనుకటి సామ్రాజ్యాలవలె, వ్యక్తులవలె, పార్టీలవలె, అందరివలె కాలగతిలో కలిసిపోతాము స్థిరీకృతమైన బుద్ధితోటి, నిర్ణీతమైన కార్యక్రమంతోటి దేశంయొక్క అభ్యుదయంకోసము చేసేటటువంటి ప్రతి చర్యలోనూ కూడా మాపార్టీలో తప్పులెంచడంకంటె 'గురివిందగింజ' తనయొక్క లోపాన్ని కూడా చూసుకోవడం మంచిదని మనవిచేస్తూ యీ సవరణలను త్రోసి వేయవలసినదని ప్రార్థిస్తున్నాను

*Mr Speaker* I shall put amendments Nos 5 and 6 to vote now.

*Sri P. Sundarayya*. I want the names to be recorded, Sir.

*Mr. Speaker* No, it is left to the discretion of the Speaker to decide by voice vote or otherwise.

శ్రీ పి సుందరయ్య Division కోరేవారికి పేర్లవారీగా పిలవండని చెప్పే హక్కు వుంది

మిస్టర్ స్పీకర్ లేదు

శ్రీ పి సుందరయ్య లేకపోవడం సవ్యం కాదు మన Rules లో వుందనుకుంటాను

మిస్టర్ స్పీకర్ లేదు

శ్రీ పి. సుందరయ్య ఇది చాలా ముఖ్యమైన సవరణ

మిస్టర్ స్పీకర్ వరుసగా వస్తున్నాము. ప్రతి సవరణకు పేర్లు అడిగితే వీలుపడదు

శ్రీ పి సుందరయ్య ప్రతి దానికి అడగడంలేదు. ముఖ్యమైన సవరణలకే పేర్లడుగుతున్నాను ఇది ముఖ్యమైనది

*Mr Speaker* I shall read the relevant Rule —

"222. Method of taking votes (1) On the conclusion of the debate on the motion, the Speaker shall put the question to the vote of the Assembly and shall decide it by voices If the opinion of the Speaker as to the decision of the Assembly is challenged, he shall take the votes of the Assembly by division

(2) The Speaker shall determine the method of taking votes by division... "

So, the right vests in me and I cannot surrender it. At the same time I shall try to accommodate all the parties as much as possible.

ఈ ఒక్క దానికి మాత్రం పేర్లు తీసుకుంటాను

The question is :

1. "In sub-clause 1 (b) of clause 3 for the words 'Rupees thirteen and naya paise fifty' substitute the words 'Rupees ten'."

2 "In sub-clause (1) (b) of clause 3 for the words 'Rupees twenty and naya paise twenty-five' substitute the words 'Rupees fifteen' ' "

The motion was negatived

*Sri P Sundarayya* I demand division, Sir.

The House then divided

Ayes — 40

1 Sri P Sundarayya
2 Sri Pillalamarri Venkateswarlu
3 Sri Ch Rajeswara Rao
4 Sri K L Narasimha Rao
5 Sri G Yellamanda Reddy
6 Sri B Shankariah
7 Sri S Kasi Reddy
8 Sri V Visweswara Rao
9 Sri M Nagi Reddi
10 Sri D Narasayya
11 Smt A Kamala Devi
12 Sri K Ramachandra Reddy
13 Sri B Dharma Bhiksham
14 Sri L Venkata Reddy
15 Sri N Peddanna
16 Sri V K Prasada Rao
17 Sri Anantha Reddy
18 Sri Ranganatha Rao
19 Sri B Narasimha Reddy
20 Sri G Lakshma Reddy
21 Sri P Chokka Rao
22. Sri G Nageswara Rao
23 Sri Md Tahseel
24 Sri P. Satyanarayana
25 Sri B Audinarayana
26 Sri G. Suryanarayana
27. Sri G Ramulu
28 Sri Mohan Reddy
29 Vavilala Gopala Krishnayya
30. Sri Kistamachary
31. Sri C. V Somayajulu
32 Sri D. Sreerama Murthy
33 Sri G. Ramu Naidu
34. Sri Bannappa

35 Sri B Manaiah
36 Sri P Narasinga Rao
37 Sri G Ganga Reddy
38 Sri M Satyanarayana Raju
39 Sri B Sreerama Murthy
40 Sri Muthiam Reddy

Noes — 85

1 Sri N Sanjiva Reddy
2 Sri Kallur Subba Rao
3 Sri K Vijayabhaskara Reddy
4 Sri M Pallam Raju
5 Sri B Appalaswamy
6 Sri M Bapaiah Chowdary
7 Sri A Bhagavantha Rao
8 Sri Seerla Brahmayya
9 Sri Yadam Chennayya
10 Sri N Chenchurama Naidu
11. Sri A Chithamabara Reddy
12 Sri Dawar Hussain
13 Sri V Gopala Krishna
14. Sri Gopala Krishna Gupta
15 Sri P Gopalu Reddy
16 Sri P Gunnayya
17 Sri T. Jiyyar Das
18 Sri Kashiram
19 Sri S. K. V Krishnavatharam
20 Sri A Krishnaiah
21 Sri P. Kodanda Ramaiah
22 Sri J Kondal Rao
23 Sri T Lakshmi Narayana Reddy
24 Sri M. Lakshmiah
25. Sri M. N Lakshmi Narasayya
26. Sri N. P Chengalraya Naidu
27. Sri Kala Venkata Rro
28 Sri D Sanjivayya
29. Sri V. Basava Raju
30. Sri Arige Ramaswamy
31. Sri Mahaboob Ali Khan
32 Sri Sheik Md Rahamathullah
33 Sri P Mahendhra Nath
34. Sri Mirza Shukur Baig
35. Sri D. Narasayya

36 Sri R Narasimha Reddy
37 Dr Naganna
38 Sri S Narayanappa
39 Sri R Nathamuni Reddy
40 Sri D. Perumallu
41 Sri M Potha Raju
42 Sri K Punnayya
43 Sri M Rajaram
44 Sri P V Rajeswara Rao
45 Sri D Ramabrahmam
46 Sri P Ramacharlu
47 Sri N Ramachandra Reddy
48 Sri Kunda Ramayya
49 Sri Ch Rama Kotiah
50 Sri V Rama Rao.
51 Sri G Ramaswamy Reddy
52 Sri P Thimma Reddy
53 Sri S B P Pattabhi Rama Rao
54 Sri G Venkata Reddy Naidu
55 Sri M Narasinga Rao
56 Smt Masuma Begum
57 Smt Jayalakshmi Devamma
58. Smt. K Kanaka Ratnamma
59 Smt Shantha Bai
60 Smt T Lakshmikanthamma
61. Sri U Ranga Babu
62 Sri A Ratnam
63 Sri K Santhappa
64 Sri Ch Satyanarayana
65 Sri B Satyanarayana Rao
66. Sri N C Seshadri
67. Sri Sheik Moula Saheb
68 Sri V C Chudamani Deo
69. Sri Konda Lakshman Bapuji
70. Sri Mir Ahmed Ali Khan
71. Sri B. P. Sesha Reddy
72 Sri B Subba Rao
73. Sri M. Venkata Raju
74 Sri G Veerayya
75. Sri T. Veeraraghavulu
76. Sri Vasudeu Krishnaji Naik
77. Sri M. Matcharaju
78. Sri A. Lakshmu Naidu

79 Sri T Papa Rao
80 Sri G Narasimha Murthy
81 Sri Pala Venkatasubbayya
82 Sri B V Siviah
83 Sri Kasim Venkata Reddy
84 Sri Venkatarama Reddy
85 Sri Chinnappa

The motion was negatived

*Mr Speaker* The question is

"In sub-clause (1) (b) of clause 3 for the words 'Rupees thirteen and naya paise fifty' substitute the words 'Rupees eleven' "

The motion was negatived

*Mr Speaker* The question is

"In sub-clause (1) (b) of clause 3 for the words 'Rupees twenty and naya paise twenty five' substitute the words 'Rupees sixteen and naya paise fifty'. "

The motion was negatived

*Mr Speaker* The question is

"In sub-clause (1) (b) of clause 3 for the words 'Rupees thirteen and naya paise fifty', substitute the words 'Rupees twelve'. "

The motion was negatived.

*Mr Speaker* The question is

"In sub-clause (1) (b) of clause 3 for the words 'Rupees twenty and naya paise twenty five', substitute the words 'Rupees eighteen' "

The motion was negatived.

*Mr Speaker* The question is

"In sub-clause (1) (b) of clause 3 for the words 'Rupees thirteen and naya paise fifty', substitute the words 'Rupees thirteen'."

The motion was negatived

*Mr. Speaker:* The question is

"In sub-clause (1) (b) of clause 3 for the words 'Rupees twenty and naya paise twenty five', substitute the words 'Rupees nineteen and naya paise fifty.' "

The motion was negatived

*Sri P Sundarayya* I beg to move

"In sub-clause (1) (b) of clause 3 for the words 'in the case of single-crop wet land', substitute the words 'on which crops requiring constant water supply for more than 4 months are raised' "

"In sub-clause (1) (b) of clause 3 for the words 'in the case of double-crop wet land', substitute the words 'on which wet crops requiring constant water supply for more than 9 months are raised' ",

*Mr Speaker* Amendments moved

* శ్రీ పి సుందరయ్య Wet lands అని register కాబడిన వాటికి శిస్తు రు 13 50 కంటె మించకూడదనీ, double crop wet అని register కాబడినవాటికి శిస్తు రు 20-25 నపై కంటె మించకూడదనీ" ఈ బిల్లులో చూపించారు కాని, wet, double wet అని register చేయడం అంటే regular గా నీటి సరఫరా వుండి మాగాణిక్రింద రిజిష్టరు అయితే వస్తుంది కాని కొన్నికొన్ని ప్రాంతాలలో భూమిశిస్తు ఎక్కువగా వుండి, అది wet క్రింద కాకుండా మెరకగా register అయి వుంటే దానిమీద నీరు పెట్టుకొన్నప్పుడల్లా నీటిశిస్తు పెరగడానికి అవకాశం ఉన్నది అటువంటి భూముల మీద మాత్రం రు 13½ కు బదులు 18 రు లు అయినా కూడా అది ఈ మినహాయింపు క్లాజుల క్రిందకు రాదు గోదావరి డెల్టాలో నీరు ఏమీ తీసుకోక పోయినప్పటికీ కూడా. మెరకక్రింద ఎకరానికి రు 8 లు భూమిశిస్తు యిచ్చే area ఉన్నది గోదావరి డెల్టాక్రింద ఒక పంటకు నీరు పెట్టుకొని మాగాణిపంట క్రింద 6 మాసాలకు మించి వరిపైరు చేసుకుంటే ఎకరానికి రు. 6-4-0 లు చొప్పున నీటితీరువ వేయవలసివస్తుంది ఈ బిల్లు ప్రకారం యికముందు 50% చొప్పున నీటితీరువ పెంచడానికి వీలున్నది రు. 6-4-0 లు రు 9-6-0 లు క్రిందనే యీ నీటి తీరువ పెరుగుతుంది రు 9-6-0 లు నీటి తీరువ, రు. 8 ల భూమి శిస్తు యీ రెండూ కలిసినప్పటికీ కూడ రు 17-6-0 వేయడానికి అవకాశం ఉన్నది. కృష్ణా గోదావరి డెల్టా ప్రాంతాలలో అది ఎంత సారవంతమైన భూమి అయినా ఆ భూమికి నీటి సరఫరా రెగ్యులర్ గా ఉన్నదని ప్రభుత్వపు రెవిన్యూ అకౌంటులో రికార్డు అయి వుంటే నీటి తీరువ, భూమిశిస్తు కలిపి ఎకరానికి రు. 13½ లు మాత్రమే పడుతుంది, మెట్టగావుండి నీరు పెట్టుకొని వరిపైరు సాగు చేసుకుండేవారు మాత్రం రు 17½ లు దాకా యిచ్చుకోవలసి వుంటుంది. అంటే రు. 4 లు అదనంగా పడుతుందన్నమాట. అందుచేత యీ బిల్లు ఉద్దేశాన్నికూడా యిది

నెరవేర్చదు నీటితీరువ భూమిశిస్తు కల్సినట్లయితే రు 13¾ లకు మించ కూడదనే సూత్రం అమలుకాదు మెరకగా రిజష్టరు అయివుండి, నీరు పెట్టుకొనేవాటికి కూడా ఈ సూత్రాన్ని సరిగా వర్తింప జేయవలసిన అవసరం ఉన్నది 'Definition clause' లో wet అంటే 'registered wet' అని అర్థం చెప్పారు Revenue account లో wet క్రింద రిజిష్టరు చేయబడినది wet land క్రింద వస్తుంది Dry lands, wet lands క్రింద రిజిష్టరు చేయబడి వుండవు ప్రతిసంవత్సరం కూడా నీరుపెట్టుకొని నీటితీరువ యివ్వడం జరుగు తోంది ఇటువంటి సందర్భంలో భూమిశిస్తు నీటితీరువ రెండు కలసినప్పుడు కూడా రు 13¾ కు మించిపోకూడదనే అర్థం రావాలంటే "in the case of single crop wet land," అనేపదాలు తీసేసి "lands on which crops requiring constant water supply for more than four months are raised" అనేవి చేర్చాలి మెట్టపైరులకు రు 2, 3 లు యిచ్చుకొని, ఒకటి, రెండు తడుపులు పెట్టుకొనేది కాకుండా, 4 నెలలు వరుసగా నీరుపెట్టుకొని మాగాణి వరిపైరు మెట్టభూములమీద సాగుచేసికొంటే దానికికూడా మెట్టశిస్తు, మాగాణి నీటితీరువ రెండూకలిపి రు 13-8-0 మించకూడదు అనేది వర్తిస్తుంది దీనికి consequent గానే రెండుపంటలు పండే భూములకు కూడా—ప్రభుత్వరికార్డులలో రెండు పంటలు పండేదని record కాకపోవచ్చు మంచిచెరువులుండే ప్రాంతాలలో రెండుపంటలు పండే మెట్టభూములు చాలా కొద్దిగానే ఉంటాయనుకోండి వాటికి శిస్తు రు 20, 25 లు కంటె మించకూడదనే సూత్రం ఉన్నది Regular గా నీటిసప్లయి వుండేభూములకు అధికంగా ప్రభుత్వరికార్డులలో రిజష్టరయిన భూములకు ఒక పంటపండే మాగాణిభూమికి రు 13¾ కంటె పెరగకూడదు అని ఒక సూత్రం పెట్టి వర్తింప చేస్తున్నప్పుడు అదే ప్రాంతంలో మెట్టగా రిజిష్టరుఅయి, పుష్కలంగా నీరువున్నప్పుడు పెట్టుకుంటే దానికి భూమిశిస్తు నీటితీరువ కలిసి రు 13¾ కంటెకూడా ఎక్కువగా వేయడానికి అవకాశా లున్నాయి మెట్టప్రాంతాలలో ఒకేరకమైన భూములకు మాగాణి భూములకు guaranteed water supply వున్న భూములకంటెకూడా, నీటితీరువ అప్పుడప్పుడు కట్టుకొనే భూముల అదనపు శిస్తుమీద వేయడం పరీతిగా కూడ న్యాయంకాదు. ఏ పరిస్థితులలో కూడ మాగాణి శిస్తు, భూమిశిస్తు నీటితీరువ కలిపి రు, 13¾ కు మించి ఉండకూడదని ఏ విధంగా రూల్ వర్తింపచేస్తున్నారో, అదేరీతిగా మెట్ట భూములకు కూడా వర్తింపచేయడానికి అంగీకరించవలసి ఉంది. ఇది ఒక క్రొత్తపాయింట్. ఈ point ను Select Committee లో కొంచెం ఆలస్యంగా తెచ్చాము. దీనిని శాసనసభా వేదికలో ఆలోచిస్తామని మంత్రిగారన్నారు

ఆలోచిస్తాము అంటే 'అంగీకరిస్తామ' ని కాదనుకోండి ఈ కొత్త పాయింటును ఆలోచించడమే కాకుండా అంగీకరించమని కూడా నేను కోరుతున్నాను దీంట్లో ప్రభుత్వానికి వచ్చే ఆదాయం పోయేదేమీలేదు Injustice, discrimination లేకుండా మెరక భూములకుకూడా నీరు తీసుకోకపోయినా అదనపు పన్ను వేయడం, guaranteed water supply వున్నవాటికి తక్కువ పన్ను వేయడం అర్థరహితంగా ఉంటుంది కాబట్టి ఈ రెండు సవరణలను అంగీకరించాలని కోరుతున్నాను

* శ్రీ కె వెంకటరావు అధ్యక్షా, దీనిని గురించి సుందరయ్యగారు చెప్పారు దీనిని గురించికూడా నేను ఆలోచించాను

" So long as it is registered as a single crop wet land, the further consideration that crop is raised with 3 months' or 4 months' water-supply is quite immaterial "

వారు చెప్పిన సవరణ ఎవరికీ ప్రత్యేకమైన ఉపయోగం కలుగజేయదు, కనుక దానిని accept చేయడానికి వీలులేదు

* శ్రీ పి సుందరయ్య Wet land క్రింద register చేసిన భూముల మీద మంత్రిగారు చెప్పినది వర్తిస్తుంది అది wet land క్రింద రిజిష్టరుకాలేదు Dry lalnd క్రిందనే రిజిష్టరయినది ఆ dry lands లో భూమిశిస్తు ఎక్కువగా ఉన్నది అప్పుడు నీరు పెట్టుకొంటే, నీటితీరువ 100 కి 50 చొ॥ న పెంచుతున్నాము. భూమిశిస్తు, నీటి తీరువ రెండూ కలిపినప్పుడు wet land క్రింద register అయితే, రు 13½ కు పెరగ కూడదన్నారు ఉదాహరణకు కృష్ణా, గోదావరి, గుంటూరు జిల్లాలను తీసుకొందాము. వాటిలో భూమిశిస్తు, నీటితీరువా రెండు కలిపి 13రూ॥ లు మించకూడదు ' Wet ' అని రిజిష్టరు కాకపోయినా, నీరు పెట్టుకొని మాగాణి పైరు వేసికొని, వరుసగా 4 నెలలు నీరు పెట్టుకొన్నారని నేనన్నను. ఎన్ని నెలలో మంత్రిగారే చెప్పగలరు. దానికికూడా రు. 13-8-0 రేటు వర్తింపచేస్తే రైతులకు ఇబ్బంది ఉండదనే కొత్త పాయింటు చెప్పాను. దానికి మంత్రిగారు చెప్పిన explanation సరిపోదు. తిరిగి ఆలోచించాలని కోరుతున్నాను

*Sri K. Venkata Rao*: The Bill does not apply to registered dry lands. అందువల్ల యీ పాయింటు raise కాదు.

*Mr Speaker* The question is

"In sub-clause (1) (b) of Clause 3 for the words 'in the case of single crop wet land', substitute the words 'on which crops requiring constant water supply for more than 4 months are raised' "

"In sub-clause (1) (b) of Clause 3 for the words 'in the case of double crop wet land', substitute the words 'on which wet crops requiring constant water supply for more than nine months are raised"

The motion was negatived

*Sri P Sundarayya*, I demand a division, Sir

The House then divided

Ayes 39 — Noes 76

The motions were negatived

*Sri P Sundarayya* I beg to move·

"Delete the proviso to sub-clause (1) (b) of Clause 3"

*Mr Speaker* Amendment moved

*శ్రీ పి. సుందరయ్య అధ్యక్షా, ఇదికూడా చాలా ముఖ్యమైన సవరణ. ఈ బిల్లు ఒకచేత్తో దానం చేయబోయినట్లు యిస్తూ, రెండవ చేతితో దానిని సంగ్రహించేరీతిగా ఉంది మనం యింతకుముందు pass చేసినటువంటి clause లో మాగాణీ భూమికి భూమిశిస్తు నీటితీరువ అన్నీ కూడా కలిపి 13-8-0 రూపాయల కన్న పెరగకూడదన్నారు అదేరీతిగా రెండు పంటలు పండించుకొనేటట్లయితే భూమిశిస్తు నీటితీరువ అన్నీ కలిపి రు 20-4-0 మించకూడదన్నారు ఈవిధంగా పెట్టి మరల proviso లో ఇపుడు అంతకన్న ఎక్కువయిచ్చే ప్రాంతంలో ఆ ఎక్కువపన్నుతే యిచ్చుకోవలసిందని, వాటిని తగ్గించలేదని పెట్టారు కాని వారు నీటితీరువ కాని, భూమిశిస్తుకాని అన్నీకలిపి ఎక్కువచేసినప్పటికీ కూడా మొత్తం 13-8-0 రూపాయలు దాటకూడదని ఒక point చూపించారు. కాని రెండవ ప్రక్కన ఒక proviso పెట్టి ఇంతకన్న విపరీతంగా ఎక్కువ యిస్తున్న ప్రాంతాలకు, వర్తింపచేయకుండా చేయాలని ఆలోచిస్తున్నారు. ఇది ఆంధ్ర ప్రాంతానికే వర్తించే బిల్లు, క్రొత్త ప్రాజెక్టు ప్రాంతాలను తీసుకుందాము. ఆ ప్రాంతాలలో పంటలు సక్రమంగా పండడంలేదు భూమిని ఇంకా పదును లోకి తీసుకురావలసిన అవసరం ఎంతో ఉన్నది. అక్కడమాత్రం మెట్టమైదు

వేసుకుంటే 10 రూపాయలు నీటితీరువ యిచ్చుకోవలసి ఉంటుందని అన్నారు. కాని అక్కడ మాగాణిపంట వేసుకుంటే 15 రూపాయలు యిచ్చుకోవలసి ఉంటుంది. రెండు మాగాణీ పంటలకు సమానమైన crop ఏమైనా వేసుకుంటే ఒక ఎకరానికి 22-8-0 రూపాయలు నీటితీరువ యిచ్చుకోవలసిఉంటుంది భూముల నన్నింటినీ సాగులోకి తీసుకురావడానికి రైతులు అప్పులపాలై, ఆ అప్పులు తీర్చుకొంటూ, ఆ భూములపై betterment levy, ఎకరానికి 10,15 రూపాయల చొప్పున 20 ఏళ్ళదాకా యిచ్చుకోవలసి వస్తున్నప్పటికీ ఇంకా అదనంగా వారిపై ఈ నీటితీరువను వేయాలనే ధోరణిలో ఈ బిల్లు ఉన్నది. అందుచేత పన్నులు ఎక్కువ వెసిన వాళ్ళమీదే ఇంకా పన్నులు ఎక్కువ వేశారు బాగా పంటలు పండుతున్నాయని వాళ్ళమీద వడ్డిస్తూ వచ్చారు కాని ఇంత కన్నా ఎక్కువ ఉన్నచోట తగ్గించండి ముఖ్యంగా రాయలసీమ మొదలైన మెరక ప్రాంతాల్లో క్రొత్తగా చెరువులు త్రవ్వినచోట్ల యిపుడు విపరీతంగా ఉంటున్నాయి కనీసం రేట్లు హెచ్చించిన చోటనైనా 13-8-0 రూపాయలకు మించకుండా ఉండేటట్లు చేయమని కోరడమే నా యొక్క ఉద్దేశం ఇపుడు ఈ సవరణను అంగీకరించక పోయినట్లయితే ఈ హెచ్చు రేట్లమీద నీటితీరువ యిస్తున్నా, అచటి రైతాంగం ఎక్కువ పన్ను యిచ్చుకోవడమే కాకుండా దానిమీద భూమిశిస్తు వేరుగా, మెరకశిస్తు వేరుగా కట్టుకోవలసి వస్తున్నది. అంతేకాక land cess లు కూడా అదనంగా కట్టుకోవలసివస్తోంది అందుచేత "ఈ నీటితీరువ రేటు అదనంగా ఉన్నచోట కనీసం ఇపుడు తక్కువగా ఉన్నచోట చేసేహెచ్చింపు రేట్లతోనైనా సమానంచేయాలి" అనేదే నా ఉద్దేశ్యం. అసలు న్యాయంగా ప్రభుత్వం నీటితీరువ తక్కువగా ఉన్నచోట హెచ్చించదలచు కొన్నపుడు, ఎక్కువగాఉన్న ప్రాంతాల్లో కూడా తగ్గించడమనేది న్యాయమైన విషయం ఇపుడు తెలంగాణాలో 17, 18 రూపాయలు మొదలుకొని, 22 రూపాయల వరకు ఉందికదా దానిని 13-8-0 రూపాయలకు ఎందుకు తగ్గించ కూడదు? అదేవిధంగా కృష్ణా గోదావరి డెల్టాలలో 8, 9 రూపాయలే ఉంది. అచట పంటలు కూడా బాగా పండుతాయి. అచట అంతకన్న ఎక్కువ చేయడం న్యాయమేకదా అని చెబుతూ బిల్లు తెచ్చినవాళ్లు, ఆ మాత్రం కూడా పంటలు పండకుండా, ఆ మాత్రం కూడా guaranteed water supply చేయ కుండా ఇంకా ఎక్కువ వ్యవసాయ ఖర్చు అవుతూఉన్నటువంటి రాయలసీమ లాంటి మెట్ట ప్రాంతాలలో, ఇప్పటికే నీటి తీరువ కాక భూమిశిస్తే 15 రూపాయలు చెల్లించుచున్నటువంటి ప్రాంతాల్లో భూమిశిస్తుతో కూడా కలిపి 13-8-0 రూపాయలవరకు ఎందుకు తగ్గించకూడదు? ఎక్కువచేయవలసి

వచ్చినపుడు మేము 13-8-0 రూపాయలకన్న ఎక్కువ చేయడంలేదని వాదిస్తారు. 13-8-0 రూపాయలకన్న ఎక్కువచేయలేదన్నమాట నిజమే అంతకన్న ఎక్కువ ఉన్నదానిని ఎందుకు తగ్గించలేదు ? ఈ session లో మాత్రం 13-8-0 రూపాయల వరకు ఎక్కువచేస్తాము, వచ్చే session లో ఈ 13-8-0 రూపాయలనుంచి తెలంగాణా రేట్లను రాయలసీమ రేట్లతో సమానంగా పెంచుతాము, ఇది మొదటి వాయిదా మాత్రమే, మొదటి వడ్డన మాత్రమే అని ప్రభుత్వం చెప్పకపోయినా, ఆ విధంగా అర్థంచేసుకోవలసిఉన్నది. అంతకన్న ఎక్కువ ఉన్నదానిని తగ్గించకుండా తక్కువగానున్నదానిని ఒకేపర్యాయం హెచ్చించితే అలజడి వస్తుందని మెట్లుమెట్లుగా నెలనెలకు ఒక్కొక్క బిల్లు తేవడంలోగల ఉద్దేశం ఇదేకాని ఇంకొకటికానేరదు "Land Revenue Commission వస్తుంది, ఈ basic rates అన్నిటినీ మార్చేస్తాము, పన్నులను తగ్గిస్తాము" అని అనడం ప్రజలను మభ్యపెట్టే శుష్కవాదాలు తప్పితే, అంతకన్న వాటికి ఏమీ విలువ లేదు నిజంగా పన్నులను సమానం చేయదలచుకున్నపుడు, పన్ను తక్కువగాఉన్న ప్రాంతాల్లో ఎక్కువచేయడానికి తయారైనటువంటివాళ్ళు, అంతకన్న తక్కువ పంటలుపండే ప్రాంతాల్లో అంతకన్న హెచ్చుగా ఉన్న రేట్లను తగ్గించడం చాలా న్యాయమైనది అందుచేత ఈ proviso ను తీసివేయాలి ఇంతవరకు చేసిన పాపాలకు పరిహారార్థంగానైనా సరే ఎక్కువగానున్నవాటిని తగ్గించి, కాస్త పుణ్యంచేసుకొని ప్రాయశ్చిత్తం అయినా చేసుకుంటే ప్రభుత్వానికి ప్రజల్లో మర్యాద ఉంటుందని, ఈ సవరణను యిప్పటికైనా అంగీకరించి ప్రాయశ్చిత్తం చేసుకోవాలని ప్రభుత్వాన్ని కోరుతూ ముగిస్తున్నాను.

శ్రీ పిల్లలమఱ్ఱి వెంకటేశ్వర్లు అధ్యక్షా, శ్రీ సుందరయ్యగారు అసలు విషయం అంతా చెప్పారు. సమాధానం చెప్పడానికి వెంకట్రావుగారు లేరు.

మిస్టర్ స్పీకర్ : ఉన్నవారు సమాధానం చెప్తారు.

శ్రీ పిల్లలమఱ్ఱి వెంకటేశ్వర్లు : వారేచెప్పాలి Bill ను ప్రవేశపెట్టినది వారైతే బ్రహ్మానందరెడ్డిగారు ఏమిచెప్తారు ? ఆయన ఏమైనా legal points చెప్తారేమో ! అసలు యిందులో legal point కూడా ఉన్నదేమో ఆలోచించాలి కొన్నిచోట్ల ఏ పరిస్థితులలోను 13-8-0 రూపాయలకు పెరగదు, మిగిలినచోట్ల, అంతకన్న ఎక్కువ కట్టేచోట్ల 13-8-0 రూపాయలవరకు తగ్గించనవసరంలేదు అంటున్నారు. అది discriminatory గా కూడా ఉంటుంది. అందువల్ల ఎలా

చూసుకున్నప్పటికీ ఈ proviso ను తీసిపారేయడం అవసరం అని మాత్రం వారి దృష్టికి తీసుకువస్తున్నాను ఇపుడు తక్కువగానున్నవాటిని 13-8-0 రూపాయలవరకు పెంచుతున్నపుడు అంతకన్న ఎక్కువ ఉన్నచోట్ల 13-8-0 రూపాయలకు తగ్గించినంత మాత్రాన ప్రభుత్వానికి వచ్చే ఆదాయంలో ఎంతోనష్టం ఉండదు లెక్కవేసిచూస్తే ఒకలక్ష రూపాయలు కూడా ఉండదు అంతచిన్న మొత్తం కోసం మొత్తం బిల్లు అంతా వృధాఅయ్యే పరిస్థితికూడా తెచ్చుకుంటున్నారేమో అనుకొంటాను. అందువల్ల ఈ proviso ను తప్పకుండా delete చేయాలని వారికి నేను మనవిచేస్తున్నాను

శ్రీ వి విశ్వేశ్వరరావు (మైలవరం) మిత్రులు సుందరయ్యగారు దీని విషయంలో చాలా విపులంగా చెప్పారు వెనుకబడిన ప్రాంతాలలోను, బాగా పంటలు పండని ప్రాంతాలలోను ప్రాజెక్టులు కడతామని అంటున్నారు ఇపుడిపుడే అభివృద్ధి కొనసాగిస్తున్నారు ఈ మధ్యనే మన ప్రభుత్వరిపోర్టులో కాని లేకపోతే దానిని పరిశీలించిన తరువాత కాని, పత్రికలలోని statements ను బట్టి కాని చూస్తే అచ్చటి భూమిఅంతా సాగులోనికి రావడంలేదని చెప్పడం జరిగింది అక్కడ ఉన్నరైతులు భూములను సాగులోనికి తీసుకురావడానికి తగిన పెట్టుబడిలేనటువంటి పరిస్థితులలో ఉన్నారు ఆయా ప్రాంతాలలో పూర్వం అనేకసార్లు కరువు, కాటకాలతో బాధలుపడి ప్రజలు యిపుడిపుడే కోలుకుంటూ భూమిని సారవంతంగా చేసుకోడానికి ప్రయత్నం చేస్తున్నారు అటువంటి వాళ్ళపైన ఇటువంటి హెచ్చుపన్నులు, 10, 15, 22 రూపాయల చొప్పున వేయడం జరుగుతోంది, అది కూడా ఏ Government Order రూపంలోనో తెస్తారు ఈ ప్రాజెక్టులవల్ల వారి భూమికి ఎక్కువ ప్రయోజనం కల్గుతూంది కాబట్టి ఈ హెచ్చు నీటితీరువను చెల్లించాలని ఈ రూపంలో తీసుకురావడం జరుగుతూంది Wet assessment చట్టం అనేదానిని తీసుకువచ్చి ఆ చట్టంక్రింద 13-8-0 రూపాయలు కన్న, ఎవరూ ఎక్కువ చెల్లించకూడదని ఒక గీటుపెడుతూ, 15, 22 రూపాయల చొప్పున చెల్లించాలని అనడం ఏ విధంగా చూచినప్పటికి కూడా సరైనదికాదు ఇపుడు నిర్మాణంలో ఉన్న ప్రాజెక్టులన్నీ నిర్మింపబడిన వాటికి ఇపుడున్న పరిస్థితులు ఉంటాయని మనము చెప్పలేము భూమిశిస్తు విధానాన్ని మార్చడానికి ఒక కమిటీని వేస్తున్నామని మంత్రిగారు చెప్పారు, పన్ను విధానాన్ని ఒక స్థాయికి తెస్తామని కూడ మనము చర్చించవలసివస్తుంది. అయితే యీ ఒక సంవత్సరం చెల్లించే శిస్తులోను ఇంత పెద్దమార్పులు తీసుకొనిరావలసిన అవసరం లేదేమో. అయితే

మనం పురోగమించదలచుకున్నాము ఆ పరిస్థితులలో యీ సెస్‌ను వసూలు చేయడం, వాటిని అధికంచేయడం అనేది అవసరమా అని అడుగుతున్నాను. కాబట్టి యీ విషయాన్ని పునరాలోచించి వాటన్నింటిని రద్దు చేయవలసిన అవసరంఉంది అంతేగాని యీ బిల్లును అవకాశంగా తీసుకొని యీ సెస్‌లను పెంచబూనడం సరిగా లేదు అసలు యీ బిల్లు నీటి తీరువను పెంచుటకు తీసుకు వచ్చారు దానికి బై ప్రొడక్టుగా ఇతర సెస్సులుకూడ పెంచుట జరిగింది ఈ బిల్లు aims & objects లో నీటితీరువను పెంచుట ప్రధాన ఉద్దేశమని చెప్పారు దానితోపాటు అదనంగా సెస్సులు పెరగాలనేది యీ బిల్లు తయారు చేసినప్పుడు contemplate చేసియుంటారని అనుకోను ఆ ఉద్దేశం ఉంటే అది మొట్ట మొదటనే చెప్పి యుండవల్సినది ఇప్పుడు చెపుతున్నాముకదా అని మంత్రిగారు అంటే సరిపోదు అది ఎక్కడా ఉదహరించలేదు ఇప్పుడు నీటి తీరువమీద సెస్సులు indirect గా పడుతున్నాయి సుమారు రెండుకోట్లు, ఎడ్యుకేషన్ సెస్ అయితేనేమి, రోడ్డు సెస్ అయితేనేమి వసూలు అవుతోంది దీనిమీద అదనంగా యిప్పుడు వేస్తే యింకా ఎంత ఎక్కువ అవుతుందో ఆలోచించాలి ఇప్పుడు water cess రూపాయికి ఆరణాలు పెంచాలంటున్నారు ఈ ఆరు అణాల మీద యింకొక 1/3 పెరిగినప్పుడు రూపాయికి, అర్థరూపాయి పెరుగుతోందని మంత్రిగారి దృష్టికి తీసుకువస్తు న్నాను Land cess పెంచాలనుకుంటే ప్రత్యేకమైన చట్టము తీసుకురావాలి కాని, ఒక బై ప్రొడక్టుగా తెచ్చి, ఎంత ఆదాయం వచ్చినా రానీ, అని రాబట్టే ప్రయత్నం సరిగా లేదని అనుకొంటున్నాను ఇప్పటికే యీ సెస్సులు చాలా ఎక్కువగా ఉన్నవి వీటిని యింకా పెంచుతూ పోతే హనుమంతుని తోకలాగ పెరిగిపోతున్నట్లు కనబడుతున్నాయి ఈ బిల్లులో కనీసం దానిని మినహాయించాలని, మంత్రి గారు ఈ సవరణను ఆమోదిస్తారని కోర్దిగా ఆశిస్తున్నాను

* శ్రీ జి. యల్లమందారెడ్డి: అధ్యక్షా, ఈ బిల్లుద్వారా సెస్సులను యింకా పెంచుతున్నారు పది రూపాయలు భూమి శిస్తుమీద నీటి తీరువ, సెస్సులు—అన్నీ కలిపి 15 రూపాయల పైచిలుకు అవుతున్నాయి అసలు పదమూడు రూపాయలకు single wet crop అయితే అవి పెంచకూడదని, double wet crop కు 20 రూపాయలు, దానికంటె ఎక్కువ ఉండేది ఉండా అని చెపుతున్నాను. దానికి తోడు రూపాయకు 0-5-0 calculate చేస్తే ఎంత

అవుతుందో ఆలోచించాల్సిన అవసరం ఉన్నది ఇవాళ single wet crop కు రు 13-8-0 అయినప్పుడు, దీనిమీద రూపాయకు అయిదణాలు అదనం అంటే, మొత్తం రూ 17 లు దాటుతుంది Double wet crop కు రు 20-4-0 అయినప్పుడు, రూపాయికి అయిదణాల చొప్పున వేస్తే మొత్తం రు 27 ల వరకు అవుతుంది అందువల్ల యీ సెస్సులు వేసుకుంటూపోతే, యిది మనకు కనపడని ఒక పెద్ద load శ్రీ పిల్లలమఱ్ఱి చెప్పినట్లు కొత్తగా వేసేది ఆరణా లకు రెండణాలు అంటే యింకా మూడవవంతు పెరిగే ప్రమాదం ఉన్నది కాబట్టి, దీనిని ఉపసంహరించుకోవాలని కోరుతున్నాను

*శ్రీ కె వెంకటరావు అధ్యక్షా! ఈ సెస్సులగురించి వారికి అభ్యంతరం ఉంటే, నిజమైన అభ్యంతరం చెప్పివుంటే బాగుండేది. వెంకటేశ్వర్లుగారు చెపుతూ, యిప్పుడు ప్రభుత్వం రు 0-6-0 లు వేస్తున్నదని అన్నారు. నిన్న నేను చెప్పాను ఇదివరకు 0-3-0 లు వేసి ఏడాదిపైచిలుకు అయినది. ఇప్పుడు కొత్తగా వేసేది 0-6-0 లు అని చెప్పుట అసంగతమైన విషయం

రెండవ విషయం, సెస్సు రు 20/- ల మీద మూడవ వంతు ఆరు రూపాయలు ఎక్కువ అవుతున్నదని అంటున్నారు. ఈ ఎక్కువచేసేది మూడణాల మీద మూడవవంతు అనగా అణా ఎక్కువ అవుతుంది ఇది Local Boards Act క్రింద, Education క్రింద ఉన్న సెస్. Land Revenue ఉంటే యిది యివ్వవలసియున్నది కొత్తగా దీనిని రహస్యంగా వేయుటలేదు, బహిరంగంగా మానటంలేదు ఇప్పుడు మూడణాలలో మూడవవంతు ఒక అణా local cess ఎక్కువ అవుతుందిగాని, దీనిని విపులత్వం చేసి యింకొక పెద్దబాయి నెత్తిన పడవేస్తున్నారని, యిది చాలా బరువైనదని అనే విమర్శ న్యాయంకాదు.

శ్రీ రామమూర్తిగారి ఉపన్యాసం పూర్తిగా వినలేదు గాని, అసలు ప్రపంచంలో ఏమీ పని జరుగుటలేదని, అంతా బరువేనని అంటున్నారు; ఆ ప్రపంచంలోనే వారిని వుండవలసినదని కోరుతున్నాను. ఎదిగే ప్రపంచం ఎదుగుతున్నది, బాగుపడే ప్రపంచం బాగుపడుతున్నది, దేశంకూడ ఎదుగుతున్నదని మనవిచేస్తున్నాను.

శ్రీ పి సుందరయ్య: అధ్యక్షా! సర్‌చార్జి బిల్లులో ఈ సెస్సులకు మాత్రం సర్‌చార్జి పెంచకూడదని అన్నారు. ఎందుకంటే, పైవాళ్ళకు ఎక్కువ పడు

తుందనే ఉద్దేశంతో అప్పుడు అన్నారు అయితే, యిప్పుడు యిందులో సెస్సులు ఎక్కువచేయుట న్యాయంగా ఉన్నదని చెప్పటం, న్యాయమా అని అడుగుతున్నాను

శ్రీ కె. వెంకటరావు సర్ చార్జి అనేది extra tax ఇది existing tax యొక్క enhancement సర్ చార్జికిన్నీ, అసలు Basic Land Revenue కు ఏమీ సంబంధంలేదు. అది అవసరంవచ్చినప్పుడు వేసుకుంటాము. మొన్న నేను చెప్పాను—మన standrad of living ఎదిగినప్పుడు అసలు సర్ చార్జిపోయి, మొత్తం వాటన్నింటిని మార్చి agricultural income-tax వేసుకొనవచ్చును అది వేరేసమస్య. This is an increment in what is existing That is an extra over whatever is existing అందుచేత రెండింటికీ తేడా ఉన్నది

శ్రీ బి శ్రీరామమూర్తి . Point of order, Sir, అసలు 'scope of the Bill' చూస్తే wet assessment పెరగాలని ఉన్నది కాని యిది చూస్తే land cess కూడ పెరుగుతున్నది

మిస్టర్ స్పీకర్ . అది point of order కాదు నన్ను legal opinion అడిగితే. అది అటు (ప్రభుత్వం) వైపే ఉన్నది. ఎందుచేతనంటే land revenue ఉన్నప్పుడు దానితోబాటు Local cess, Education cess ఉంటాయి, అవి లేకుండా పనిజరగదు

The question is:

Add the following at the end of sub-clause (1) (b) of Clause 3.

"The increase of the total payable Land Revenue consequent on the imposition of additional wet assessment, does not entail payment of the corresponding increase in the other cases like education and local bodies cess."

The motion was negatived

*Sri B. Sreeramamurti*: Sir, I demand a division.

The House then divided.

Ayes : 29; — Noes : 80.

The motion was negatived.

*Sri B Sriramamurthi* I beg to move

" Add the following as sub-clause (1) (c) of Clause 3—

'The payment of the additional assessment is enforcible against the direct and immediate obligation of the Government to effect necessary repairs etc to the sources of irrigation with a view to ensure proper irrigation facilities '."

*Mr Speaker* Motion moved

* శ్రీ బి శ్రీరామమూర్తి ఇప్పుడు రైతాంగంపైన పన్నులభారం పెంచటానికి యీ బిల్లును శాసనం చేయబోతున్నాము రైతులమీద పన్నులు వేస్తున్నాము ప్రభుత్వంమీద రైతులకు సక్రమంగా నీరు అందించవలసిన బాధ్యతకూడ ఉన్నది రైతుకు నీరు ఇవ్వకుండా, అతడినుండి పన్ను తీసుకోవటం మంచిదికాదు ప్రభుత్వం తప్పనిసరిగా రైతులకు నీరు ఇవ్వవలసిన బాధ్యత ఉన్నది ఏ కారణంచేత పన్ను వేస్తున్నామో, అదే కారణంచేత ప్రజలకు తప్పనిసరిగా నీరు అందజేయవలసిన పూచీ ఉన్నది

నేను ఇంకొక ముఖ్యమైన విషయం మనవిచేస్తాను. 1931 వ సంవత్సరంలో, పరాయి ప్రభుత్వం ఉన్నరోజుల్లో ఎకనమిక్ ఎంక్వయిరీ కమిటీవారు యీ విధంగా వ్రాశారు

"Other considerations referred to in the Government of India's Orders on the subject are that the rates levied should be consistent with the demand for water . "

అందుచేత "డిమాండ్ ఫర్ వాటర్" (Demand for water) అన్నది మనం ఎంతకాలం మీట్ కామో, అంతకాలం నీటిమీద పన్ను వేయటం జరగకూడదు

"High rates would be justified only by the consideration that the cultivator is willing to pay it..."

ఇదికూడ అదే రిపోర్టులో ఉన్నది. రైతులు ప్రభుత్వానికి పన్ను చెల్లించేదానికి అంగీకరించినపుడు, ప్రభుత్వంకూడ వారికి నీరు ఇచ్చేదానికి బాధ్యత తీసుకోవాలి. మనం ప్రజాస్వామ్యంలో ఉన్నాము. ప్రజాస్వామ్యం అంటే ప్రభుత్వానికి ప్రజలపై బాధ్యత ఉండాలి. రైతుమీద ఏ కారణంతో బరువు

విధిస్తున్నామో, ఆ కారణం మనం గమనించి బాధ్యత తీసుకోవాలి అందు చేత ఉన్న నీటి వనరులను రిపేరు చేయించి, సరైన కండిషన్స్‌లో ఉంచి, రైతులకు సకాలంలో నీరు సప్లయి చేయించే బాధ్యత ప్రభుత్వం తీసుకోవాలి, అప్పుడే రైతులు పన్నులు చెల్లించటానికి పూనుకొంటారు ఆవిధంగా వారికి నీరు అందజేయనంతవరకు యీ పన్ను వేయకూడదని నా సవరణ ఉద్దేశము నా సవరణను మంత్రిగారు అంగీకరించాలని కోరుతున్నాను

శ్రీ కె వెంకటరావు అధ్యక్షా, ఇప్పుడు శ్రీరామ్మూర్తిగారు చెప్పింది, ఒక ఫండమెంటల్ ప్రిన్సిపుల్, ఎప్పుడైతే కమర్షియల్ రేట్ అని పూర్తిగా నిర్ణయమై వాటర్ రేట్ లెవీ చేస్తామో, అప్పుడు గ్యారంటీగా నీరు సప్లయి చేయటం అన్న ప్రశ్న వస్తుంది ఇవాళ ఉన్నదానిని ఎస్టిమేట్ చేసి, యీ రకంగా జరుగు తుంది అని చెబుతాము అందువల్ల దీనికి ఆల్టరేషన్ ప్రతిసారి తీసుకు రావ టానికి వీల్లేనటువంటి విషయము వాల్యూమ్ మెట్రిక్ రేట్ వచ్చి, వంద కుంచాల నీళ్లు ఇస్తామంటే వంద కుంచాలు కొలిచిఇచ్చి, దానిమీద పుచ్చుకోవలసిన పన్ను పుచ్చుకొనే సిద్ధాంతం స్థిరీకరణ అయినరోజున, అది మన రాష్ట్రంలో అమలు జరిగే రోజున, శ్రీరామమూర్తిగారు చెప్పింది సాధ్యం అవుతుంది ఇప్పుడు అది సాధ్యంకాదు గనుక, యీసవరణ అంగీకరించటానికి వీలులేదు

*Mr. Speaker* The question is

"Add the following as sub-clause (1) (c) of clause 3--

'The payment of the additional assessment is enforcible against the direct and immediate obligation of the Government to effect necessary repairs etc , to the sources of irrigation with a view to ensure proper irrigation facilities'. "

The motion was negatived

*Sri B Sriramamurthi* I demand a division, Sir

The House then divided.

Ayes 29, — Noes. 83

The motion was negatived

*Mr. Speaker:* Sri B. Sriramamurthi may move his next amendment.

*Sri B. Sriramamurthi:* I beg to move:

"Add the following as sub-clause (1) (d) of clause 3—

'If, in respect of the land under the ayacut of an irrigation resource which are liable for additional assessment the crop does not exceed 6 annas produce for a consecutive period of two years, the additional assessment shall be cancelled in respect of such land'

*Mr Speaker* Motion moved

*శ్రీ బి శ్రీరామమూర్తి అధ్యక్షా, మంత్రిగారు సమాధానం చెబుతూ "ఇది ఫండమెంటల్ ప్రిన్సిపుల్‌కు సంబంధించింది, నీరు ఇవ్వవలసిన బాధ్యత ప్రభుత్వానికి ఉంది, అందులో సందేహంలేదు" అని అన్నారు నీరు ఇవ్వటానికి ప్రభుత్వం బాధ్యత తీసుకొంటుందని మనం అనుకోవచ్చును కాని ప్రాక్టికల్‌గా ఉన్న పరిస్థితి చూసుకొంటే ఒక సంగతి బోధపడుతుంది ఫస్ట్‌క్లాస్ వాటర్ ఇరిగేషన్ రిసోర్‌సెస్ అని ఉంటుంది సెకండ్‌క్లాస్ వాటర్ ఇరిగేషన్ రిసోర్ సెస్ అని ఉంటుంది కాని మరమ్మతులు జరగని చెరువులు యీనాడు చాలా ఉన్నాయి చెరువు గర్భము, గట్టు సమానలెవెల్‌లో ఉన్నవి. అటువంటి చెరువులను ప్రభుత్వం మరమ్మతు చేయించలేకపోవటంచేత, రైతాంగం నష్టపడుతున్న పరిస్థితి ప్రతిగ్రామంలో కనబడుతున్నది రెండు అణాల పంటకన్నా తక్కువపంట పండితేనే రెమిషన్ ఇస్తారు. అంతకన్నా మించినపంట ఉంటే రెమిషన్‌రాదు నీరు ఇవ్వని కారణంగా పంటలు పోయిన పరిస్థితిలో కనీసం ఆరు అణాల పంటకూడ పండని పరిస్థితుల్లో, ప్రభుత్వం నీరు ఇచ్చామని చెప్పుకోవటం సరైందికాదు నీరు లేకుండా ఉండటంవల్ల, పంటలు పాడయిన సందర్భాన, ఆరు అణాలకన్నా తక్కువపంట పండిన రోజున, ప్రభుత్వం తప్పనిసరిగా వాటర్ ఎసెస్‌మెంట్ రద్దుచేయాలని కోరుతూ, యీ అమెండ్‌మెంటును ప్రభుత్వం ఆమోదించాలని కోరుతున్నాను

*శ్రీ కె వెంకటరావు: అధ్యక్షా, ఇందులో ఏమీ ప్రత్యేకతలేదు. ఎడిషనల్ ఎసెస్‌మెంట్ ఎగ్జంప్ట్ చేయటం అసంగతమైన విషయము. సభ్యులు చెరువులలోని నీరుగురించి చెప్పారు. ఎనిమిది నెలలు వాటర్ సప్లయి ఉన్న చెరువులకే యీ పన్ను పడుతుంది కనుక, సభ్యులయొక్క వాదన ఎంతమాత్రం దీనికి అప్లయికాదు అందుచేత యీ సవరణను అంగీకరించటానికి వీల్లేదు

*Mr Speaker*: The question is.

**Add the following as sub-clause (1) (d) of Clause 3.—**

'If, in respect of the land under the ayacut of an irrigation resource which are liable for additional assessment, the crop does not exceed 6 annas produce for a consecutive period of two years, the additional assessment shall be cancelled in respect of such land ' "

The motion was negatived

*Mr Speaker* We shall now take up the amendment given notice of by Sri G Yellamanda Reddi, Sri Pillalamarri Venkateswarlu and Sri M Nagi Reddi It may be moved

*Sri G Yellamanda Reddi* I beg to move

" In sub-clause (2) of clause 3, delete the words ' rain-fed ' in second line "

*Mr Speaker* Amendment moved

* శ్రీ జి యలమందారెడ్డి అధ్యక్షా, ఈ సవరణ విషయములో చాలా వరకు సెలెక్టు కమిటీలో చర్చ జరిగింది. చర్చ జరిగినప్పుడు అక్కడ వచ్చిన విషయము ఏమిటంటే, సాధారణముగ కొన్ని ప్రాజెక్టులు ప్రభుత్వం రికార్డు లలో second class లేకపోతే first class irrigation sources గా record అయి ఉన్నప్పటికినీ, ఆ ప్రాంతాలలో సరిగా వర్షాలు లేనందున, మూడు, నాలుగు సం॥ లకు ఒకసారి మాత్రమే వరిపంట పండించుకుంటూ, తక్కిన రెండు మూడు సం॥ లలో జొన్నో, లేక యితర మెట్టపైర్లో వేసుకునే ప్రాంతములు చాలా ఉంటున్నవి ఈ విషయమునకు సంబంధించిన ఉదాహరణ చెప్పాలంటే, నెల్లూరు జిల్లాలో మోపాడు అనే గ్రామము ఉన్నది. దానిక్రింద 12 వేల ఎకరాల ఆయకట్టు ఉన్నది. కాని నాలుగు సం॥ లకొకసారి అక్కడ వరిపంట పండుతున్నది తక్కిన సం॥ లలో జొన్నో, సజ్జో, లేక యితర మెట్టపైర్లో వేసుకోవడము జరుగుతున్నది అంతకు తప్ప ప్రతి సంవత్సరము వరుసగా వరి పండించే అవకాశము ఏమీలేదు ఇది ప్రభుత్వమువారి రికార్డులలో కూడ సాగు బడి లెక్కలలో నమోదు చేయబడియున్నది అందువల్ల యిలాంటి ప్రాజెక్టుల విషయములో ప్రభుత్వము తప్పకుండా ఆలోచించవలసిన అవసరమున్నది ప్రభుత్వము additional wet assessment విధించినప్పుడు ప్రభుత్వానికి చాలా మొత్తము వస్తుందని ఆలోచించి విధించుచున్నారు. గనుక ప్రతి సంవత్సరము వరిపంట పండకుండా ఉన్న ప్రాంతాలను వర్షపైరు వేయని సంవత్సరము

యీ బిల్లు నుంచి మినహాయింపు చేయాలనే వాదన సెలెక్టు కమిటీలో ఉన్న సభ్యులందరూకూడా దాదాపు ఒకటే అభిప్రాయము కలిగిఉండడము జరిగింది కాబట్టి Select Committee సమావేశము జరిగిన తరువాత draft bill వచ్చినప్పుడు యీ wording అంతా చూస్తే, కేవలము rain-fed tanks కు మాత్రమే యిది వర్తిస్తుంది అని అర్థము అవుతున్నది ఇందులో వ్రాసింది ఏమిటంటే rain-fed tanks విషయములో సం॥ లో ఏ ఎనిమిది మాసములకో నీటి వసతి ఉండి, యిక ఆ చెరువుక్రింద వేరేపంట లేకపోతే, అప్పుడు యీ assessment వర్తిస్తుందని చెప్పబడింది అంటే ఎనిమిది మాసాలు అన్నప్పుడు, వరి పంటకు నీరు నిజముగ అవసరముండదు కేసరిలాంటి పంట వేసినప్పుడు, నాలుగు నెలలుకూడ ఉంటుంది అది ఆరు మాసములకు సాధారణముగ వరిపంట పండించేటందుకు, సెలెక్టు కమిటీవారు అభిప్రాయపడిన దానిని బట్టి, 8 మాసములు అని రికార్డు మూలముగ వ్రాయడమేగాని. అది సాధారణముగ ఆరు నెలలుగాని, అయిదు నెలలుగాని వరిపంట పండించటానికే అది ప్రధానము గనుక అది ఒక convention గనుక, ఆ రకంగా పండకుండా ఉన్నవాటికి మినహాయింపు అవుతుందని అభిప్రాయపడ్డారు అందుకు సంతోషం కాని rain-fed అని చెప్పినతరువాత దానిక్రింద "rain-fed" అనే దానికి మంత్రిగారు నిర్వచనము కూడ మరల యిచ్చారు "The expression rain-fed tank means a tank which derives supply of water from a source other than a river" అని చెప్పారు. ఇక్కడ "Other than a river" అంటే, river అన్నప్పుడు దానికికూడ నిర్వచనము వ్రాసిఉంటే ఏలాంటి యిబ్బంది ఉండేదికాదు ఇక్కడ యీ river అనే పదమునకు అర్థముచూస్తే, సుమారుగవున్న ఏ చిన్నవాగుకు కూడ river అనే అధికార్లు note వ్రాసి పంపుతారు గనుక యిక ఏ చిన్నచెరువో, ఎక్కడో సాధారణముగ వాగుగాని, river కాని లేనటువంటి చెరువులు ఉండవు గనుక కేవలము వర్షాలు కురిసిన తరువాత పొలములలో వేసినటువంటి ఏ నూరు ఎకరాలో, ఏ రెండువందల ఎకరాలో లేకపోతే ఏ 10,15 ఎకరాలో సాగు చేస్తే, సాధారణముగ చిన్నచిన్న చెరువులక్రింద వేసేదో, rain-fed సాగుగా ఉండేదో తప్ప- సాధారణముగ చెరువులక్రింద వేసేది, చిన్నచిన్న వాగో. లేక నదో అనుబంధముగ ఉన్న చెరువులక్రింద వేస్తారన్నమాట. అందువల్ల rain-fed tanks అంటే ఏ river నుంచి అయినా నీరు తీసుకోకుండా ఉండేటటువంటి కేవలము rain-fed tank అని నిర్వచనము యివ్వడమువల్ల ఏమి జరుగుతున్నదంటే, యిలాంటి ప్రాజెక్టుల విషయములో మేము ఆలోచన సెలెక్టు కమిటీలో

చర్చించిన దానికి విలువలేకుండా పోతూందని నేను మనవిచేస్తున్నాను అదే నిన్న మంత్రిగారు సమాధానము చెప్పే సమయములో నేను దానికి clarification యివ్వమని అడగాలని లేచి నిలబడ్డాను ఎందుకంటే అక్కడ సెలెక్టుకమిటీలో హాజరుగా కూర్చున్న Revenue Secretaries కూడ, "సాధారణముగ అటువంటిది రాదనే ఉద్దేశ్యముతోనే మేముకూడ ఉన్నాము అది న్యాయమేనని వారు అంగీకరించారుకూడ, కాని ఈ రెండు నిర్వచనముల ద్వారా ఆ విషయము ఎగిరిపోయి ఎక్కడో, ఏకొద్దో nominal గా ఉండే వాటికి మాత్రమే యిది వర్తిస్తుంది, ఈ విధముగ ప్రభుత్వముయొక్క రికార్డులలో నమోదు అయి ఉండి, 3,4 సం॥లు regular గా, పంటలు పండుట లేదు అని నిర్ధారణ అయినటువంటి ప్రాజెక్టుల విషయములో మాత్రమే నేను అడుగుతున్నాను గాని ఎవరుమటుకు వారు మంత్రిగారిని అది మినహాయింపు చేయాలి, ఇది చేయాలి అని అడిగేదృష్టితో నేను మాట్లాడడము లేదు నేనుచెప్పే ప్రాజెక్టు విషయములో కొన్ని accepted facts ఉన్నవి కొన్ని ప్రాజెక్టుల విషయములో ప్రజలు కోరకుండా ఉండడమువల్ల, 3, 4 సం ల కొకసారి మాత్రమే పంటలుపండేవిఉన్నవి అలాంటి వాటి విషయములో ప్రభుత్వము తప్పకుండా ఆలోచించకపోతే కేవలము యీ wet assessment మీద వేయడము అంటే, రైతులకు చాలా నష్టము వస్తుంది ఈ విషయానికి సంబంధిచే (శ్రీ) రాజగోపాలనాయుడుగారు యింకా కొందరు కూడ సెలవిచ్చారు అందువల్ల అన్నిగూడ ఎక్కడికక్కడికి మంచిమంచి పెద్ద ప్రాజెక్టుల విషయములో కూడ ఎప్పుడో ఒకసారి పంటలేనందువలన ఆ విషయం కూడ త్రోసివేయమని నా ఉద్దేశ్యము కాదు అయితే ప్రభుత్వముయొక్క దృష్టికివచ్చిన ప్రాజెక్టులలో కొన్నింటిక్రింద 3, 4 సం ల కొకసారి మాత్రమే పంటపండే వాటినిగురించి మనకందరికీ తెలుసుననుకోండి. అవి పెద్దవి అయినప్పుడు వాటిని ఏ విధముగ మినహాయింపు చేయాలి అనేది మంత్రిగారు సెలవు యివ్వాలని కోరుతున్నాను. అందువల్ల నేను చెప్పేది ఏమిటంటే, ఈ rain-fed అనే word యీ క్లాజులోనుంచి delete చేయాలని కోరుతున్నాను. అది delete చేసేటట్లయితే 8 నెలలవరకు నీరు సప్లయిఅయి, తప్పనిసరిగ వరిపంట పండినటువంటివాటికే యీ assessment apply అవుతుంది అని అర్థము వస్తుంది అందువల్ల సాధారణముగా పెద్దపెద్ద ప్రాజెక్టులు అన్నీ నా సవరణద్వారా ఏమాత్రము కూడ నష్టపడవు. వాటి అన్నింటి విషయములో ఆ రకంగా assessment వస్తుంది. ఎక్కడైతే ఆ రకంగా వరిపంట వేయకుండా యితర మెట్టపంటలు వేస్తారో వాటికి మాత్రమే వసూలు అయ్యేటట్లుగా నా సవరణ

ఉపయోగిస్తుంది గనుక, మంత్రిగారు ఈ విషయమును అంగీకరించవలసిందిగా విజ్ఞప్తి చేస్తున్నాను ఎందువల్లనంటే Select Committee లో సూత్రప్రాయముగ అందరముకూడ దీనిని అంగీకరించాము అందువల్ల ఈ సవరణ అంగీకరించమని మంత్రిగారిని కోరుతున్నాను

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు మంత్రిగారి సమాధానము విన్నతరువాత, నాకు ఏమైనా అనుమానము వస్తే అడుగుతాను.

* శ్రీ కె వెంకటరావు నేను సమాధానము చెప్పినతరువాత యింకా అనుమానము వస్తే, మరల చెప్పేదానికి నాకు అధికారము లేదు అనుమానం ఉంటే, ఉన్నట్లే లెక్క అన్నమాట అందువల్ల నేను యిప్పుడు ఒక్కటే విషయము చెప్పదలచుకున్నాను "నది" అంటే తెలుసుకోలేనటువంటివారు ఎవ్వరుకూడ ఉండరు ఏదైనా వాగో, ఏదైనా చిన్న కాలువ మాదిరిదో చిన్న చెరువులోపలకు వస్తే అది "నది" అని చెప్పటానికి ఆస్కారము లేనటువంటి విషయము ఇక పోతే, "middle river" అంటే పెద్ద river అనే question లేదు నిన్న నేను చెప్పినట్లు యలమంచా రెడ్డిగారికి వారిజిల్లాలో ఉన్న మైపాడు ప్రాజెక్టు ఒక్కటే ఆ యనదృష్టిలో ఉన్నది అనుకున్న ప్రకారము దానికి నీరు రాకపోయి ఉండవచ్చు అసలే నీరురాదు అంటే, చెప్పడం కష్టము ఏ సంవత్సరమైనా వర్షాలు తగ్గినట్లయితే. దానిక్రింద 12 వేల ఎకరాలకు బదులు రెండు వేల ఎకరాలే పండి, మిగతా పదివేల ఎకరాలలో జొన్నగాని, లేకపోతే యితర మెట్టపైర్లుగాని పెట్టుకోవడము జరుగుతుంది. కాని యీ 12 వేల ఎకరాలలో ఒక్క ఎకరానికికూడా నీరు చాలనటువంటివి tanks లోనికి అసలు నీరే రానటువంటి పరిస్థితి వున్న class 1 గాని, class 11 projects గాని ఎక్కడైనా ఉన్నవి అని నేను అనుకోను అలాంటప్పుడు అసలు additional assessment మాత్రమే కాదు, అసలు assessment కూడ తీసివేయవచ్చు రెండవ విషయము. కొంతమంది సభ్యులు dry crop వేసుకుంటే, wet crop assessment తీసుకోవద్దు అని అంటున్నారు ఇది ఆలోచించవలసిన విషయమే. Dry crop వేసినమాట నిజమేనని రుజువుఅయితే, అది మైపాడు కానివ్వండి, యింకొకటి కానివ్వండి అలాంటిదానికి wet assessment మాత్రము వేయడము జరగదని వారికి నేను మనవిచేస్తున్నాను. అందువల్ల యీ సవరణ అనవసరమని అంటున్నాను.

శ్రీ బి. శంకరయ్య Dry crop వేసినప్పుడు యీ assessment నే యిదివరకు వసూలు చేస్తున్నారు అలాంటప్పుడు దీనికి ఎట్లా లేకుండా ఉంటుంది ?

*శ్రీ కె వెంకటరావు Wet assessment మీద పడే additional assessment విషయమే నేను చెప్పాను కాని అంతగా పంటలు పోయి అక్కడ ఏమీకూడ లేకుండాఉంటే, అసలు assessment యేమీ లేకుండా తీసివేస్తానని చెప్పాను ఇక యీ రెంటికూకూడ కాదని మూడవది యింకా ఏదైనా ఉంటుం దేమో నాకు తెలియదు

*శ్రీ యం నాగిరెడ్డి ఈ rain - fed tanks విషయములో మామూలుగా పండేపంట పోయినట్లయితే, remission యివ్వాలనేది ఉన్నది ఆ విధముగ కాకుండా ఒక వాగులోనుంచి నీరు tank లోకి వచ్చినప్పటికినీ, మంత్రి గారు చెప్పినట్లు, 12 వేల ఎకరాలకు నీరు రాకపోయినా, రెండువేల ఎకరాలకైనా వచ్చినా, అక్కడ సాగుచేయరు అనేది ఉండదు ఎందువల్లనంటే ఎప్పటికైనా నీరు రాకపోతుందా అనే ఆశ రైతుకు ఉంటుంది గనుక, కొద్దిగానైనా నీరువస్తే, అందరుకూడ పంటలు వేస్తారు. వేసినప్పుడు నీరురాక, పంటలు ఎండి పోవచ్చు. అలాంటప్పుడు గూడ remission యివ్వటానికి అవకాశముంటుంది. కాబట్టి దాన్ని పెట్టినందువల్ల వచ్చేనష్టము ఏమీలేదు పండినప్పుడు ఎలాగూ పన్నుకట్టాలి గనుక, యీ సవరణను ఆమోదించడమే మంచిదని అంటున్నాను

*శ్రీ కె. వెంకటరావు పండినవి ఎక్కువగా ఉంటాయి. పండనివి తక్కువగా ఉంటాయి అందువల్ల general గా remission యివ్వడమువల్ల పండినవాటిమీద కూడ వసూలుచేసే అవకాశము పోతుంది కనుక. ఆ విధముగ కాకుండా మొత్తముమీద అంతాపోతే దానినిగురించి తప్పకుండా remission యివ్వటానికి నేను అంగీకరిస్తాను. అంతకంటే చెప్పటానికి ఏమీలేదు

*Mr Speaker*: The question is

"In sub-clause (2) of clause 3, delete the words 'rain-fed' in second line "

The motion was negatived.

*Sri G. Yellamanda Reddy*: I demand a division, Sir.

The House then divided

Ayes 36, — Noes 78.

The motion was negatived

*Sri B Sriramamurthi* Sir, I beg to move

For sub-clause (2) (2) of clause 3, substitute the following

"Notwithstanding anything contained in sub-section (1) in the case of lands served by tanks registered in the settlement accounts as 1st and 2nd class source of irrigation, as well as by tanks with a registered ayacut below and exceeding 200 acres, no additional assessment shall be levied"

*Mr Speaker* Amendment moved

*శ్రీ బి శ్రీరామమూర్తి ఇదివరకు యిదేరకం పల్లంమీద wet assessment వేయడం జరిగింది అప్పట్లో ఆలోచన చేసి ప్రభుత్వంవారు ఒక నిర్ణయం చేశారు అందులో కొన్నితరహాలయిన నీటి వనరులకే exemption యివ్వడం జరిగింది, ఆ exemption ను ప్రస్తుతం రద్దుచేస్తూ కొత్తరకమయిన శాసనం చేయడానికి ప్రభుత్వం ఉద్దేశించింది

"It is also proposed to withdraw the exemption now allowed in respect of lands served by tanks registered in the settlement accounts as first and second class sources of irrigation, as well as by tanks with a registered ayacut exceeding 200 acres since they obtain assured supplies" అని చెప్పడం జరిగింది.

ఇదీ వున్న పరిస్థితి ఇదివరకు ఏఏ sources of irrigation కు exemption యివ్వాలని ప్రభుత్వం భావించిందో అదేరకమైన irrigation sources కే తిరిగి నేడు exemption లేకుండా పన్ను వేయాలని ప్రభుత్వం సంకల్పించింది ఇటువంటి సంకల్పం ఏ పరిస్థితులవలన ప్రభుత్వానికి కలిగిందో నాకేమీ స్పష్టంగా తెలియదు. ఇదివరకున్న పరిస్థితులు యేమీ మారలేదు కొన్ని గ్రామాలలో వ్యవసాయానికి నీటిసరఫరా చేయడంలో అభివృద్ధి హెచ్చుగా జరిగిందని నేను భావించడంలేదు. 200 ఎకరాలకు మించివున్న చెరువులకుకూడా ఈ wet assessment వేస్తున్నారు. అందుచేత అటువంటి చెరువుభూములకు శిస్తు వేయడానికి వీలులేదని ఉద్దేశించిన సవరణ నాది. రైతులకు సరిగా నీటిసరఫరా చేయడం ప్రభుత్వపు బాధ్యత అయినప్పటికీ నీరు సరిగా సరఫరా కాలేదని

రైతాంగం నిత్యమూ గోలపెడుతున్నారు ఇదివర కిచ్చిన exemption ను యిప్పుడు రద్దుచేయవలసిన పరిస్థితులు యీ మధ్యకాలంలో ఏర్పడలేదు అందుచేత యిదివరకు ఏ irrigation resources సందర్భంలో exemption యిచ్చారో తిరిగి వాటికే exemption యివ్వాలని ప్రభుత్వాన్ని నేను కోరుతూ దీనిని అంగీకరించాలని మనవిచేస్తున్నాను

శ్రీ కె వెంకటరావు అంగీకరించడానికి వీలులేదు ఇదంతా ఒకశే రకమయినది దీనినిగురించికూడా చర్చ జరిగాక సెలెక్టుకమిటీవారు యిందాక చెప్పిన సవరణ చేశారు దానికి clarification అడిగారేగాని, దీనినిగురించి యిది వరకే అంగీకారం కుదిరింది

*Mr Speaker* The question is

"That for sub-clause (2) (2) of clause 3, substitute the following

Notwithstanding anything contained in sub-section (1), in the case of lands served by tanks registered in the settlement accounts as 1st and 2nd class source of irrigation, as well as by tanks with a registered ayacut below and exceeding 200 acres, no additional assessment shall be levied

The motion was negatived

*Sri B Sriramamurti* I demand division Sir

The House then divided

Ayes 37 — Noes . 74

The motion was negatived

*Sri M. Nagi Reddi* Sir, I beg to move .

"In sub-clause (2) (2) of Clause 3 after the words "rain-fed tank", add the words "and non-perennial river"

"After the words "a rain-fed tank" in Explanation to sub-clause (2) (2) in clause 3, add the words "and non-perennial river".

*Mr Speaker:* Amendments moved .

*శ్రీ ఎమ్ నాగిరెడ్డి నదులద్వారా కాకుండా వర్షాధారంగావున్న చెరువుల (rain-fed tanks) క్రింద పంట పోయినట్లయితే, 8 మాసాలు నీరు లేక పోతే wet assessment అనువర్తించదని యీ బిల్లులో వుంది అట్లాగే మెట్ట ప్రాంతాలలో చిన్నచిన్న వాగులుగాని, నదులుగాని వుంటాయి ఒక్కొక్క నదిక్రింద 5 ఎకరాలనుండి 50 ఎకరాలవరకు ఆయకట్టు వుండేవికూడా వున్నాయి అవి guarantee గా పండక 3, 4 సంవత్సరాల కొకసారి పండే వయినా ప్రతిసంవత్సరం నీటితీరువ దరఖాస్తుపెట్టడం, అది మంజూరు కావడం మున్నగు బాధలు కరణం మునసబులవలన పడలేక మాగాణీక్రింద చేర్పించు కున్న భూములు వున్నాయి ఉదాహరణకు పల్నాడుతాలూకాలో రెంటచింతల దగ్గరున్న గోలివాగు, దాచేపల్లి దగ్గరున్న నల్లవాగు, పిడుగురాళ్ళ దగ్గరున్న పిల్లివాగు మున్నగు వాగులక్రింద 10 ఎకరాలు, 15 ఎకరాలు వుండదు. అనావృష్టివలన యీ సంవత్సరం యీ వాగులక్రింద మాగాణీభూమికూడా పండ లేదనే సంగతి మంత్రిగారు వ్రాసి తెలుసుకున్నా తెలుస్తుంది. ఇవి వాస్తవానికి మాగాణులు కావు 'Rain-fed tanks' మాదిరిగానే యీ వాగులుకూడా వర్షముమీదనే ఆధారపడివున్నాయి వర్షము లేనప్పుడు ఇసుక లేక నల్లమట్టి పారుదల అవుతుంది అందుచేత ఇవి rain-fed tanks వంటివే కాబట్టి యిది దృష్టిలో పెట్టుకొని rain-fed tanks కు వున్న cess వలెనే యీ వాగుల క్రిందవున్న భూములకూ విధించే విధానం అవలంబించాలి ఆంధ్రదేశంలో ఇటు వంటివి కొన్నివేల ఎకరాలకంటె ఎక్కువ ఉండవు. వెనుకబడిన మెట్ట ప్రాంతాలకు యీ concession యివ్వడంలో ప్రభుత్వానికి పెద్ద నష్టం లేదు ఆంధ్ర శాసనసభలో దీనిని ప్రవేశపెట్టినప్పుడు నేను యిదే కోరిక కోరగా శ్రీ చంద్రమౌళిగారు "వచ్చేసంవత్సరం చూడవచ్చు" అన్నారు. ఎంతవరకు ప్రభుత్వం దీనిని పరిశీలించిందో తెలియదు శ్రీ కళా వెంకటరావుగారు యీ చిన్న సవరణను అంగీకరించాలని తమద్వారా కోరుతున్నాను

*శ్రీ పి. సుందరయ్య. అధ్యక్షా, మంత్రిగారు మరొకపర్యాయం ఆలోచించాలని కోరుతున్నాను సెలక్టు కమిటీకి పోకముందున్న బిల్లులో నదుల ద్వారా నింపబడిన చెరువులు తప్ప మిగిలిన వాటికి అదనపు నీటితీరువ వేయ కూడదని వుంది ఇప్పుడు అన్నిరకాల చెరువులను దీనిలోకి తేవడానికి సవరణ వచ్చింది. దానినుంచి కొన్ని మినహాయించడం జరిగింది. దీని విషయం సెలెక్టు కమిటీలో చర్చ జరిగింది. 'Rain-fed' అనేరకంగా పరిమితి చేయడం కాకుండా పన్నురీత్యా అది I class irrigation source అయితే కావచ్చు, Irrigation

లెక్క ప్రకారం I & II class కావచ్చు ఏమైనప్పటికీ 8 నెలలు నీళ్లు guarantee గా వుంటాయని register చేస్తేనే అది I & II class irrigation sources క్రిందికి వస్తుంది నిజముగా 8 నెలలు నీరు దాంట్లో వుండదు వరిపైరుకు 8 నెలలు నీరు వుండకపోయినప్పటికీ అదనపు శిస్తు వేయడం సరియైనది కాదు అటు వంటి చెరువులు చాలా వున్నాయనేసంగతికూడా వస్తుంది నది నీటితో నింప బడినదంటే 'నది' ముందు నిర్వచింపబడాలి "ఏది నది ? ఏది వాగు ? ఏది వాగు, నదులమధ్యవచ్చే మధ్యరకపు నది ? ఆ list ఏమయినా వుందా ?" అని రివెన్యూశాఖవారిని సెలక్టుకమిటీలో అడిగాము 'Non-perennial అయితే నది కాదనీ, perennial అయితే నది అనీ చెప్పారు "Perennial rivers యొక్క list మీ దగ్గర వుందా ?" అని రివిన్యూ శాఖవారినడిగాము 'అటువంటి list మాదగ్గర లేదు' అన్నారు అందుకని గ్రుడ్డితనంగా ఎవరు యేదనుకొంటే అది అనుసరించడానికి వీలులేదు పెన్నానదికి కనిగిరి reservoir వున్నచోట నెల్లూరు reservoir వున్నచోట perennial అయితే కావచ్చు అక్కడ చెరువులను నింపి పండించడానికి అవకాశం వుందికాబట్టి కాని అనంతపురం, కడపజిల్లాలలో పెన్నానది perennial కాదు దానిక్రింద చెరువులోకి ఏమాత్రం నీరువచ్చినా, చెరువులు నిండిపోతున్నాయనే పేరుతో అది perennial river అని వాటికి wet assessment అదనంగా వేయడానికి వీలుంటుంది లెక్కలలోమాత్రం 8 నెలలు నీరుందని register లో వుంటుంది, అందుచేత అదనపు శిస్తు పడుతుంది, అది సరికాదు

ఈ మధ్య మనము అనేక మీడియమ్ ప్రాజెక్టులను కడుతున్నాము నగిలేరు, పింఛా, రాళ్ళపాడు మొదలైనవి మీడియమ్ ప్రాజెక్టులు మన్నేరు, పాలేరు, పింఛానది ఇవ్వన్నీ చిన్న ఏర్లు వాటికి లక్షలు ఖర్చుచేసి ప్రాజెక్టులు కడుతున్నాము. దీనిక్రింద చెరువులు ఏర్పడుతున్నవి. వీటిక్రింద వాస్తవికంగా 8 నెలలు నీరు సప్లయి కాకపోయినా, సప్లయిఅయ్యేగ్యారెంటీ లేకపోయినా గవర్నమెంటువారి రికార్డులో 8 నెలలు సప్లయి చేయగలిగిన చెరువు అని వుంటుంది. 4, 3 సంవత్సరాలలో కొంతభాగానికే నీరు సప్లయి అవుతుంది. 10 వేల ఎకరాలు ఆయకట్టు వుండి, 10 వేలకు నీరు సప్లయి కాకపోతే 2 వేల ఎకరాలకు సప్లయిచేస్తే దానిపైన తీసుకోవటమే ఈ బిల్లు ఉద్దేశ్యమని కళా వెంకటరావుగారు చెప్పారు. కాని ఆ ఉద్దేశ్యం నెరవేరుస్తారనే నమ్మకం మాకు లేదు. Rain-fed అనే పదం తీసుకువచ్చి ఇవ్వదలచుకొన్న కన్సెషన్ లేకుండాచేస్తున్నారనే నేను చెబుతున్నాను. ఈ చట్టమును అమలుజరిపే ఉద్యో

గస్థులు ఇది river fed tank అనే విషయము ఆలోచించరు సగిలేరు, పింఛా నది, పాలేరు, మున్నేరు, మూసి ఇవ్వన్నీ నదులు కాబట్టి, వాటికి ప్రాజెక్టులు కట్టాము కాబట్టి ఈ చెఱువులు rain-fed tanks కావని అంటారు Rain-fed tanks క్రింద 8 నెలలు water వచ్చే వాటిలో పంట పండకపోతె అదనపు శిస్తు వేయకూడదని ఈ క్లాజులో వున్నా, ఇవి rain-fed tanks కావు కాబట్టి పంట పండకపోయినా 8 నెలలు నీరు వుంటుందని రికార్డులో వుంటుంది కనుక వీటిపై అదనపు శిస్తు పడుతుంది 1st class source అయినా 2nd class source అయినా rain-fed అయినా కాకపోయినా, 8 నెలలు నీరు వుంటుందని రికార్డులో వుండి, పంట పండితే అక్కడ అదనపుశిస్తు వేస్తాము లేకపోతే వేయము" అనేది సెలక్టుకమిటి చర్చల సారాంశము Rain-fed అనే పదాన్ని కలిపి నదికి definition ఇవ్వలేదు కనుక వారికి ఇచ్చిన కన్సెషన్ ఉపయోగంలోనికి రాకుండాపోతున్నది మంత్రిగారు ఈ rain-fed అనె పదాన్ని తొలగించటానికి ఒప్పుకొనటంలేదు తొలగించటంవల్ల వచ్చే నష్టమేదో నాకు కన్పించటములేదు 1st & 2nd class irrigation sources క్రింద 8 నెలలు నీటి సప్లయి వుందని రికార్డులలో వుండి, వరిపైరు పండినపుడే వేస్తామని చెబితే అది rain-fed ఐనా కాకపోయినా ఫరవాలేదు ఈ మినహాయింపు పెట్టవలసిన అవసరం ఎందుకు వచ్చిందో నాకు తెలియటములేదు Perennial river కు కూడా నిర్వచనంలేదు. దానికి నిర్వచనమువుంటే పెద్దనదులకు ఆ నిర్వచనమును వర్తింపచేయుటకు వీలుఉంటుంది Rain-fed అనే పదం అవసరమని మంత్రిగారు చేర్చినపుడు 'నది'కి ఎవరికి ఇష్టంవచ్చిన అర్థం వారు చెప్పకుండా కనీసం non-perennial river అని add చేయాలి దానివలన ప్రభుత్వానికి లక్షలు, కోట్లు నష్టం రాదు కనుక మంత్రిగారు దీనిని అంగీకరించాలని కోరుతున్నాను

*శ్రీ కె వెంకటరావు అధ్యక్షా! దీనిలో ఒక అపోహ వున్నట్లు కన్పిస్తున్నది చెరువులోనీళ్ళు ఎంతకాలం ఉంటాయి? దానివలన పంటపండుతుందా లేదా అన్న విషయం కాదు అక్కడ పంటపండకపోతే wet assessment లేదు, dry assessment లేదని మనవిచేశాను. Perennial అనే definition లో వున్న కష్టం మనవి చేస్తాను నదిలో 365 రోజులు నీరు పారకపోవచ్చును. ఒకవేళ 365 రోజులూ నీరు పారి పంటపండితే, ఈ non-perennial అనే పదం ఉపయోగించటంవలన ఇబ్బందివస్తుంది. అందువలన అది చేర్చటానికి వీలులేదు Non-perennial river ద్వారా నీరు రాక, చెరువులలో నీరు లేక పంటపండక పోతే దానిపై wet assessment పడనవసరం లేదనే నాఅభిప్రాయం. సభ్యులు

కూడా అదే కోరుతున్నారు ఏదయినా అలాంటిసందర్భము, కష్టము ఏర్పడితే దానిని సరిచేయడానికి ప్రభుత్వానికి అధికారం వుంది Interpretation ఇవ్వ టానికి ప్రభుత్వము సంసిద్ధంగా వుంటుందని నేను మనవి చేస్తున్నాను

*Mr Speaker* The question is

"In sub-clause (2) (2) of clause 3 after the words 'rain-fed tank' add the words 'and non-perennial rivers' "

After the words 'a rain-fed tank' in Explanation to sub-clause (2) (2) in clause 3, add the words "and non-perennial river "

The motions were negatived

*Sri B Sriramamurthi* Sir, I beg to move

After the words 'a rain-fed tank in the Explanation (2) (2) of Clause 3, add the following—

"or a tank which derives supplies from a source other than a river "

*Mr Speaker* Amendment moved

*శ్రీ బి. శ్రీరామమూర్తి అధ్యక్షా, rain-fed tank అనే కాకుండా a tank which derives supplies from a source other than a river అని వుండాలని నేను అభిప్రాయపడుతున్నాను ఈనాటి పరిస్థితులు చూస్తుంటే ఇచ్చిన హామీలు ఒక విధంగా వుంటాయి, అమలుజరుగుతున్న పనులు యింకో విధంగా వుంటున్నాయి మంత్రిగారు ఇచ్చిన హామీ ప్రకారం 8 నెలలు నీరు రానప్పుడు, tax వేసే పరిస్థితి లేనప్పుడు ఈ సవరణ ప్రయోజనం వుండదు దానిని గురించి మంత్రిగారి అభిప్రాయం తెలుసుకోవలసివుంది

ఉదాహరణకు ఒక విషయమును మనవిచేస్తాను విజయనగరం తాలూకాలో ఆనందపురం అనే గ్రామముంది అక్కడ ఒక ఏటికాలువ వుంది. కాని అది పాడయి చాలాకాలమైనది ఏటినుండి, ఇతరత్రా వారు నీరు తెచ్చుకొంటున్నారు ఏతాం పెట్టి తోడుకొంటున్నారు. పంట పండినా 0-6-0, 0-8-0 పంట పండుతుంది, కాని పూర్తిపంట పండదు. రైతులు ఆ కాలువపై ఆధారపడటంలేదు. వారు స్వయంకృషిచేత నీరు తెచ్చుకొని సేద్యం చేసుకొంటున్నారు. అది పల్లపుభూమి. దానిపై tax పడుతోంది. అటువంటిది పడకుండా

వుండాలని నా అభిప్రాయం అలా పడదని మంత్రిగారు చెబితే దానిని press చేయవలసిన అవసరంలేదు లేనియెడల press చేయవలసివుంటుంది

*శ్రీ కె వెంకటరావు అధ్యక్షా! ఏ పొలము పండాలన్నా స్వయంగా కష్టపడి సేద్యంచెయ్యాలి "సేద్యంచేయక భూమిని వూరికే వదిలేస్తాను"అంటే "పన్ను వెయ్యాలా, వద్దా" అనేది వేరే విషయం పొలంలోనికి నీరు వచ్చి, పంట పండితే పన్ను ఇవ్వమని అడుగుతున్నాము పంట పండకపోతే ఇవ్వనవసరం లేదని చెప్పాము నీరు రాకపోవటం వల్ల పంట పండకపోతే దానికి పన్ను వేయటం జరగదని నేను మనవిచేశాను అది విశ్వసించాలా? లేదా అన్నది సభ్యులకు సంబంధించినది నాలో నాకు విశ్వాసము వున్నది నాపై ఎక్కువ మంది సభ్యులకు కూడా విశ్వాసం వుండటంవల్లనే ఈనాడు ఈ బెంచిపై కూర్చునివుండటం జరుగుతోంది అన్ని విషయాలు సుందరయ్యగారు మాట్లాడి నపుడే మనవిచేశాను అవే తిరిగి చెబుతున్నాను

* శ్రీ యమ్ సత్యనారాయణరాజు (చీపురుపల్లి - జనరల్) పంట పండి నట్లయితే పన్ను తీసుకొంటామని మంత్రిగారు చెప్పారు 15, 20 సం॥ల వరకు రైతు మదుపుపెట్టుకొని ఏతాంపెట్టుకొనో, గూడవేసుకొనో నీరుతెచ్చి పండిస్తు న్నాడు వ్యవసాయానికి, మదుపులకు చాలా ఖర్చవుతుంది పైగా గవర్న మెంటుకు పన్ను చెల్లించాలంటే రైతుకు లాభంవుంటుందో, నష్టం వుంటుందో మంత్రిగారు ఆలోచించారా?

మిస్టర్ స్పీకర్ చెఱువు చేర్చాలా, వద్దా, అనే మాట వుంది కాని ఇదంతా ఇప్పుడు ఎందుకు?

శ్రీ బి శ్రీరామమూర్తి అధ్యక్షా, మంత్రిగారు అంగీకరించటంలేదు కనుక ఓటుకు పెట్టండి

*Mr Speaker*. The question is:

After the words "a rain-fed tank in the Explanation (2) (2) of Clause 3, add the following—

"or a tank which derives supplies from a source other than a river."

The motion was negatived.

*Sri B Sreeramamurthy* I beg to move

"Add the following as sub-clause (c) to Explanation in clause 3

'Lands which are included under the ayacut of an irrigation resource but do not actully get the benefit of such water for any reason, shall be exempted from the operation of this Act for the purpose of levying additional assessment' "

*Mr Speaker* Motion moved

*శ్రీ బి శ్రీరామమూర్తి సామాన్యంగా ఏదైనా irrigation resources ఉన్న సందర్భంలో దానిక్రింద, ఆయకట్టుభూముల క్రింద కొన్నివందల ఎకరాలు చేర్చబడి ఉంటాయి కాని ఆ ఆయకట్టు భూమి అంతటికీ నీరు ఎప్పుడూ సప్లయి కాదు ఆయకట్టు లాండులు ఉన్న భూములు పంటలు లేక పాడయిపోతున్న పరిస్థితి ఉన్నది ఆరకంగా ఆయకట్టు భూమి క్రింద include అయినప్పటికీ, actual గా నీరు తీసుకోవడం, benefit పొందడం లేక పంటలన్నీ పాడైపోయే పరిస్థితులుంటే మాత్రం ఏ విధమైన assessment ఉండకూడదనేది నా సవరణ

ఇదివరకు "compulsory levy of water rate" అని ఒక చట్టంచేశారు నీరు తీసుకొన్నప్పటికీ తీసుకొనకపోయినప్పటికీ ప్రభుత్వ లెక్కలలో ఆయకట్టు క్రిందకు వచ్చింది కాబట్టి, తప్పనిసరిగా నీటితీరువ చెల్లించితీరాలి ఆయకట్టు క్రింద include చేసినమాట నిజమే పల్లంక్రింద మార్చబడని భూములున్నాయి భూమి ఆయకట్టుక్రిందనే ఉన్నది కాని పల్లం క్రింద మార్చేశక్తి రైతుకు లేదు కాబట్టి అది మెట్టక్రిందనే ఉండిపోయింది ఈనాడు అటువంటి భూములకు wet assessment apply అవుతుంది ఆ రకంగా apply కాకూడదని నా సవరణ అందుచేత, Ayacut land క్రింద include అయినప్పటికి, రైతు స్వంతంగా దానిని మాగాణిక్రింద మార్చుకొనే శక్తి లేకపోయినప్పటికీ, నీరు సప్లయికానందువల్ల పంటలు పాడైపోతున్న భూముల సందర్భంలో యీరేటు apply కాకూడదు. ఈ విషయం మంత్రిగారికి మనవిచేస్తూ యీ సవరణను అంగీకరించాలని కోరుతున్నాను.

*శ్రీ కె. వెంకటరావు ఇదివరకు చెప్పిన సమాధానం ప్రకారం దీని ఆవశ్యకతలేదని మనవిచేస్తున్నాను. ఇది మళ్లా మొదటికి వెళ్లడమే అవుతుంది. అసలు guarantee of water rate శ్రీరామమూర్తిగారు చెప్పేభావాన్నే దీంట్లో యిరికించారు. అందువల్ల దీనిని accept చేయడానికి వీలులేదు.

*Mr Speaker* The question is

"Add the following as sub-clause (c) to Explanation in clause 3—

'Lands which are included under the ayacut of an irrigation resource but do not actually get the benefit of such water, for any reason, shall be exempted from the operation of this Act for the purpose of levying additional assessment "

The motion was negatived

*Sri B Sriramamurthi* I beg to move .

"Add the following at the end of sub-clause (2) (2) of clause 3

'In case of lands included under the ayacut of a rain-fed tank which derives supplies from a source other than a river, no additional assessment shall be levied' "

*Mr Speaker* Motion moved

శ్రీ బి శ్రీరామమూర్తి అధ్యక్షా, నేను యీ సవరణను ప్రతిపాదిస్తున్నాను మంత్రిగారు యిదివరకే సమాధానం చెప్పారు. అసలు యీ సవరణను ప్రతిపాదించక పూర్వమే, general discussion లోనే వీటన్నింటికీకూడ మంత్రిగారు సమాధాన మివ్వడం జరిగింది అందుచేత, వారు ఎలాగూ సమాధానం చెప్పారు. మేము ఎలాగూ సవరణలు పెడుతున్నాము వీటికి ఏమీ ప్రయోజనం లేదు కాని ఇందులో ఒక ముఖ్యమయిన విషయమున్నది మేము యీ సవరణలు తెచ్చిన సందర్భంలో కొంచెం కటువుగా మాట్లాడిన పరిస్థితికూడా ఉండవచ్చు మంత్రిగారుకూడా తీక్షణంగా సమాధానం చెప్పిన పరిస్థితి ఉన్నది వారు చాలావరకు patient గా విన్నారు మేముకూడా చాల వరకు patient గానే విన్నాము కాని యీ పన్నులభారం వహించే రైతులకు యింత patience ఉంటుందా అని నా అనుమానం కాబట్టి మంత్రిగారు యీ విషయాన్ని దృష్టిలో పెట్టుకొని — మా సవరణలు కాకపోయినా, ఆమోదించవలసినదని వారిముందు పెడుతున్నాను.

*శ్రీ కె వెంకటరావు అధ్యక్షా ! నా patience ను, House యొక్క patience ను, ఇతర members యొక్క patience ను గురించీ, ఇంకా యితర స్నేహితులయొక్క patience ను గురించి శ్రీరామమూర్తిగారు ప్రశంసించారు చాలా సంతోషం కాని patience లేనివారు బయట ఉన్నారని వారి

అభిప్రాయం దేశభక్తి ఉండి, దేశ పురోగమానాన్ని కోరేవారెవ్వరూకూడ యీ భారాన్ని వహించడానికి ఎంతమాత్రమూ సంకోచించరని నేను ఆశిస్తున్నాను ఇప్పుడు వేసినభారం అంత బరువైనదికాదు ఒకవేళ భారం పడినట్లయితే, ఆ బరువును మోసినప్పుడే పురోగతితో అంతా, ముందు మజిలీకి చేరడానికి వీలవుతుంది అనే నమ్మకం కలవాడనుకనుక, యీ కార్యక్రమానికి అందరూ దోహదం యిచ్చి ముందుకు తీసుకువెళ్ళవలసినదని కోరుతున్నాను

*Mr Speaker* The question is

"Add the following at the end of sub-clause (2) (2) of clause 3

'In case of lands included under the ayacut of a rain-fed tank which derives supplies from a source other than a river, no additional assessment shall be levied' "

The motion was negatived

*Mr Speaker* The question is

"That Clause 3, as amended, stand part of the Bill "

The motion was adopted

Clause 3, as amended, was added to the Bill

*Clause* 4

*Mr Speaker* The question is

"That Clause 4 stand part of the Bill "

The motion was adopted.

Clause 4 was added to the Bill

*Short title and commencement*

*Mr Speaker* · The question is

"That Short title and commencement stand part of the Bill"

The motion was adopted

Short title and commencement were added to the Bill

*Preamble*

*Mr. Speaker* : The question is ·

"That the Preamble stand part of the Bill "

The motion was adopted

The Preamble was added to the Bill

*Sri K Venkata Rao* I beg to move

"That the Andhra Land Revenue (Additional Wet Assessment) (Andhra Pradesh Amendment) Bill, 1957 be passed into law"

*Mr Speaker* Motion moved,

శ్రీ పి సుందరయ్య అధ్యక్షా, పేదరైతులమీద భారం తగ్గడానికి మేము క్లాజు క్లాజుకూ మా శక్తికొలదీ సవరణలు పెట్టడం జరిగింది మేము పదేపదే "పేద, పేద— సాద, సాద" అంటూవుంటే మంత్రిగారికి కోపంవస్తూ ఉండవచ్చు

శ్రీ కె వెంకటరావు నాకేమికోపము? నేనూ పేదవాడినే

శ్రీ పి సుందరయ్య మంత్రిగారు ఒక్కొక్కపర్యాయం విసురుకుంటూ ఉంటారు

శ్రీ కె. వెంకటరావు అస్తమానం అనవద్దని, అంతకంటే ఏమీలేదు

శ్రీ పి. సుందరయ్య మంత్రిగారు మాట్లాడకుండా మౌనవ్రతం పుచ్చుకొన్నప్పుడు—వారికి ఎంతఓపిక ఉన్నదో పరీక్షచేయడానికి, వారి మౌనవ్రతాన్ని భంగంచేయడానికి ఏ పదజాలం ఉపయోగించినా పనిచేయవు కాని 'పేదరైతు' అనేటప్పటికిమాత్రం, పేదరైతులంతా ఎక్కడ మాసొత్తు అయిపోతారో అనే అదుర్దాచేతనో, ఎందుచేతనో కాని ఆ మౌనవ్రతాన్ని భగ్నంచేస్తూంటారు అటువంటి పేద, సాద, మధ్య తరగతిరైతులు—ఈ సామాన్య రైతులమీద పన్నుల భారం అదనంగా పడకూడదు, ఇదివరకే ఎక్కువ భారమున్న ప్రాంతాలలో తగ్గించాలి అని— మంత్రిగారికి విసుగుపుట్టినా, పదేపదే ఇది ఒక పాఠం అయిపోయినా, ఏమైనా సరే, పేద, సాద రైతు అనేటప్పటికి రోతపుట్టినా ప్రభుత్వ దృష్టికి తేకతప్పదు ఈనాడేకాదు, మేము యిక్కడ వుండబోయే 4 ఏండ్లు కూడా ఉంటుంది తరువాత ఎన్నికలలో ఎవరొస్తారో, ఎవరురారో తెలియదనుకోండి.

శ్రీ కె. వెంకటరావు: నేను మాత్రం ఉండను.

శ్రీ పి సుందరయ్య అసలు ఉండకుండానే వెళ్ళిపోతామన్న వారికి అసలేరోత, శాసనసభ అంటే అసలేరోత

ఈ భారాన్ని సాధ్యమైనంతవరకూ తగ్గించేందుకు మేము శాయశక్తులా-సెలక్టు కమిటీలోనూ, యిక్కడకూడ అనేక సవరణలు పెట్టటంజరిగింది కాని వాటిని మంత్రివర్గం అంగీకరించే పరిస్థితిలో లేకపోయింది 'ప్రజలు ఎన్నుకున్నారు, మెజారిటీఉన్నది, కాబట్టి మా రామరాజ్యంలో చట్టాలు చేయవలసిన అవసరమున్న'దని భావించే యివన్నీ చేస్తున్నారు అందుచేత పేద, సాద ప్రజల మీద అదనపు పన్నులు ఏదో ఒక పరిస్థితిలో మాత్రమే వేయడానికి ఉన్నది మిగిలిన ధనవంతులందరిమీద వేసినప్పటికీ చాలకపోతే, దేశంయొక్క అస్థిత్వానికీ ముప్పు వచ్చే పరిస్థితులలోనో, లేక ఏ యుద్ధ సంక్షోభంవంటి దానిలో యిరుక్కున్నప్పుడు మాత్రమే, ఆకలితో ఉన్నాసరే, ఒకపూట పస్తున్నాసరే యీ పన్నులు భరించకతప్పదు అని చెప్పడానికి హక్కు వస్తుంది తప్ప యీ లోపల అటువంటి హక్కురాదు "యుద్ధ సంక్షోభంలో ఉన్నప్పుడు మాత్రమే వేయడంకాదు, యిది ఒక రకమైన యుద్ధ సంక్షోభం, పంచవర్ష ప్రణాళిక యుద్ధ సంక్షోభం, రామరాజ్య సంక్షోభం, ఇప్పుడుకూడా పన్నులు వేయా"లని మంత్రిగారన్నారు ఈ రామరాజ్య సంక్షోభకాలంలో పేదసాద ప్రజలందరి మీద పన్నులు వేసేముందు. ఎవరిని గురించి అయితే మేము "ధనవంతులు, భూస్వాములు, ఉన్నవాళ్ళు, యిచ్చుకోగలిగిన వాళ్ళు" అని పదేపదే చెప్తున్నామో, వాళ్ళమీద వేయవలసినంత వేశారా ? అని అడుగుతున్నాను Agricultural income tax ను కొద్దిమందిమీద పడుతున్న దానిని ఉపసంహరించుకోవాలని ఒక నిర్ణయం చేసుకొన్నప్పుడు కనీసం ఈ పన్నునైనా భూవసతి ఎక్కువ ఉన్నవాళ్ళమీద, ఎక్కువ ఆదాయం వచ్చేవాళ్ళమీద, యిచ్చుకోగలిగినటువంటి వాళ్ళమీద వేసిఉండవలసింది. కాని ఈ బిల్లుయొక్క లక్ష్యం, వారందరిమీద వేయవలసినంత వేయకుండా పేద సాదలమీద మాత్రం వేస్తూఉన్నట్లుగా ఉంది ఇది రామరాజ్య సంక్షోభానికే పనికివస్తుంది దేశం యొక్క నిజమైన సంక్షోభానికి దారితీసేరీతిగా ఈ పన్నువిధానం ఉందని చెప్పక తప్పదు

శ్రీ కె. వెంకటరావు రావణరాజ్యం అక్కరలేదా ?

శ్రీ పి. సుందరయ్య . రామరాజ్య సంక్షోభమని వారు వాడిన పదాన్నే నేనూ ఉపయోగిస్తున్నాను రావణరాజ్యం అంటే వారు ఏ విధంగా జవాబు చెప్పబోతారో నాకు తెలుసు.

మిస్టర్ స్పీకర్ ఆంధ్ర దేశంలో రామరావణ యుద్ధంలేదు అది అంతా తమిళనాడుకే వదలిపెట్టాం

శ్రీ కె. వెంకటరావు ఇదంతా మనదేనండి మనమంతా దండకారణ్యంలో ఆ రావణుని చూడటానికి వెళ్ళిన రాములం!

శ్రీ పి సుందరయ్య ఈ రామరాజ్య సంక్షోభంలో పేదసాదలమీద పన్ను వేసే పద్ధతి నిజమైన సంక్షోభానికి దారితీస్తూ ఉంటుంది అందుచేత మంత్రిగారు దీనిని గురించి ఆలోచించాలని చెప్పవలసి ఉంటుంది ఇది యుద్ధ సంక్షోభం కాదు, శాంతి సంక్షోభం అన్నారు నిజమే "శాంతి కాలంలో దేశాన్ని పునర్నిర్మించే situation లో ఉన్నాం కాబట్టి అదనపు పన్ను ప్రజలమీద వేయవలసి ఉంటుంది ప్రతి ఒకడూ కూడా యివ్వవలసి ఉంటుంది ఈ రోజున అదనపు పన్ను ఒక ఎకరం ఉన్న రైతుమాత్రం పన్ను యివ్వడం లేదా ? పరోక్షపు పన్నులు కట్టడం లేదా ? ఏమాత్రంకూడా భూమి లేనటువంటి వ్యవసాయ కూలీలు, కార్మికులు ఇంకా యితర ప్రజలు excise పన్నుల ద్వారా, customs ద్వారా, export duties ద్వారా అనేక విధములైన పరోక్షపు పన్నుల ద్వారా, ప్రభుత్వానికి డబ్బు చెల్లించడం లేదా ? అందుచేత ఈ శాంతి సంక్షోభంలోనే దేశాన్ని పునర్నిర్మాణం చేయాలి" అని యిప్పటికే అదనంగా భరించేదానికన్న ఇంకా అదనపు భారాన్ని వారిమీద వేయడమనే టటువంటి రీతిగా ఈ బిల్లు స్వభావం ఉన్నది పేదసాదలమీద అదనంగా ఈ పన్నులభారం వేసి ధనవంతులమీద దామాషాగా భారంవేస్తూ వారిని చాలా తేలికగా వదలివేసేదానికి ఈ బిల్లు ఉపయోగపడుతుందని నేను మంత్రిగారికి అనేక పర్యాయాలు చెప్పాను అందుచేత ఈ బిల్లును మేము వ్యతిరేకించక తప్పదు శంకరయ్యగారేదో Marxism గురించి చెప్పారన్నారు, శంకరయ్యగారేమి చెప్పారో నాకు అర్థంకాలేదు. మంత్రిగారు దేనిని గురించి చెప్పినారో నాకర్థం కాలేదు, Rule 183 క్రింద Marxism ను గురించి చర్చించడానికి శాసనసభలో ఒకరోజు debate పెట్టమని అధ్యక్షుల వారి permission తీసుకొని, చర్చించేటపుడు Lenin సిద్ధాంతం అంటే ఏమిటో, Marxism అంటే ఏమిటో వ్యాఖ్యానం చేయవచ్చును. చైనావంటి బ్రహ్మాండమైన దేశాలలో ఈ Marxism ను అమలులో పెడుతున్నారు. దానిని అనుసరించే మహాదేశంల్లో మన దేశ పరిస్థితుల కనుగుణ్యంగానే మనదేశాన్ని ముందుకు తీసుకువెళ్ళేదానికి ప్రయత్నం చేస్తున్నారు అవే

విషయాలగురించి చర్చించవచ్చు మేము చెప్పేది వాళ్ళకు అర్థంకావటం లేదు వాళ్ళేమి చెప్తున్నారో మాకు అర్థంకావడం లేదు కనీసం ఒకరినొకరు పొరపాటుగా అర్థంచేసుకోకుండా, మేమేమి చెప్తున్నామో, వారు అర్థంచేసుకొనే దానికి, వాళ్ళు ఈ సిద్ధాంతాల గురించి ఏమి చెప్తున్నారో మేము అర్థం చేసుకొనేదానికి ఒకటి, రెండు రోజులు చర్చ పెట్టుకుంటే సవ్యంగా ఉంటుంది అపుడు Marxism అంటే ఏమిటో, Communism అంటే ఏమిటో, సోషలిస్ట్ తరహా ప్రజాస్వామికం అంటే ఏమిటో, రామరాజ్యం అంటే ఏమిటో అన్నింటినిగురించి తెలుసుకోవచ్చు రామునియొక్క చరిత్రలో రాముడిని మనం ఆదర్శంగా తీసుకున్నా, రాముడు శంబుకుని వధించడం మాత్రం ఎవరూ హర్షించ లేరనుకుంటాను ఆకాలం పోయింది, ఆ రామరాజ్యంలో శంభుకుని ఆవిధంగా వధించినకాలం పోయింది మరల ఈ కొత్త రామరాజ్యంలో అటువంటి శంబుకవధలు చేయకండి నిజంగా రామరాజ్యంలో, రాముని కాలంలో రాముని ఆదర్శంగా తీసుకొని నిజంగా అటువంటి వ్యక్తిని గురించి చరిత్రలో ఉన్నది ఉన్నట్టుగా జరిగినా, జరగకపోయినా మన చరిత్రలో ఇతిహాసాలలోని రాముని జీవితాన్ని చిత్రించి ఒక వ్యక్తి జీవించడానికి దానిని ఆదర్శంగా తీసుకుంటూ దానిలోని శంబుకవధలలాంటి చిన్నచిన్న నలుసులను మాత్రం ఆధారం చేసుకొని ఆ విధమైన పనులు చేయకుండా వ్యవహరించాలి ఇపుడు పరిపాలన చేస్తున్నటువంటి రామరాజ్యంలో మాత్రం పేదసాదలమీద పన్నులు వేయడమనేది శంభుకవధలాంటిది ఆ కాలంలో శంభుకుడు శూద్రుడు ఇపుడు పేదసాదలు, భూమిమీద కష్టపడి పనిచేసేవాళ్ళు శూద్రులు. రాముడు శంభుకుని చంపినట్లే ఈ రామరాజ్యంలో పేదలను చంపేదానికి యిటువంటి పన్నులను వేయడం మంచిదికాదు. ఆ రామరాజ్యంలోని మంచిని తీసుకుని చెడును తీసుకోకుండా ఉండాలని చెప్తూ ఈ బిల్లును వ్యతిరేకిస్తూ ముగిస్తున్నాను

మిస్టర్ స్పీకర్ ఈ discussion ను యింక త్వరలో close చేయబోతున్నాను. Now I shall give five minutes to Sri P Narsinga Rao.

* శ్రీ పి. నరసింగరావు : అధ్యక్షా ! Wet Assessment Bill ను ప్రవేశ పెట్టినప్పటినుంచి, Select Committee level లో నుండి కూడా సవరణలిచ్చి తద్వారా దానిని వ్యతిరేకిస్తూ వస్తున్నాము. అయినా కాంగ్రెస్‌పార్టీవారు వారియొక్క సంఖ్యాబలంతో ప్రతిపక్షంవారు చెప్పే మంచివిషయాలను

కొన్నిటిని కూడా అంగీకరించకుండా "మాకు బలంవుంది మాకు ప్రజలు ఎక్కువఓట్లు యిచ్చిన ఫలితంగానే మేము ఇంతసంఖ్యలో యిక్కడ ఉన్నాం, ప్రజల శ్రేయస్సుకొరకే మేము యిటువంటి బిల్లును తీసుకువస్తున్నాం" అని మాటలు చెప్తూ ఆమాటలద్వారానే కేవలం తమగోతులను తామే త్రవ్వుకోవడమే కాకుండా దానికితోడుగా ప్రజలగోతులు కూడా త్రవ్వుతున్నారు కాబట్టి మేము ఈ బిల్లును వ్యతిరేకిస్తున్నాము తమగోతులు తాము త్రవ్వుకుంటే మాకేమీ అభ్యంతరం లేకుండా పోయేది కాని దానితోబాటు ప్రజల గోతులుకూడా త్రవ్వడానికి ప్రయత్నిస్తున్నారు. అందుచేత మేము ప్రతిపక్షం నుంచి ఈ బిల్లును వ్యతిరేకించక తప్పదు ఈ బిల్లుకు చాలా సవరణలు, వచ్చాయి ముఖ్యంగా irrigation sources కు సంబంధించిన సవరణలు ప్రతిపక్షం వైపునుంచి వచ్చినపుడు మంత్రిగారు ఆ విషయమై ఆ సవరణలకు అనుగుణ్యంగా మేము కొన్ని rules తీసుకువస్తామని కూడా చెప్పడం జరిగింది సాధారణంగా discretionary powers ప్రభుత్వానికి ఉన్నపుడల్లా ఆ discretionary powers ను ప్రభుత్వానికి అనుకూలంగా ప్రజలకు వ్యతిరేకంగా ఉపయోగించడమనేది అనుభవంలో ఉన్నవిషయం అలా జరుగకుండా కనీసం ఈ బిల్లును మామూలుగా తీసుకువచ్చే సందర్భంలోనైనా కాస్తో, కూస్తో ఈ discretionary powers ఎక్కడెక్కడైతే ఉన్నాయో అక్కడ, అంటే పంటలు చెడిపోయిన సందర్భంలో కాని, పూర్తిగా పంటకు కావలసినన్నిరోజులు నీరు ఇవ్వలేని సందర్భంలో కాని, పంటకు ఏవిధంగానైనా నష్టం వచ్చిన సందర్భంలో కానీ, ఈ additional wet assessment ను వేయకుండా ఉండాలని ప్రభుత్వాన్ని కోరుతున్నాను అంతేకాకుండా ఈ బిల్లులను ప్రవేశపెడుతూ కొద్దిరోజులలోనే తెలంగాణా ఆంధ్రప్రాంతాలలో పన్నులను సమన్వయం చేయడానికి ఒక Land Revenue Commission ను వేస్తామని మంత్రిగారు పదేపదే చెప్పడం కూడా జరిగింది కాబట్టి అటువంటి Commission ను వెంటనే నియమించి మొత్తం Land Revenue structure ను పునర్నిర్మాణం చేయటానికి ప్రభుత్వం తగిన చర్యలు తీసుకోవాలని మనవి చేస్తున్నాను. ఆ Commission ను నియమించినంత మాత్రాన లాభంలేదు. దానిని నియమించిన తరువాత వీలైనంత త్వరగా అది పనిని పూర్తిచేసేటట్లు, ఆ తరువాత ఆ Commission చేసిన సూచనలను, recommendations ను సత్వరంగా అమలు జరిగేటట్లు చూడవలసిన అవసరం చాలా ఉన్నది. సాధారణంగా ప్రభుత్వం Commission ను నియమించడం జరుగుతూ ఉంటుంది. Land Taxation Enquiry Commission ను ప్రభుత్వం నియమించింది. ఆ కమిషన్ volumes కొలది reports యిచ్చినది, కాని

అందరి recommendations, సూచనలలో ప్రభుత్వం తమకు అనుకూలమైనవిగా ఉండేటటువంటివాటిని అమలు జరపడానికి ఒప్పుకొని, ఏవైతే సామాన్య ప్రజలకు అనుకూలంగా ఉండి వారికి లాభదాయకంగా ఉంటాయో అటువంటి వాటిని ఒప్పుకోకుండా ఉండడమనేది జరుగుతూ ఉంది కాబట్టి Land Revenue structure ను rational basis మీద ఏర్పాటుచేయవలెనని కోరుతూ ఈ బిల్లును ఈ stage లో కూడా నేను వ్యతిరేకిస్తున్నాను

*శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య అధ్యక్షా, యీ బిల్లును ప్రజానీకం హర్షంతోటి మాత్రం ఆమోదించదు విధిలేని భారముగా మాత్రమే భరిస్తుంది దీనిని గరళంగానే వారు భావిస్తారు అయితే యీ గరళం యొక్క ప్రభావం ఫలితం ఎలా ఉంటుందో ఇప్పుడే చెప్పలేము యీనాడు మనకు లాండు రెవిన్యూ విధానం చాల లోపభూయిష్టంగా ఉన్నది. దీనిని సరిచేయడానికి ఒక కమిటీని త్వరలో వేస్తున్నామని మంత్రిగారు చెప్పారు ముఖ్యంగా జాయింటు పట్టా విధానాన్ని రద్దుచేయవలసిఉన్నది దానివల్ల రైతులకు చాలా కష్టనష్టాలున్నాయి అనేక సందర్భాలలో రైతులు హెచ్చు శిస్తులు ఇచ్చుకోవలసి వస్తున్నది యీ అదనపు శిస్తు వసూలుచేసే విషయంలో కూడ గ్రామోద్యోగులు అన్యాయాలు చేయకుండా జాగ్రత్తగా చూడవలెనని మనవిచేస్తున్నాను యీ బిల్సుకు సంబంధించిన రూల్సును ఉద్యోగుల డిస్క్రిషనుకు వదలివేసి రైతులు అపీలు చేసుకోవడానికి కూడ అధికారం లేకుండా చేయడం మంచిది కాదు ఉద్యోగులు డిమాండు నోటీసు వ్రాసే తేదీకినీ, అది రైతుకు చేరేనాటికి మధ్య ఎంతో వ్యత్యాసం ఉంటుంది నోటీసు ఇంటి గోడకు అంటించివెళ్ళి ఇదివరకే ఇచ్చామని చెప్పే సందర్భాలు అనేకం ఉన్నాయి స్థానికంగా ఉండే అధికారుల నిరంకుశత్వం, అధికారుల కోపం, స్థానిక మురాతత్త్వంవల్ల రైతులకు అన్యాయం జరుగకుండా చూడవలెనని చెబుతూ యీ బిల్లును నేను పూర్తిగా అపోజ్ చేస్తున్నాను

*శ్రీ కె. వెంకటరావు: అధ్యక్షా, యీ బిల్లు త్వరలో శాసనం కాబోతున్నది. నేను ముందుగా తమకు కృతజ్ఞత తెలుపవలసిఉన్నది. నేను భోజనం చేసివచ్చాను. కాని తమరు భోజనం చేయకుండా 1 గంట వరకు ఇక్కడ కూర్చుని యీ ప్రొసీడింగ్సు త్వరలో పూర్తిచేసేటట్లు మాకందరికి ఆదర్శపూర్వకంగా ఉన్నారు తమకు నా తరఫున, ప్రభుత్వం తరఫున కృతజ్ఞత తెలుపుకుంటున్నాను ఇప్పుడు మాట్లాడిన ముగ్గురు గౌ. సభ్యులు కూడ మళ్ళీ

జనరల్ ప్రాబ్లమ్సులోనికి వెళ్ళినారేగాని దీనిలో ఉన్న ప్రత్యేకలోపాలు వారు గుర్తించలేదు బీద, సాద అనేవారిగురించి నేను ఎప్పుడూ బాధపడుతూంటాను అది వస్తేనే కాని నాలో రియాక్షన్ ఉండదు అని ప్రతిపక్ష నాయకులు చెప్పడం సమంజసమయిన విషయం కాదు యీ దేశంలో బీదలను, సాదలను తలపెట్టుకోకపోతే ఇన్ని సంవత్సరాల రాజకీయ జీవితం వృధా అయిపోయిన దని విచారించవలసివస్తుంది వారియొక్క స్వాతంత్ర్యం కోసమే, స్వాతంత్ర్యం వచ్చిన తరువాత వారియొక్క అభ్యున్నతికోసం కృషిచేస్తున్నాననేటటువంటి సర్వజ్ఞత్వం కూడ నాకున్నది యీ ప్రపంచంలో దేవుడు కొన్నాళ్లు వయస్సు ఇచ్చాడంటే ఆ బీదలకు, ఆ సాదలకు సేవచేసేటటువంటి ఉద్దేశ్యంతోటే ఇచ్చాడనే నమ్మకంతోటే నేను ఉన్నాను అయితే ఆ బీదలకు, ఈ శాసనమునకు ఏమీ సంబంధంలేదు వాళ్లు యీ శాసనానికి బయటనే ఉన్నారు ఏ సిగరెట్ వంటిదైనా కొనుక్కుంటే ఇండైరెక్టు టాక్సు ఏదైనా చెల్లిస్తారేమో తప్ప వాళ్లు ఇటువంటి డైరెక్టు టాక్సు ఇచ్చుకోరు ఇటువంటి పన్నులు ఇచ్చుకొనేవాళ్ళు బీదవాళ్ళలో చాలా కొద్దిమంది ఉంటారు ఎక్కువగా ఉండరనే సంగతి తెలిసికూడా యీ రకమయినటువంటి వాదనను చేయడం అన్యాయమానం వారికోసమే బ్రతికి ఉన్నట్లు మాట్లాడుతూ ఇంకొకరు లేరని మాట్లాడుతూ ఉంటే దానికి నేను ఎపుడయినా జవాబుచెప్పి ఉండవచ్చును గాని, బీదలకు జరిగే ఉపకారానికి అభ్యంతరం పెట్టడానికి గాని, బీదలకు నెత్తిమీద రాళ్ళుమోపి పూర్వకాలంలో రాజులు చేసేటట్లుగా వీధిలో, ఎండలో నిలబెట్టి పన్నులు వసూలు చేయాలనేటటువంటి దృష్టిగాని నాకు ఎంత మాత్రం లేదని నేను మొదట మనవిచేస్తున్నాను. యీనాడు మార్క్సిజమ్ గురించిగాని, గాంధిజం గురించిగాని యీ శాసనసభలో సభ్యులు చర్చకు తీసుకుని రావడంలో అర్థంలేదు ఆ విషయాలన్నీ అవతల చెప్పుకుంటున్నాము వారి పుస్తకాలు మేము చదువుకుంటున్నాము. మా పుస్తకాలు వారు చదువుకుంటున్నారు. కాని మధ్యన ఒక సభ్యుడు లేచి దీనిని ఎత్తడంవల్ల యీ విషయాన్ని మాట్లాడవలసి వచ్చిందే కాని వారు దీనిని కదపకపోతే నేను దానిని గురించి, చెప్పే అవకాశం లేదని మనవి చేస్తున్నాను. ఇప్పుడు ఉన్నటువంటి విషయం ఒక్కటే. ప్రతిపక్షంవారు దేశంలో అన్నీ గోతులే అన్నారు. ఆ గోతులు పూడ్చడానికే మేము ప్రయత్నం చేస్తున్నాము. గోతులు త్రవ్వి ఆ గోతులలోనే కాపురం ఉన్నవారుకూడా ఉన్నారు. అటువంటి వారిని నేనేమీ చేయలేను. గోతులను పూడ్చి దేశంలో వీలైనంత సమత్వం తీసుకొని రావడానికి ప్రయత్నం చేస్తున్నాము. అంటే హిమాలయా పర్వతాలను,

సముద్ర తీరాన్ని సమానం చేస్తే ప్రపంచమే ఉండదు అందువల్ల హిమాలయా పర్వతాలను కొంత తగ్గించడానికి, సముద్ర తీరాన్ని ఇంకొంచెం ఎత్తు చేయడానికి (అంటే ఈ రెండూ జరిగే విషయాలు కావని నాకు తెలుసు) దేశంలో ఉన్నటువంటి బీదసాదలను పైకి ఎత్తి వారి స్థాయిని అభివృద్ధిచేసి మరీ ఎక్కువగా నున్నవారిని క్రిందకు తీసుకొని రావాలని మా అభిప్రాయం పూర్తిగా సమానం అనేది లేదు మాలో సమానత్వం అనే భావం ఉంది దానిప్రకారమే ఇది జరుగుతున్నది ఈ చేసే కృషి ఫలితంక్రింద ఉన్నవాళ్ళను పైకి ఎత్తి, పైన ఉన్నవాళ్ళను కొంచెం క్రిందకు తీసుకొనివచ్చే మధ్య మార్గంగా ఉంచి అంతరువులను తగ్గించేటటువంటి యత్నంతోటే రామరాజ్యం స్థాపన చేద్దామనేటటువంటి ఉద్దేశంతోటి పురోగమిస్తున్నాము అందువల్ల ఇందులో సూత్రకులు లేరు రాముడు లేడు భావం మాత్రమే ఉన్నది అందరకు శాంతి దొరకేటటువంటి, అందరికి అభ్యుదయం కలిగేటటువంటి ముహూర్తంలో కృషి జరుగుతున్నది పేదవాడికి ఇంకొక 5 కుంచాల ధాన్యం ఎక్కువగా రావాలంటే ఇరిగేషను ప్రాజెక్టు తప్పదు ఇరిగేషను ప్రాజెక్టు కావాలంటే కోటి రూపాయలో, 5 కోట్ల రూపాయలో పెట్టుబడి పెట్టక తప్పదు ఊరికినే ఎవరూ డబ్బు ఇవ్వరు వారికి వడ్డీ ఇచ్చుకోవాలి. వడ్డీ ఇచ్చుకోవాలంటే పన్ను ఇచ్చుకోక తప్పదు అవసరమైతే బెటర్ మెంట్ లెవీ ఇచ్చుకోక తప్పదు అవన్నీ కాకుండా ఎక్కడనో అలాడీన్ లాంప్ వలె తెల్లవారేటప్పటికి ఒక దివ్య భవనం, దానిలో ఒక దివ్యసుందరిని తయారు చేసేటటువంటి దానిని చైనానుండి ఇంకా మేము తెచ్చుకోలేదు అక్కడకూడ లేదనే నేను నమ్ముతున్నాను అందువల్ల బాధవల్లచే ఈ కృషిజరగాలి ఆ కృషికోసమే ప్రయిత్నం చేస్తున్నాము దానికి అందరూ తోడ్పడినట్లయితేనే యీపని జరిగి బీదవాళ్ళయొక్క పరిస్థితి పైకి వెళ్ళుతుంది. "It should not be a division of poverty; it should be a division of prosperity" అనేటటువంటి సిద్ధాంతంమీద మనం వెడుతున్నామని మనవి చేస్తున్నాను దానికి ఇది బాగా తోడ్పడుతుంది కనుక మేము దీనిని తీసుకొని వస్తున్నాము. కాని ఎవరికీకూడ హాని చేయాలనే దృష్టి ఎంతమాత్రంలేదు.

లాండ్ రెవిన్యూ కమిషన్ గురించి కొందరు మాట్లాడారు నేను ఇదివరకే చెప్పాను త్వరలోనే ఏర్పాటుచేస్తున్నామని. చాలావరకు సర్క్యులేషను అయినదని-అనుకొంటున్నాను ఏదో ఫైనాన్షియల్ కమిట్ మెంటు కోసం - ఇందుకయ్యే ఖర్చుకోసం - పరిశీలన జరుగుతున్నది. తొందరలోనే కమిషన్ నిర్మాణం చేయబడుతుందని మనవి చేస్తున్నాను.

ఇంక ఆఖరు విషయం దీనిలో మిత్రుడు గోపాలకృష్ణయ్యగారికి గరళం కనిపించినది ఎందుచేతనో ఆ గరళాన్నే కనుక వారియొక్క ఉద్దేశం ప్రకారం యీ దేశంలో తయారుచేస్తే ఆ గరళాన్ని మింగటానికి సరిపోయిన నీలకంఠుణ్ణి నేను ఉన్నానని మనవిచేస్తూ యీ బిల్లును అమోదించవలెనని కోరుతున్నాను

*Mr. Speaker* The question is

"That the Andhra Land Revenue (Additional Wet Assessment) (Andhra Pradesh Amendment) Bill, 1957 be passed into law "

The motion was adopted

*Sri P Sundarayya* I demand a division, Sir

The House then divided

Ayes 78, Noes: 38.

The motion was adopted

మిస్టర్ స్పీకర్ నాతో సహకరించి యీ బిల్లును పాస్ చేయడానికి తోడ్పడిన మంత్రిగారికి, ప్రతిపక్ష నాయకులకు, ఇతర గౌ॥ సభ్యులకు కృతజ్ఞత తెలుపుతున్నాను

ఈవేళ సాయంకాలం తిరిగి 4 గంటలకు సమావేశమవుతున్నాము.

*The House then adjourned for Lunch till Four of the Clock*
*The House reassembled after Lunch at Four of the Clock*

[*Mr. Speaker in the Chair*]

## DISCUSSION ON PATASKAR REPORT

మిస్టర్ స్పీకర్ : పటాస్కర్ రిపోర్టునుగురించి చర్చించుటకు సమావేశమయినాము - ఆ రిపోర్టులో హోసూరుమగురించి చెప్పలేదు అది ముగ్గురికి (మూడు రాష్ట్రాలకు) సంబంధించిన సమస్య అని చెప్పినారు. అందుచేత హోసూరును గురించి చర్చించుట కైము వేస్టు అవుతుంది. ముఖ్యంగా దక్షిణ సరిహద్దులు,—చిత్తూరుజిల్లా, చెంగల్పట్ జిల్లాల సరిహద్దుల విషయమై సభ్యులు మాట్లాడవచ్చును.

శ్రీ జి. లచ్చన్న (సోంపేట) : రిపోర్టులో వ్రాసిన దానిమీద base అయి మాట్లాడమంటారా ? ఆ రిపోర్టును accept చేస్తూ మాట్లాడమంటారా?

మిస్టర్ స్పీకర్ రిపోర్టును accept చేయాలనిలేదు Criticise చేయవచ్చును

శ్రీ జి లచ్చన్న రిపోర్టులోని విషయాలను గమనించి సభ్యులు తమ అభిప్రాయములను చెప్పవచ్చునుకదా ?

మిస్టర్ స్పీకర్ అవును కాని పర్లాకిమిడి, శిరివంచ, దక్షిణ బస్తర్, మైసూరులో కొన్ని ప్రాంతాలు—అవన్నీ రావలెనని కాకుండా, చిత్తూరు, చెంగల్పట్ జిల్లా సరిహద్దులగురించి చెప్పవచ్చును శ్రీ పటాస్కర్, హోసూరునుగురించి చెప్పను అన్నారు

శ్రీ యన్ పి చెంగల్రాయనాయుడు (వేపంజేరి) పటాస్కర్ రిపోర్టు ఆంధ్ర - మద్రాసు బార్డరుగురించి వచ్చింది. ఆ బార్డరుకు సంబంధించిన విషయాలన్నీ మాట్లాడవచ్చునుకదా ?

మిస్టర్ స్పీకర్ మాట్లాడవచ్చును

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య హోసూరుసమస్యనుకూడ తీసుకొనుటకు ఒప్పుకుంటేనే చర్చకు వస్తామని గవర్నమెంటు చెప్పారు అదికూడ చాలా ప్రధానమైనది ఆ claim అడగటానికి అవకాశం ఉన్నదికదా ?

మిస్టర్ స్పీకర్ ఉన్నది కాని ఆ details లోకిపోయి యిన్ని గ్రామాలు ఉన్నవంటూ ఆ map వివరాలలోకి పోకుండా జనరల్‌గా చెప్పవచ్చును

శ్రీ యమ్. సత్యనారాయణరాజు మినిస్టీరియల్ లెవెల్‌లో ఈ రిపోర్టు ఆమోదించబడినట్లు ఉన్నది ఇప్పుడు అసెంబ్లీలో ఒక resolution పాస్‌చేసి సెంట్రల్ గవర్నమెంటుకు పంపడం ఉంటుందా ? లేక discuss చేసి ఊరుకుంటారా ?

*Mr. Speaker* Unless I am corrected, it is only a discussion under Rule 70. Am I right ?

*Sri N. Sanjeeva Reddi*. Yes, Sir.

*Mr. Speaker*: Then we have to confine ourselves to Rule 70.

శ్రీ యమ్ సత్యనారాయణరాజు ఈ డిస్కషన్ వలన ప్రతిఫలం ఏమిటి?

మిస్టర్ స్పీకర్ గారు సభ్యులు తమ అభిప్రాయములు తెలిపితే, ఆ influence గవర్నమెంటుమీద ఉంటుంది

ముఖ్యమంత్రి (శ్రీ యన్ సంజీవరెడ్డి) గారు సభ్యులు తమ అభిప్రాయములు తెలిపితే, మద్రాసు ప్రభుత్వంతో సంప్రదించవలసివచ్చినప్పుడు, మా సభ్యులు యిటువంటి అభిప్రాయములను వెలిబుచ్చినారని, న్యాయము పరిశీలించాలని చెప్పటానికి వీలవుతుంది దెబ్బలాటకు మమ్ములను పురికొల్పి పంపరు కదా!

శ్రీ యమ్ సత్యనారాయణరాజు ఈ అసెంబ్లీ తాలూకు opinion ఒక resolution గా వుంటే బాగుంటుందని అనుకొంటున్నాను

శ్రీ కె వెంకటరావు ఢిల్లీనుంచి కేంద్రప్రభుత్వం వారు బార్డరు అడ్జస్ట్ మెంట్సు గురించి మనకు reference కు పంపించినతరువాత, మనము ఒక resolution రూపంలో పంపాలి—దానిని approve చేస్తున్నామనో, లేదనో సభ్యులు తమ గారు అభిప్రాయాలను, సమయోచితమైన భావాలను చెప్పటానికి విపులముగా దీనిని గురించి చర్చచేసుకొనుట మంచిదని, అందరి భావాలు సమీకరించుకొనవచ్చుననే ఉద్దేశంతో యీ సమావేశం ఏర్పాటు చేశారు ఇప్పుడు resolution అంటూ ఏమీలేదు

మిస్టర్ స్పీకర్ Resolution ఎప్పుడు పెట్టాలనే సమస్య వేరు Non-official days ఉన్నాయి అప్పుడు చేసుకొనవచ్చును అది వేరేసంగతి. ఇవాళమాత్రం రూలు 70 క్రింద తీసుకొందాము.

"70 Notice of raising discussion · Any member desirous of raising discussion on a matter of urgent public importance may give notice in writing to the Secretary specifying clearly and precisely the matter to be raised

Provided that the notice shall be accompanied by an explanatory note stating reasons for raising a discussion on the matter in question.

Provided further that the notice shall be supported by the signatures of at least two other members."

Under Rule 71, Speaker has to decide admissibility.

Rule 72 says

"72 There shall be no formal motion before the Assembly nor voting The member who has given notice may make a short statement and the Minister shall reply shortly Any member who has previously intimated to the Speaker may be permitted to take part in the discussion "

ఇప్పుడు అయిద్ద రేకాకుండా అందరూ వినడానికి అవకాశం యివ్వబడింది అంతేతప్ప resolution గాని, Motion గాని, Voting గాని ఏమీలేదు ఇప్పుడు శ్రీ పి గోపాలురెడ్డిగారు (most effected gentleman గనుక) ముందు మాట్లాడుతారు

*శ్రీ పి గోపాలురెడ్డి (తిరుత్తని-జనరల్) అధ్యక్షమహాశయా, ఈనాడు శ్రీ పటాస్కర్ నివేదిక చర్చకు తీసుకురావటానికి అవకాశం ఇచ్చినందుకు తమకు ముఖ్యముగా నేను కృతజ్ఞత తెలుపుచున్నాను సభానాయకులగు శ్రీ నీలం సంజీవరెడ్డిగారికి కూడ నా కృతజ్ఞతలు తెలుపుతూ, తిరుత్తని ప్రాంతమున ఆంధ్రులు పడుతున్న బాధలను వారిదృష్టికి తీసుకువస్తున్నాను ఇప్పటికీ, మించిపోయినది ఏమీలేదని, అక్కడివారికి అనుకూలంగా సవరించుటకు ప్రభుత్వమునకు అవకాశము కలిగించుటకు ఒక మార్గము ఆలోచించి, యీ మోషన్ ఇవ్వబడింది అందుకు మీరు అనుమతించినారు, నేను కృతజ్ఞుణ్ణి

చిత్తూరు జిల్లా 1911 వ సంవత్సరములో ఏర్పాటు చేయబడింది ఈ తిరుత్తని తాలూకా, చిత్తూరు జిల్లాలోని ఇంకొక నాలుగు తాలూకాలు పూర్వము నార్త్ ఆర్కాట్ జిల్లాలో ఉండినవి అవి తెలుగు ప్రాంతాలని, పరిపాలనాసౌలభ్యంకోసం ఆ జిల్లానుండి విడదీసి, కడప జిల్లానుండి రెండు తాలూకాలు చేర్చి, చిత్తూరుజిల్లాను ఏర్పాటుచేసినారు ఇది ఖచ్చితమైన విషయము ఈ విధంగా ప్రభుత్వ రికార్డులలో ఉన్నది తదుపరి 20 సంవత్సరముల తర్వాత తిరుత్తని తాలూకా జనాభాలో 51 పర్సెంటు అరవవారు, 49 పర్సెంటు తెలుగువారు ఉన్నట్లు మన సెన్సెస్ రికార్డులలో ఉన్నవి 1931 వ సంవత్సరానికి, ఆ ప్రకారంగా అరవవారు ఉండటానికి కారణాలుఉన్నాయి ప్రక్కన ఉన్నటువంటి చంగల్పట్టు జిల్లా, నార్త్ ఆర్కాట్ జిల్లాల్లో అరవవారు అధికంగా ఉండిన కారణమున, అప్పుడు చిత్తూరు జిల్లాలో వరుసగా క్షామ బాధలు వచ్చిన కారణమున, మైగ్రేషన్‌తో అరవవారిసంఖ్య కొంత పెరిగినమాట వాస్తవము తిరుత్తని తాలూకాలో భూస్వాములుగా ఉన్నవారంతా తెలుగువారే ఆ పరిస్థితుల్లో కొంత జనాభా పెరిగి, 1931 వ సంవత్సరముకు 51 పర్సెంటుగా వారు మారినారు. 1941 వ సంవత్సరంలో సెన్సెస్ లెక్కలు లేవనుకోండి

1951 వ సంవత్సరంలో సెన్సెస్ లెఖ్ఖలు తయారైనవి ఆ సంవత్సరంలో లక్షా మూడువేలు జనాభా తెలుగువారు, లక్షా ఇరవైఒక్క వేలు అరవవారు, ఎనిమిదివేలు ఇతరులు ఉండిన సంగతి, 1953 వ సంవత్సరంలో పబ్లిష్ అయిన సెన్సెస్ బుక్ ఆఫ్ ఇండియా అనే పుస్తకంలో రికార్డురూపంలో ఉన్నది. 1949 వ సంవత్సరంలో మన నాయకులు అందరుచేరి, ఆంధ్రరాష్ట్రం ప్రత్యేకంగా ఏర్పాటుచేయాలని ఉద్దేశించినపుడు, చిత్తూరుజిల్లా ఆంధ్రరాష్ట్రంలో చేర్చవలసిన జిల్లా అని ఖచ్చితంగా చెప్పబడింది అయితే, సరిహద్దులలో గల కొన్ని గ్రామాలను ఎడ్జస్ట్‌మెంట్ చేసుకోటానికి, యీనాడు ముఖ్యమంత్రిగా ఉన్న శ్రీ సంజీవరెడ్డిగారు, కళా వెంకట్రావుగారు, గతించిన ప్రకాశంపంతులుగారు, ముఖ్యమైన తమిళ నాయకులు, యీనాడు మంత్రివర్గంలో ఉన్న తమిళ మంత్రులందరు ఉన్నటువంటి ఒక కమిటీ ఏర్పాటుచేసుకొన్నారు 1951 వ సంవత్సరపు జనాభాలెఖ్ఖలు తయారైనప్పుడు కొన్ని అవకతవకలు జరిగినవని చెప్పకతప్పదు ఆ కారణంవల్లనే జనాభా పెంపుదలకు ఒక మార్గంకూడ కలిగింది 1953 వ సంవత్సరంలో ఆంధ్ర రాష్ట్రము ఏర్పడిన తరువాత, యీ ఆందోళనకు కొంత దోహదం అప్పుడు ముఖ్యమంత్రిగా ఉన్న రాజగోపాలాచారిగారి వల్ల కలిగిందని చెప్పటానికి నేను సంశయించుటలేదు ఆనాడు మన ఆంధ్రరాష్ట్రంలో 'నాయకుని ఎన్నిక, రాష్ట్రానికి ముఖ్యపట్టణం' విషయాలలో అందరిదృష్టి ఉన్నది ఆ కారణంవల్ల, యీ రిపోర్టు వగైరా చేయటములో వీరికి జోక్యం ఉండినట్లు కనుపించలేదు ఏలనంటే, 51 పర్సెంటు మీద జనాభాలెక్క తీసుకొని సరిహద్దులను నిర్ణయించుకోటానికి అవాడే సమ్మతించినట్లు తెలుస్తున్నది 1953 మార్చి 25 న ఆంధ్రరాష్ట్రం ప్రత్యేక రాష్ట్రంగా ఏర్పరచిన బిల్లు పాస్ అయినపుడు, పండిట్ నెహ్రూగారు పార్లమెంటులో "ఇప్పటి చిత్తూరుజిల్లా ఆంధ్రరాష్ట్రంలో చేర్చవలెనని, అది ఖచ్చితంగా తెలుగు ప్రదేశమని, ఇంకా ఏవైనా సరిహద్దుతగాదాలు ఉంటే, బౌండరీ కమీషన్ పెట్టి, ఆ బౌండరీ కమీషన్ ద్వారా ఆ సరిహద్దు సమస్యలను పరిష్కరించుకోవచ్చును" అని చెప్పినారు. తరువాత "ఆంధ్రప్రభుత్వము, మద్రాసు ప్రభుత్వము కలిసి మీరే యీ తగాదా పరిష్కరించుకోటానికి ఏర్పాటు చేసుకోమని" వారు అన్నారు అందుకు రెండుప్రభుత్వాలు అంగీకరించినవి. 1951 వ సంవత్సరములో చేసినటువంటి సెన్సస్‌లో గ్రామవారీ జనాభాలెక్క లేదు గ్రామాలవారి జనాభా ప్రాతిపదికపైన సరిహద్దులు సమస్య పరిష్కరించుకొనుటకు ప్రభుత్వము అంగీకరించినపుడు, గ్రామాలవారీ జనాభాలెక్కలు కొత్తగా తయారుచేయవలసిన పరిస్థితి ఏర్పడింది. ఇందుకు అర్బుదవాదన్ అనువారిని ఏర్పాటుచేశారు. వారిక్రింద శ్రీమశంకరం అనువారిని నియమించారు సూపరింటెండెంటు ఆయన, డిప్యూటీ సూపరింటెండెంట్ యీయన

అని ఏర్పాటుచేశారు 1951 వ సంవత్సరంలో సెన్సస్ చేసినటువంటి స్లిప్పులు ఆధారం చేసుకొని యీ జనాభా లెఖ్ఖలు తయారైనవి 1955 వ సం॥లో వారు తయారుచేసినటువంటి రిపోర్టును అనుసరించి చూచినట్లయితే, 103 వేలు ఉన్న తెలుగువారు 85 వేలకు దిగజార్చబడినారు 121 వేలు ఉన్న అరవవారు 141 వేలకు పెంచబడినారు కేవలం జనాభా అనుసరించి సరిహద్దు సమస్యను పరిష్కారం చేసుకొంటున్నప్పుడు, ఇంత వ్యత్యాసం వచ్చినదని అప్పటికప్పుడే మేము ప్రభుత్వదృష్టికి తీసుకువచ్చాము ఆంధ్ర-దక్షిణ సరిహద్దు సంఘంవారు యీ ప్రచురణ విషయాన్ని వెంటనే ప్రభుత్వదృష్టికి తెచ్చినారు ఆ ఉద్యోగస్థులను మన మంత్రులు అడగటం జరిగింది వారు సమాధానం ధిక్కరించటం తప్ప మరేమి లేదు ఆ పుణ్యాత్ముడు చేసినటువంటి ఘోరమైనటువంటి పనివల్ల అతని నెగ్లిజన్స్‌వల్ల యీనాడు ఒక లక్షమంది ఆంధ్రులకు దుస్థితి ఏర్పడింది

రెండవ విషయం, — ఆ జనాభా అనుసరించి maps తయారుచేయబడినవి maps తయారుచేయటంలో, అరవవారు 51 పర్సెంటు అంతకు మించిన ప్రదేశమున ఒక రంగు పూసినారు. ఆ map తయారుచేయటంలో మా తిరుత్తని తాలూకా అర్థం సర్వేకాకుండా ఉండినటువంటి ప్రదేశం అటువంటి పరిస్థితిని అర్బుదనాదణ అతని నోటితోనే స్వయంగా చెప్పి ఉన్నాడు "అన్ సర్వేడ్ ఏరియాలో ఎప్రాక్సిమేట్‌గా నేను విలేజ్ బౌండరీస్ మార్కు చేసినానని" చెప్పినాడు కేవలం అన్యాయానికి దారితీస్తుందనే విషయం మన భీమశంకరం గారు గుర్తించ లేక పోయినందుకు యీ దినం చింతించవలసి ఉన్నది.

ఆవిధముగ boundaries మీద ఆధారపడి contiguous గా ఒకగ్రామము యింకొక గ్రామముతో కలిసి ఉండిన గ్రామాలను ఒకే రాష్ట్రములో చేర్చాలనే సిద్ధాంతముక్రింద మనము అట్టిగ్రామాలను ఏర్పాటుచేసుకోవలసిన పరిస్థితులలో యీగ్రామాల boundary సక్రమంగా లేనప్పుడు మనకు ఏవిధముగ న్యాయము కలుగుతుంది అనేది మనము అందరము ఆలోచించుకోవలసిఉంటుంది బౌండరీలను చూపిస్తూ తయారుచేసిన పటములకు ఏదోవిధముగ రంగులుపూసి తయారు చేశారు హోసూరు విషయములో అక్కడ మూడు భాషలు మాట్లాడేవారు ఉన్నప్పటికినీ, తెలుగుభాష మాట్లాడేవారే ఎక్కువగ ఉన్నప్పుడు అది మనకు రావలసిన హక్కు ఉన్నది. అలాంటిది మనకు రాకుండామద్రాసు రాష్ట్రంవారు మాకు రావాలని, మైసూరువారు మాకు రావాలని కోరడం జరిగింది. అందువల్ల చివరికి అది మనకు రాకుండానే చేశారు 1954 వ సం. లో గత ఆంధ్రప్రభుత్వములో మంత్రివర్గము పడిపోయినప్పుడు సుమారు అరు మాసములు గవర్నరు పరిపాలన జరిగింది ఆ సమయములో census లెక్కలు తయారుచేయడము

జరిగింది ఆ సమయములో ఆ లెక్కలు సరిగా తయారుచేస్తున్నారా, లేదా అనేది కనుక్కునే నాథుడు లేకపోయాడు తరువాత 1955 వ సంవత్సరంలో ఫజులాలీ కమిషనును ఏర్పాటుచేశారు వారు యిలాంటి చిక్కుసమస్యలు అన్నీ కూడ చాలా సులభముగ పరిష్కారముచేసి 1956 వ సం లో వారు సమర్పించిన రిపోర్టులో యీ హోసూరు వగైరా ప్రాంతాలలో తెలుగు వారు ఎక్కువమంది ఉన్నారు గనుక యివి ఆంధ్రప్రాంతములో చేర్చడము మంచిదనిగూడ వ్రాయడం అందరికీ తెలుసు ఆ సందర్భములో ఫజులాలీ కమిషనువారు అనుసరించిన సూత్రాలనుకూడ వారి రిపోర్టులో విశదముచేశారు ఏ ప్రాంతములో నైనా సరే ఒకేభాష మాట్లాడేవారు 70% ఉండేటట్లయితే, దానిని uni-lingual గా treat చేయవలసిందని వారు స్పష్టముగ వ్రాశారు ఆవిధముగ చూస్తే, అర్బుదనాదన్ గారి inflated census లెక్కల ప్రకారంగా తిరుత్తని తాలూకాలో 61½% అరవవారు, 31½% తెలుగువారు ఉన్నారని తేల్చారు ఆలాంటి పరిస్థితులలో సూత్రప్రాయముగ నైనా ఆలోచిస్తే, యిలాంటి విభజనచేయవలసిన అగత్యమే లేకపోయేది కాని ఫజల్ అలీ కమిషన్ వారే ఇండియాలో ఉన్న యీ రాష్ట్ర సరిహద్దులకు సంబంధించిన disputed areas అన్నింటిని గురించి పరిష్కారము చేస్తారన్నప్పుడు, యీ సమస్య గూడా వారే చేస్తామని అన్నప్పుడు, "అక్కరలేదు. మాలో మేమే యీ వ్యవహారము పరిష్కారము చేసుకుంటాము, మీరు చెయ్యవద్దని" చెప్పడమువల్ల హోసూరు వగైరా ప్రాంతాలు మద్రాసు రాష్ట్రములోను తిరుత్తని తాలూకా ఆంధ్రప్రదేశ్ లోనూ చేర్చి రాష్ట్రము పునర్నిర్మించారు అంతటితో ఈ సరిహద్దుల సమస్య పరిష్కారముకాకుండా ఆగిపోయింది ఈ తగాదా రాకపోయినట్లయితే తిరుత్తనితాలూకా ఆంధ్రప్రదేశ్ లో ఉండిపోయి, ఆంధ్రులకు న్యాయం జరిగిఉండేదే. మద్రాసు, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాలు యీ తగదా మేమే పరిష్కారము చేసుకుంటాము అని చెప్పిన కారణముచేత, కేంద్రప్రభుత్వము తరఫున వచ్చిన ఫజులాలీ కమీషను వారు యిందులో జోక్యము కలిగించుకోక, యీ సమస్యను అట్లాగే వదిలివేశారు. కాని ఆ తరువాతనయినా యీ ప్రభుత్వమువారు ఫజులాలీ కమిషనువారు సూచించిన సూత్రాలనయినను ఆచరణలో పెట్టారా అంటే, అదేమీ లేదు. అంతకుముందుగానే మద్రాసు ప్రభుత్వము చతుస్సూత్రములు అని అందజేసింది. ఈ నాలుగు సూత్రములు నాలుగు నాగుపాములు అని చెప్పక తప్పదు ఈ నాలుగు పాములతో అరవవారు మమ్ములను ఏ విధముగానయినా చుట్టి చంకలో పెట్టుకొని పోతారు అని మేము అన్నాము. ఈ నాలుగు సూత్రములలో మొదటిది "village as a unit", రెండ

వది 'Contiguity', మూడవది River గాని, కొండలుగాని, బార్డరుగావుండాలి నాల్గవది ఒక ఆయకట్టు, ఒక ప్రాజెక్టు, యీ రెండుకూడ ఒకదాని కొకటికి సంబంధించి ఉంటే, ఆయకట్టుకూడ ఆ ప్రాజెక్టులో చేర్చబడవలసిందే అని, ఈ విధముగ నాలుగుసూత్రాలుగ మద్రాసు ప్రభుత్వమువారు తయారుచేశారు మైసూరు సందర్భములో అది త్రిభాషా ప్రాంతముగనుక, యీ మూడు భాషలలో ఏభాషవారు మెజారిటీలో ఉంటారో, ఆ భాషాప్రాంతాలు ఆ సరిహద్దు రాష్ట్రములో చేర్చవలసి వుంటుంది అని ఆ సూత్రప్రకారము హోసూరు తాలూకాలోని ప్రాంతాలలో తెలుగుభాషవారు మెజారిటీగా వున్నారుగనుక అది ఆంధ్రరాష్ట్రములో చేర్చవలసివుంటుంది ఐతే మీకు contiguity ఉంటేనే, అది మీకు యివ్వవలసి ఉంటుందని కూడ చెప్పారు ఈ విషయమునుగురించి 1956 వ సం లో ఈ రెండు రాష్ట్రముల ముఖ్యమంత్రులతో సమావేశము జరిగింది అయితే ఆ సమావేశములో యీసమస్య సఫలీకృతము కాలేదు ఎందుకంటే, ఆ షరతుకు మద్రాసు ప్రభుత్వమువారు ఒప్పుకోలేదు సమావేశములోని చర్చలవలన యీ సమస్య సఫలీకృతము కాలేదుగనుక యీ విషయము కేంద్రప్రభుత్వానికి వ్రాసుకుంటూ ఒక కమిషను ఏర్పాటుచేయవలసిందిగా కోరడము అయింది ఈ సూత్రములలోకూడ ఆంధ్రప్రాంతములో ఉన్న సరిహద్దులు అన్నింటికి పరిష్కార మార్గముగ ఉభయులకు సమ్మతమైన సూత్రాలు పెట్టుకోవలసిందని కేంద్రమువారు వ్రాసినారు పోనీ జనాభా లెక్కలు చూస్తే, అవి అన్నీ తప్పుడు తడకలుగా తయారయినందువలన వాటిలోని చిక్కులు సవరించటానికి మద్రాసు వారు పూనుకోలేదు అయితే ఈ సమస్య ఎంతోకాలము పరిష్కారము కాకుండ ఉన్నందున కేంద్ర ప్రభుత్వము యొక్క ఒత్తిడిమీద యీ రెండు ప్రభుత్వాల ముఖ్యమంత్రులు ఒక మధ్యవర్తిని ఏర్పాటుచేసుకుని, ఆ మధ్యవర్తిద్వారా యీ సమస్య పరిష్కారము చేసికోటానికి పూనుకున్నందుకు సంతోషమే. అయితే యీ సమస్య ఎన్నాళ్లకు గూడ పరిష్కారము కాకుండా ఉండడమువల్ల యిది ప్రతి ఒక్కరికి తలనొప్పిగా తయారైంది ఎప్పటికైనా యీ తలనొప్పి పోగొట్టుకొనవలసిందేనని అంటున్నారు అయితే ఇద్దరి ముఖ్యమంత్రులకే యింత తలనొప్పిగా ఉంటే, యీ సమస్య ఒక లక్ష జనాభాను పీడించుచున్నప్పుడు, ఆ జనాభాకు యీ విషయములో ఉండే తలనొప్పి బాధ ఎంతగా ఉండిఉంటుందో, గుర్తించమని కోరుతున్నాను ఈ సమస్య విషయములో ఆంధ్రులకు ఎంత ఘోరమైన అన్యాయము జరిగిందో, నేను చెప్పబోయే విషయములవల్ల బోధపడుతుంది. కేంద్రప్రభుత్వమువారు ఉభయరాష్ట్రమంత్రులకు మధ్యవర్తిగ పటాస్కర్ గారిని పంపడమైనది. వారు వచ్చి విచారించే సమయ

ములో, ఈ మధ్యవర్తిత్వమునకు ఒప్పుకున్నప్పటికినీ, ఉభయ మంత్రివర్గము వారు అందజేయవలసిన రికార్డు సక్రమమైనది కాదని, వారే తన రిపోర్టులో వ్రాసియున్నారు మేము కొందరము Andhra Southern Boundary Committee తరఫున పటాస్కర్ గారి ఎదుట బౌండరీలకు సంబంధించిన పటములు జనాభా లెక్కలు అన్నీ తప్పులు, అవి సవరించవలసియుంటుందని represent చేశాము జనాభా లెక్కలు అన్నీ తప్పులు అని చెప్పటాన్ని మేము నిదర్శన ముగా అచ్చువేసిన memorandum కూడ పటాస్కర్ గారికి అందజేశాము 1931 వ సం వు జనాభా లెక్కల ప్రకారము ఒక గ్రామములో 800 మంది తెలుగువారు ఉంటే, 303 మంది ఉన్నారని వ్రాశారు అరవవారు 400 మంది ఉంటే 800 మంది ఉన్నారని వ్రాశారు ఇంత తేడా ఎట్లా వచ్చింది? Natural గా ఉండవలసిన పరిస్థితులనుబట్టి చెప్పవలెనంటే, ఒక్కొక్క సమయ ములో వారు ఆంధ్రప్రాంతాలకు తమయొక్క ఆర్థికాభివృద్ధికొరకు, ఉదర పోషణనిమిత్తం వలసపోయిఉండవచ్చు అయితే తెలుగువారు అంత అమాయకు లంటారా, లేకపోతే వారికి ఏమైనా potency లేకుండాపోయిందా? ఈలాంటి తప్పు లెక్కలు తయారు చేయడము చాలా ఆశ్చర్యకరముగ ఉన్నది ఈలాంటి పరిస్థితులలో జనాభా లెక్కల విషయములో సందేహము వచ్చినప్పుడు 1961 వ సం జనాభా లెక్కలు తయారయ్యేటంతవరకైనా, యీ సమస్య ఆపవలసియుండెను బౌండరీసమస్య ఉభయ ప్రభుత్వాలకు యిబ్బందులు కలుగచేస్తూనే ఉన్నదని అందరికీ తెలుసు. ఈ సమస్య ఉద్భవించినప్పటినుంచి ఆ ప్రాంతా లలో ఏ అభివృద్ధి కార్యక్రమములైనను యిదివరకు తలపెట్టినవికూడా యీ సమస్య ఒక కారణముగ పెట్టుకుని, ఆపివేశారు చేస్తున్న పనులైనా సక్రమ ముగ జరపడము లేదు ఈ విషయము నేను ఆ ప్రాంతాలకు వెళ్ళినప్పుడు స్వయముగ చూచి వచ్చాను ఇలాంటి పరిస్థితులు అక్కడ ఉంటున్నప్పుడు యీ సమస్య త్వరలో పరిష్కారము అయిపోతేనే మంచిదేమోనని అనుకునే వారిలో నేను ఒకడిని పటాస్కర్ గారికి యిచ్చిన రికార్డులలో తప్పులు లేవు అని వాళ్ళు చెప్పగలిగినారంటే, వారు ఎంత మేధావులో అయి ఉండవచ్చు. ఎంత బుద్ధికుశలతగలవారో అయి ఉండవచ్చు అయితే వారు చేయగలిగిన దేమిటి? Mathematical గా ఒక పటముగీసి, దాని మీద రంగుకు రంగుపూసి చూపిస్తే అదిచూచి రిపోర్టు తయారు చేశారేగాని పటాస్కర్ గారు ఆ గ్రామాలు ఏమేమిటో, అవి ఎక్కడెక్కడ ఉన్నవో తెలుసుకోటానికైనా ఆయా గ్రామాలకు వెళ్ళి చూడనే లేదు మద్రాసు ప్రభుత్వమువారు వారుకోరే ప్రాంతాలు వారికి వచ్చేటట్టుగా పటములో contiguity చూపించడమువల్ల పటాస్కర్ దానిమీద ఆధారపడి రిపోర్టు తయారుచేశారని నేను అభిప్రాయ

పడుతున్నాను పోనీ ప్రభుత్వాలనయినా అడిగి తెలుసుకునే అవకాశముకూడ లేదు మద్రాసు ప్రభుత్వమువారు, ఏదోపటము గీసి యిచ్చారు జనాభా లెక్కలు వారికి అనుకూలంగా అద్భుదనాదన్ చేత తయారుచేయించుకున్నారు రికార్డులను, మనుష్యులను evidence యివ్వటానికి తయారుచేసుకుని, పటాస్కర్ గారి ఏదుట పెట్టితే, దానిమీద ఆధారపడి రిపోర్టు తయారుచేయడము జరిగింది పటాస్కర్ గారు ఢిల్లీనుంచి వచ్చీరావడముతో ముందు మద్రాసుకు వెళ్ళారు వెళ్ళగానే అక్కడ representations తీసుకున్నారు తరువాత హైదరాబాదు వచ్చారు ఇక్కడ representations తీసుకున్నారు ఈ సందర్భములో ఒక్క విషయము మీ దృష్టికి తెస్తున్నాను అదేమి పాపమోగాని, పటాస్కార్ గారికి ఆంధ్రులయందు ఎంత అసూయ ఉన్నదోగాని, వారు రేణిగుంట స్టేషనుకు రాగానే మేము సుమారు నూరుమందిమి రేణిగుంట స్టేషనులో వారికి ఒక మెమోరాండము అందజేశాము ఆ మెమోరాండములోని సంగతులుగాని, మేము యీవిధముగ మెమోరాండము యిచ్చామనిగాని, వారు వ్రాసిన రిపోర్టులో ఒక్క మాట అయినా వ్రాయకపోగా, హోసూరు నుంచి కన్నడిగలు ఒక్కరూ రాకపోగా, వారువచ్చినట్లు వారు representation ఇచ్చినట్లు వారికి అనుకూలముగ వ్రాశారు దీనినిబట్టి పటాస్కర్ గారు ఆంధ్రుల యందు ఎంత అసూయ కనబరచినారో బోధపడుతున్నది తరువాత వారు హైద్రాబాదుకు వచ్చినప్పుడు వారికి మద్రాసువారు యిచ్చిన పటములలోను, జనాభా లెక్కలలోనూ తప్పులున్నవని పటములుగీసి ఆ తప్పులన్నీ నిరూపించ గలిగాము. ఆ విషయమునుగురించి అయినా వ్రాయనేలేదు Contiguous గ్రామాలు మేము పటమ్ము గీసి చూపించాము పోనీ మద్రాసు వారు యిచ్చిన పటములు తప్పు అని చెప్పినప్పటికినీ, ఆ పటములైనా తప్పులు లేకుండా కరెక్టుగా గీయించి తెప్పించారా అంటే, అదీగూడ చేయలేదు దీనినిబట్టి పటాస్కర్ గారు అరవవారివైపుకే మొగ్గు చూపించారు నిజానికి హోసూరు విషయములో అది ఆంధ్రలో చేరవలసిన అవకాశములు ఎన్నో ఉన్నవని ఏ పెద్ద అయినా తెలుసుకోగలడు మరొక ఏ మధ్యవర్తి అయినా హోసూరు విషయములో ఆంధ్రులు ఎక్కువగ ఉన్నారన్న సంగతి గుర్తించగలడు తప్పకుండా దానిని ఆంధ్రరాష్ట్రములోనే చేర్చుతారని నా విశ్వాసము. కాని పటాస్కర్ దానిని ఆంధ్రుల తరఫున ఉంచుటకు ఎన్నో అవకాశములున్నను, అవి అన్నీ పాటించకుండా, చివరికి అరవలకే కట్టిపెట్టాలని వ్రాశారు ఇది ఘోర అన్యాయమని ఎవరైనా చెప్పగలరు. హోసూరు ఆంధ్రకు యివ్వటానికి మద్రాసువారు ఏవిధముగానను ఒప్పుకోవడములేదు. అది అన్ని విధములుగ అభివృద్ధిఅయిన చోటు అనే ఉద్దేశ్యముతో, అందులోనిది ఒక్క అంగుళముచోటు అయినను ఆంధ్రలో చేర్పటానికి

గాని, తిరుత్తనిలో ఒక సెంటుస్థలము అయినా విడిచిపెట్టటానికి వారు యిష్టపడడములేదు గనుక, యివి రెండు అరవలకు చెందటానికి కృషిచేశారు ఇక మన ఆంధ్రమంత్రులు ఎటులైనా status quo maintain చేయాలనే ఉద్దేశ్యముతో అరవల వ్యామోహములో పడిపోయినట్లు రుజువుఅవుతున్నది లేకపోతే వారికి కావలసిన గ్రామాలు అరవవారికి పొయ్యేటట్లుగా, మెమోరాండము అరవవారు యిచ్చినట్లుగా, మన ఆంధ్రమంత్రులు యివ్వనేలేదు. ముఖ్యంగా గ్రామాలను గురించి అరవవారు చేసిన అక్రమాలు నేను ఒకటి రెండు ఉదాహరణపూర్వకముగ నిదర్శనముగ చెబుతున్నాను చిత్తూరు జిల్లాలోని 97 వ నెంబరుగల గ్రామం పేరు కుప్పం అని ఉన్నది 99 ఎ నెంబరు గల గ్రామం పేరు నర్సంపేటఅని ఉన్నది అంతర్వేది అనే గ్రామము ఆ ప్రాంతములో నూరవ నెంబరు గ్రామముగ ఉన్నది దీనిని తెచ్చి 179 వ నెంబరుగల రాజానగరం అనే గ్రామములో కలిసిపోయినట్లుగాను, ఆ గ్రామాలను ఒక చిన్న ప్రదేశముగ చూపించారు అర్బుథనాదన్‌గారు 1/16 of a furlong చొప్పున contiguity తీసుకుని అందులోనివి వారికి పనికిరానివి, అక్కరలేనివి 80, 90 గ్రామాలు తెలుగువారివని, పటము గీసి ఉంచే, అవి మనకు వచ్చేటట్లుగా శ్రీ పటాస్కర్‌గారు అవకాశముకల్పించారు అవి contiguous కాదు ఇక ఆ భాగము నుంచి పైకి పోవటానికి ఏ మార్గముకూడ లేకుండా ఉన్నది.

యింకొకచోటు 74 వ నెంబరు గ్రామమువరకు వచ్చినప్పుడు పుత్తూరు తాలూకాలో అరవవారు కొద్దిమందే ఉన్నారు అలాంటి ప్రదేశములో కేవలం ఒక బేచిరాకు గ్రామం ఉన్నది అది main village కూడ కాదు దానికి అక్కడ contiguity ని కలిగించుకుని సుమారు 3/4 మైలు, 1/2 మైలుకు తక్కువ లేకుండా, contiguity ఉన్నదనే భావముతో పటాస్కర్‌గారు తాము అక్కడి నుంచి నేరుగా పుత్తూరు తాలూకాలో 85 వ నెంబరు గల గ్రామము వరకు పోయి చూచానని తన రిపోర్టులో వ్రాశారు నిజానికి వారు అక్కడికి పోనే లేదు. ఇది శుద్ధ అబద్ధము, అన్యాయము కూడ ఈ అన్యాయము ఎంత ఘోరముగ వున్నదో, ఈ విషయము మీ అందరి దృష్టికి తెస్తున్నాను.

ఇది అన్యాయంలో అన్యాయం అని చెప్పవలసివుంది. ఇది చాలా ఘోరమైన విషయం ఈ మధ్యలో కరించేడు, అరవానవట్టెడ కోళత్తూరు. సామంతవాడ అనే తెలుగు గ్రామాలు తాలూకా సరిహద్దులో వున్నాయి. వాటిని పుత్తూరు తాలూకాలో ఉండనిచ్చుటకు పూనుకోలేదు. అది కూడ పరిశీలించ

వలసిన విషయం పటాస్కర్ వ్రాసిన రిపోర్టులోని policy ప్రకారం చూస్తే యీ గ్రామాలన్నీ అటురావాలి Contiguity విషయంలో న్యాయంకోసం యీనాడు రెండు ప్రభుత్వాలు ఒక surveyor నో ఒక draftsmen నో పంపించి field survey చేయించవచ్చు నా దగ్గర survey అయిన గ్రామాల maps వున్నాయి సర్వేకాని గ్రామాల boundary లున్నాయి, ఆ boundary ల ప్రకారంగా మొట్టమొదట eye-sketch తీసుకుంటారు తరువాత survey జరుగుతుంది ఒక్కొక్క గ్రామంయొక్క విస్తీర్ణం యెంతెంతో, పొడుగు వెడల్పులు ఎంతవున్నాయనే విషయం బాగా, ఖచ్చితంగా తెలుస్తుంది ఆ విధముగా unsurveyed area లను రమారమిగా వేసినారని నేను వ్రాసినాను ఆ విధముగా తెలుగు గ్రామాలను చిన్న size గాను అరవ గ్రామాలను పెద్ద గ్రామాలను ఒక రంగుగా పూసినారు శ్రీ పటాస్కర్ చెప్పిన map లో చూసినట్లయితే "మొత్తం అరవప్రదేశముగానే వుంది తిరుత్తనిలో తెలుగువారుండేటట్లు కనపడ లేదు" అనే భావం ఆయనకు ఏర్పడేటట్లు చేస్తే ఎవరయినా "అదంతా అరవరాష్ట్రానికే పోనీ" అంటారు శ్రీ పటాస్కర్ రిపోర్టుద్వారా 90 వేలమంది తెలుగువారు మదరాసురాష్ట్రంలోకి, 30 వేల అరవవారు మన రాష్ట్రంలోకి పోవలసిన పరిస్థితి ఏర్పడుతుంది మనకు యిచ్చిన గ్రామాలసంగతి చూస్తే చాలా అన్యాయంగా వుంది ఈనాడు తిరుత్తని తాలూకాలో ఉత్తర సరిహద్దున పుత్తూరు తిరుత్తని తాలూకాల మధ్య ఒకనది పశ్చిమ భాగంనుంచి తూర్పు భాగంవరకు పారుతుంది కనీసం ఆ నదినైనా తప్పనిసరిగా స్వాభావిక సరిహద్దుగా తీసుకుని వున్నట్లయితే శ్లాఘనీయంగా వుందని వారిని అభినందించవలసివుండెను అయితే ఆ నదిని ఎందుకు తీసుకోలేదో అర్థంకాలేదు ఆ నదే సరిహద్దుగా వుంటే బాగావుండేది అదికూడ వారికి తోచలేదు ఆ నదికి ఉత్తరముగావుండేగ్రామాలు కొన్ని అరవ రాష్ట్రానికి యిచ్చినట్లయితే పరిపాలనా సౌలభ్యం ఏమాత్రం వుంటుందో అక్కడి ప్రజలయొక్క సౌకర్యం ప్రభుత్వం యేవిధంగా చూడగలుగుతుందో మీరే ఆలోచించండి ఈ విధముగా తప్పుల తడకలుగా తయారైన లెక్కలే లేకుండా పోయినట్లయితే శ్రీ పటాస్కర్ తప్పనిసరిగా తిరుత్తని తాలూకాలో పడమటగా వున్న predominantly Tamil areas ను తూర్పున తిరుత్తని పట్టణంతోసహా predominantly Tamil areas తప్ప మధ్యభాగంలో వుండే భాగాన్ని కాని, ఉత్తర భాగంలోవుండే భాగాన్ని గాని, ఏ పరిస్థితిలోకూడా ఎన్నిసూత్రాలను అనుసరించినాకూడా యివ్వజాలడు. మన ప్రభుత్వంమాత్రం ఆ సరైన maps వారిముందు పెట్టివుంటే ఖచ్చితంగా వారిని ఒప్పింపచేసి వుండును వారు సరైనదని అంగీకరించేవరకూ ఈ సమస్య యిట్లనే వుండి వుండును తప్పులుగా వున్న maps సరిచేయడానికి ఎక్కువ

కాలం పట్టదు, న్యాయమే జరిగి వుండును అట్టి ఘోరమైన సందర్భంలో నేను యింతగా యీ శాసనసభలో మాటలాడవలసిన ప్రమేయము కూడా వుండి వుండదు తరువాత, ఆ రిపోర్టు వచ్చిన తరువాతే అందులో వున్న విషయాలను యీ శాసన సభలో చర్చకు పెట్టినచో సభ్యులు నేరుగా affect అయిన వ్యక్తి అభిప్రాయాలను, ఇతర శాసనసభ్యుల అభిప్రాయాలను తెలిసికొని ఒక ఏర్పాటుకు రావలసివుండెను అది ఎందుకు గాను చేయలేదో ఆశ్చర్యంగా వుంది ఈ సమస్య వారికి తలకాయ నొప్పిగా వుండవచ్చు ఆంధ్ర, మదరాసు ముఖ్య నాయకులతో పరస్పరం అనేక విషముల ఒడుగుబాట్లు చేసుకోడానికి, నీటి సరఫరాకి యీ చిన్న సమస్య అడ్డంగా వుండడం బాగులేదని చెప్పే సందర్భాలు నాకు తెలుసును సంతోషమే అటువంటి పరిష్కారం చేసుకోవడం మంచిదే, మన రెండు రాష్ట్రాల అభివృద్ధికి కృషి చేయడం మంచిదే అయితే కేవలం ఒక వర్గానికి అన్యాయం జరుగకూడదు. ఒకతట్టు పొన్నేరి తిరువళ్ళూరు తాలూకాల లోనివారు, "మేము ఆంధ్రదేశం రాలేము హైదరాబాదు రైలు ఎక్కలేము" అనుకుంటూవుంటే ఆరణియారు స్కీములో 13 గ్రామాలు మనదగ్గర పెట్టి 21 గ్రామాలు వాళ్ళకిచ్చి, వాటికి నీరిచ్చే అవకాశం వుందన్నారు "The Chief Minister of Andhra State will certainly provide water facilities" అని వ్రాసినారు ఆ విధంగా నీరిచ్చేఉద్యోగం పైన వేసుకొన్నపరిస్థితులలో అట్లా తెలుగు వారు రావడం యిట్లా తెలుగువారు పోవడం శోచనీయంగా వుంది. ఈ సందర్భంలో ceusus figures ను 1961 సం॥ లో తయారుచేసే వరకు వేచివుండడం ఉచితం కాదని తోచితే ఇప్పుడు ఉండె maps అయినా సక్రమంగా తయారుచేసి, శ్రీ కామరాజు నాడారు మంత్రివర్గానికికూడా నచ్చచెప్పి, అది శ్రీ పటాస్కర్ గారికిచ్చి, న్యాయంగా తిరిగి వ్రాయమని కోరవచ్చు. అందులో తప్పేమీలేదు మనం ఏమీ దాచిపెట్టడంలేదు కొన్ని క్రొత్తగా తెచ్చిపెట్టిన విషయాలుకావు ఈనాడు survey చేస్తే contiguity లేనప్పుడు, contiguity ఉండాలని principle అయినప్పుడు మనకు నిలువవలసిన భూభాగాలన్నీ కూడా ధారపోసుకోవలసిన ప్రమేయం లేదని నేను ఖచ్చితముగా చెబుతున్నాను. అటువంటి సందర్భంలో మన ప్రభుత్వం తప్పకుండా శ్రద్ధ తీసుకోవాలనేది గమనించాలి ఒక లక్షమంది తెలుగువారు అటుపోతే దిగులు పడవలసిన ప్రమేయంలేదనే భావం వుండవచ్చు. కొంతమంది సభ్యులు నాతో ఆ విధంగా హేళన పూర్వకంగాను, ప్రీతి పూర్వకంగాను చెబుతూంటే నాకు కర్ణకఠోరముగా వుంటుంది మదరాసు యేమీ క్రొత్త కాదు అన్ని సౌకర్యములకు అనువైనచోటు అక్కడ మనభాషకు కావలసిన ప్రోత్సాహము యేమి యిస్తున్నారని అడుగుతున్నాను. ఆంధ్ర ప్రభుత్వం యేర్పడిన తరువాత బెజవాడ మొదలు విశాఖపట్టణము వరకు అరవస్కూళ్ళు

మన ప్రభుత్వంవారు పెడుతున్నారు మదరాసు ప్రభుత్వంవారు ఎన్ని తెలుగు స్కూళ్ళు పెడుతున్నారనేది మనవారు ఎంతమాత్రం ఆలోచించినారు? షోలింఘురు పట్టణంచుట్టు తెలుగువారు, అరవవారు వుంటే అక్కడ యిదివర కున్న తెలుగు section ఆంధ్రరాష్ట్రం వచ్చిన తరువాత తీసివేసినారు దానిని గురించి శాసనసభ్యులము మన ప్రభుత్వానికి వ్రాసుకున్నప్పుడు మన ప్రభుత్వం యేమీ చర్య తీసుకోలేకపోయింది అక్కడ తెలుగువారు తెలుగు చదువు కుందామా అరవము చదువుకుందామా అనే ఆందోళన చెందుతూవుంటే మన ప్రభుత్వం యేమిజేయగలిగింది? మనమేమీచేయలేమని మనకు తెలుసును ఎంత సేపూ "కర్నూలులో అరవలున్నారు కాబట్టి అరవలహైస్కూలు, బెజవాడలో అరవల హైస్కూలు, ఆ అరవల associations పెట్టినాము" అని మనం అన్నప్ప టికి మదరాసు సరిహద్దులలోని తెలుగువారికట్టి సౌకర్యంలేదు అటువంటప్పుడు అక్కడకు పోవడానికి తెలుగువారికి ఎందుకు సంతోషంగా వుంటుందని అడుగు తున్నాను అట్టి సౌకర్యాలుంటే రాష్ట్రవిభజనలో యీ రాష్ట్రంలో వుండినా, ఆ రాష్ట్రంలో వుండినా ఒకటే అక్కడ వుండేదీ కాంగ్రెసు ప్రభుత్వమే, ఇక్కడ వుండేదీ కాంగ్రెసు ప్రభుత్వమే ఇంకొక 15 ఏళ్ళు 20 ఏళ్ళు కాంగ్రెసు ప్రభుత్వం చిరస్థాయిగా వుంటుంది అందుకు సందేహంలేదు కాని protection లేనప్పుడు భీతి అందరికీవుంది మాది తెలుగు సంస్కృతి, మేము ఒక settled life lead చేస్తున్నాం కొందరు రాజకీయ వ్యక్తులు చేసిన ఆందో ళనచేత యీనాడు మాకు స్థానబహిష్కారం జరగడం ఘోరమని చెప్పకతప్పదు Political గా ఏ పరిస్థితిలోనూ మేము ముందుకు రావడానికి అవకాశాలులేవు ఈనాడు పత్రికలలో చదువుతున్నట్టు మద్రాసులో జరుగుతున్న రాజకీయ విజ్ఞానం చూస్తుంటే, అక్కడ ఒక వర్గంమీద వేసే ఆంక్ష యికముందు ఏ పరి స్థితులకు దారితీస్తుందో చెప్పలేకుండా వున్నాము. ఇటువంటిపరిస్థితులలో కూడి నంతవరకు యీ సభ మూలకంగా, అధ్యక్షులవారి మూలకంగా మనవి చేసేదేమి టంటే యిప్పటికయినా మించిపోయినది యేమీలేదు ఇది death sentence వలె తిరుగులేనిదికాదు రెండు రాష్ట్రముల ముఖ్య మంత్రులు informal గా agree అయినారు. మనం కోరేది అన్యాయంకాదు. పునఃపరిశీలనచేసి న్యాయంగా గ్రామ సరిహద్దులు సక్రమంగా, నేను చెప్పినరీతిగా వుండి conti- guity లేదని నిరూపణ అయినప్పుడే ఆ భాగాన్ని అంతవరకు వదిలిపెట్టి మిగతా భాగాన్ని అరవ దేశములో చేర్చడంలో మనకు ఏలాంటి ఆపేక్షణవుండదు, అలా చేసినట్లయితే, యిప్పుడు పటాస్కర్ రిపోర్టు ప్రకారం యిచ్చిన 27 వేల ఆంధ్రులుకాక, 40 వేల ఆంధ్రులు యిక్కడనే ఉండడానికి అవకాశం వుం టుంది. వారి తప్పులెక్కలవల్ల 87 వేలలో 67 వేలమంది ఆంధ్రులు మన

ఆంధ్రదేశములో వుండటానికి అవకాశంలేకుండా పోయింది మోమాటమును 'ప్రిస్టేజి'ని వదులుకొని, లక్షమంది ఆంధ్రుల సౌభాగ్యానికి శ్రద్ధవహించి వారిని ఘోరమైన ఆపత్తునుండి కాపాడటానికి ఈ విషయమును ప్రభుత్వం పునరాలోచించాలని కోరటానికి నేను ఈ అవకాశమును తీసికొన్నాను ఇప్పటికైనా ప్రభుత్వం సానుభూతితో, వారికి న్యాయము కలుగచేసేవిధముగా ముఖ్యమంత్రిగారు గట్టిగా కృషిచేయగలరని ఆశిస్తూ నాకి అవకాశం ఇచ్చినందుకు మీకు నా కృతజ్ఞత తెలియచేస్తూ ఇంతటితో సెలవు తీసికొంటున్నాను

* శ్రీ ఎన్ పి చెంగల్‌రాయనాయుడు అధ్యక్షా, ఈ పటాస్కర్ రిపోర్టు దేనిపై—

* శ్రీ ఎన్. సంజీవరెడ్డి అధ్యక్షా ! వున్న facts ను పది, ఎట్లా, ఎందుకు జరిగిందనే విషయాలు మొదట శ్రీ వెంకటరావుగారు చెబితే తరువాత సభ్యులు చర్చిస్తే బాగా వుంటుందనుకొంటున్నాను ఈ రిపోర్టును మనం ఎందుకు ఒప్పుకోవలసివచ్చింది ? అసలీరిపోర్టు ఎందుకువచ్చింది మొదలైన విషయాలు వెంకటరావుగారు సభ్యులకు తెలియపరుస్తారు దానివల్ల సభ్యులు చర్చించటానికి యింకా ఎక్కువవీలుగా వుంటుందేమో ! మొదట సభ్యులు మాట్లాడినా, మాకు ఏమీ ఆక్షేపణలేదు కాని కేవలం ఇది వారి తృప్తికోసమే పెట్టినట్లుగా వుంటుందేమో !

మిస్టర్ స్పీకర్ ఎక్కువసేపు మాట్లాడతారు, అక్కడనుంచి వచ్చిన వారని చెంగల్‌రాయ నాయుడుగారిని పిలిచాను తరువాత వెంకట్రావుగారిని పిలుస్తాను

శ్రీ ఎన్. పి చెంగల్‌రాయనాయుడు అధ్యక్షా ! ఆంధ్ర మదరాసు సరిహద్దు విషయములో వేటిపై ఆధారపడి శ్రీ పటాస్కర్ ఈ రిపోర్టును వ్రాసినారో మనం తెల్సుకోవలసి యుంది. అద్భుదనాదన్, తయారుచేసిన, మ్యాపులను సెన్సస్ లెక్కలను ఆధారముగా తీసుకొని ఈ తీర్మానమును పటాస్కర్ చేసినారు రెండు రాష్ట్రములకూ సంబంధించనివారిని బైట రాష్ట్రమునుండి ఒక ఉన్నతఉద్యోగిని నియమించిన ఇండియాప్రభుత్వం అద్భుదనాదన్, భీమశంకరంగార్లను వారికి అసిస్టెంట్సుగా నియమించివుంటే ఆంధ్రులకీదుస్థితి ఈనాడు వుండేదికాదు. ఆంధ్రరాష్ట్రం తరఫున అప్పటి ప్రభుత్వం భీమశంకరంగారిని పంపించింది. వీరు అక్కడకువెళ్ళి ఏలాటి ఉత్సాహము చూపక అద్భుదనాదన్ తయారుచేసిన వాటన్నింటిపైన దస్కతు చేశారు.

అర్బుదనాదన్ తయారుచేసిన లెక్కలను శంకించటానికి తప్పని చెప్పటానికి కారణములు వున్నాయి వారు తయారుచేసిన మాప్‌కు వెనకవైపు 'ఇవన్నీ సర్వేకాని ప్రాంతములు, approximate గా నేను ఈmap తయారుచేశాను' అని వారువ్రాశారు మద్రాస్ప్రభుత్వానికి అనుకూలంగాఉండేటట్లు వారువ్రాశారు ఒక అరవ గ్రామానికి, మరొక అరవ గ్రామానికి మధ్య తెలుగు గ్రామముంటే ఆ రెండు అరవ గ్రామములు contiguity గా వున్నవని చూపించుటకు మాపులో పచ్చగీతను పొడిగించారు అరవ గ్రామం చిన్నదిగా వుండి, తెలుగు గ్రామం పెద్దదిగా ఉన్నా map లో తెలుగు గ్రామం చిన్నదిగాను, అరవ గ్రామం పెద్ద దిగా యుండి ఆ తెలుగు గ్రామానికి చుట్టుకొని యున్నట్లు వారు చూపించారు ఇటువంటి అవకతవకలు అనేకం జరిగాయి చిత్తూరు, తిరుత్తిని తాలూకాలు జమిందారీ గ్రామములు అవటంచేత అప్పుడవి సర్వే కాలేదు ఇప్పుడవి సర్వే అయినవి సర్వే అయిన తరువాత ప్రభుత్వం తయారు చేసిన map కు అర్బుదనాదన్ తయారుచేసిన map కు తేడావుంది ఇవి 60 తెలుగు గ్రామాలు చేర్చుకొనటానికి pocket అని చెప్పి, అరవ గ్రామాలకు contiguity చూపించటానికి పొడిగించిన విధమును ఇప్పుడు సర్వే చేసిన తరువాత map తో పోల్చిచూస్తే ఒక గ్రామానికి మరొక గ్రామానికి 20 మైళ్ళ దూరం వున్నది ఈ విధంగా మనకు అన్యాయం జరిగిందని, మన ప్రభుత్వంవారికి తెలుసు ఈ మాపులు తప్పని, రంగులు తప్పని మనప్రభుత్వానికి తెలుసు మన ప్రభుత్వం తరఫున వెళ్ళిన ఉద్యోగి దస్కతు పెట్టాడు కనుక ఇది తప్పని మన ప్రభుత్వం వాదించలేదు మన ఉద్యోగి చేసినది తప్పని చెబితే మన గౌరవము పోతుందనో, మరి యింకో కారణంవల్లనో యదార్థాన్ని మన ప్రభుత్వం బైటపెట్టలేదు

జనాభా లెక్కలుకూడా 1951 సెన్సస్ ప్రకారం క్రొత్తగా books తయారు చేశారు చిత్తూరు జిల్లా కలెక్టరు 1951 సెన్సస్ తీసినవి Central Government కు పంపారు. అప్పటికి ఆంధ్రరాష్ట్రం ఏర్పడి యుండలేదు కాబట్టి చిత్తూరు జిల్లా కలెక్టరు మద్రాసు ప్రభుత్వానికి పంపారు అప్పుడు ఏ ఏ గ్రామాలలో ఎంతమంది తెలుగువారు వున్నారని లెక్కలు పంపారో జిల్లా కలెక్టరు ఆఫీసులో ఒక కాపీ వుంది వారు 51 లో పంపిన లెక్కలకు, అర్బుదనాదన్ తయారుచేసిన లెక్కలకు విపరీతమైన భేదం వుంది ఈ విష యమే హైదరాబాదులో ఒకసారి కళా వెంకటరావుగారికి మనవి చేశాము ఈ మాపులు తప్పుగా వున్నాయి, contiguity కోసం తప్పుగా చూపించారు Contiguity లేనిచోట లెక్కలు తప్పుగా వుందని చెప్పాము. అప్పుడు వారు "ఇది నిజమేనా ?" అని చిత్తూరు జిల్లా కలెక్టరుకు వ్రాశారు ఈ మాపులు, లెక్కలు తప్పుగా వున్నాయా ? అని వ్రాశారు. సెన్సస్ తేడావుందనీ,

మాపులు తప్పుగా వున్నాయని జిల్లా కలెక్టరు ప్రభుత్వానికి వ్రాశారని నేను అనుకొంటున్నాను దాని వివరాలు రెవిన్యూమంత్రిగారే వెల్లడించవలసివుంది ఈ తప్పు వుందని తెలిసినప్పటికి పటాస్కర్ రిపోర్టు వచ్చినపిదప "ఇక్కడ ఇది తప్పుగా వుంది కనుక మేము దీనిని ఒప్పుకోము" అని చెప్పివుండవలసినది

అర్బుదశాదన్ తయారుచేసిన map తప్పు census తప్పు అని ఋజువు చేయడానికి మా దగ్గర సర్వేఅయిన maps ఉన్నాయి అప్పుడు పంపిన maps కలక్టరు ఆఫీసులో ఉన్నాయి ఈ రెండింటిని ఆధారంగా తీసికొని అవి తప్పు అని నిరూపించవచ్చు పటాస్కర్ చాలా గొప్పవారు గౌరవనీయులు, వారు ఈ నాడు గవర్నరుగా ఉన్నారు వారిని గురించి మనం యీ సభలో అట్టే చర్చించరాదు అయినా వారి రిపోర్టును మాత్రం ఖండించకుండా ఉండలేము ఈ రిపోర్టు న్యాయంగా తయారుచేయబడలేదు ఆంధ్రులకు యింత అన్యాయం చేస్తారని ఎవరూ కలలోకూడ అనుకొని ఉండరని మనవి చెస్తున్నాను. 4 సూత్రాల ప్రకారం యీ నిర్ణయాలకు వచ్చినామని వారి రిపోర్టులో చెప్పినారు ఆనాలుగు సూత్రాలు గ్రామాలన్నీ అరవవారికి చుట్టమట్టి యిచ్చేందుకే బాగా పనిచేశాయి కాని ఆ సూత్రాల నుపయోగించే తెలుగువారికి చాలా అన్యాయం చేశాడు ఈ నాలుగు సూత్రాలలో ఒక్కసూత్రం ప్రకారంకూడా ఆయన నడచుకోలేదని నేను మనవి చేస్తాను చిత్తూరు తాలూకాగాని, ఆరుత్తని తాలూకా గాని తీసుకుందాము వీటిలో ఆయన న్యాయంగా ఎక్కడప్రవర్తించారు? Natural boundaries కావాలన్నాడు Natural boundaries ప్రకారం పెద్దపెద్ద కొండలు నదులు ఉండాలన్నారు - కొండలను హద్దులుగా పెట్టుకొని గాని, నదులను హద్దులుగా పెట్టుకొనిగాని ఆయిన యీ నిర్ణయాలు చేయలేదని ఆయన యిచ్చిన రిపోర్టుప్రకారమే నిరూపించడానికి మేము సిద్ధంగా ఉన్నాము Natural boundaries ప్రకారం ఆయన ఏమిచేశాడో maps చూస్తే మంత్రులకు కూడా తెలుస్తుంది పోనీ, ఒకవేళ పొరపాటు జరిగి వుండవచ్చు ఆయనకు యిచ్చిన maps లో నదులు, కొండలు, బాగా చూపించకుండా ఉండవచ్చు లేకపోతే అరవవారి అనుకూలంకోసం, తెలుగువారికి ప్రతికూలంగా ఉండే కొండలు, నదులు చూపించి ఉండవచ్చు కాని యిక్కడ మనకు జరిగిన అన్యాయం మాత్రం స్పష్టంగా తెలుస్తోంది చిత్తూరు తాలూకాలో పొన్ననది ఒకటి వున్నది 1911 లోజిల్లా ఏర్పాటు చేసినప్పుడు North Arcot District పొన్ననదికి సరిహద్దుగా పెట్టారు ఈనాడు ఆ గ్రామాలు పంచియిచ్చేటప్పుడు ఆయన నదిని దాటినాడు నదిదాటి యివతలవైపుకు వచ్చాడు ఇవతలి గ్రామాలన్నీకూడా పంచియిచ్చారు అట్లే తెలుగువారికి అనుకూలంగా వుంటే

ఆ నది అడ్డం అని ఆవైపు గ్రామాలుయివ్వలేదు కాని ఈవైపు గ్రామాలు అరవవారికి యిచ్చేందుకు మాత్రం నది అడ్డంరాలేదు అట్లాగే natural boundaries అయిన పెద్దపెద్ద కొండలుదాటి అక్కడ ఒక చిన్నగ్రామంవుంటే అది అరవవారికి యిచ్చారు అది వారికేమీ సంబంధంలేదు అరవవారు మద్రాసు రాష్ట్రంనుంచి యీ గ్రామం రావాలంటే త్రోవేలేదు Helicopters మీద వస్తారేమో, తెలియదు వారికి యీ గ్రామం ఎట్లాయిచ్చారు? పరిపాలనకు అనుకూలంగా ఉందా అంటే, ఏ మాత్రములేదు

ఇక irrigation facilities గురించి చూడాలి అన్నారు ఇర్రిగేషన్ ఫెసిలీటీస్ ఎక్కడున్నాయి? ఎక్కడైనా ఒక చెరువు ఉండి, దానిక్రింద నీటి పారుదల అయ్యే భూములున్న గ్రామాలన్నీ ఒక ప్రాంతంలోనే ఉండాలనే సూత్రం ఉన్నది పుత్తూరు తాలూకా దగ్గర చెంగల్పట్టు జిల్లా ప్రాంతం యిచ్చాడు అరినియార్ ప్రాజెక్టు ఆంధ్రకు యిచ్చాడు 10 గ్రామాలు మనకు వుంచి, ఆ ప్రాజెక్టు క్రిందనే పారే 20 గ్రామాలు అరవవారికి యిచ్చారు ఇది ఏమి సూత్రం? వారు చెప్పిన సూత్రాలలోకి యిది వస్తుందా? 20 గ్రామాలు వారికిచ్చేశాడు దానిక్రింద నీరువచ్చే కట్టలు మరమ్మతు చేయాలి పైనవుండే తెలుగు గ్రామాలకు నీరుపారకుండా అసౌకర్యం కలిగించకుండా నీరంతా మనంతెచ్చి క్రింది 20 గ్రామాలకు పారించాలి ఇది వారుచేసిన తీర్మానం ఎక్కడనో, కాదు, నా నియోజకవర్గమైన వేపంజరిలోని కొన్ని గ్రామాలు యిట్లానే చేశారు Natural boundary అయిన నది ఉన్నది నది దాటివెళ్ళి వారికి గ్రామం యిచ్చాడు యల్లావల్లి గ్రామంలో ఒక చెరువు ఉన్నది దానివల్ల యల్లావల్లిలోని భూములే కాకుండా, ఆ క్రింద ఉండే గోళ్ళవిరివల్లె, ఆవుల రంగయ్య పల్లెలకు గూడా నీరు పారాలె అయితే ఆ రెండు గ్రామాలూ అరవవారికి యిచ్చేశారు చెరువుమాత్రం యిక్కడ ఉన్నది పారుదల మాత్రం అక్కడకు పోయివుంటే ఆ చెరువునైనా transfer చేయవచ్చు పారుదలకూడా కొంత ఆంధ్రలో ఉంటున్నది ఒక గ్రామానికి సంబంధించిన పారుదల మాత్రం ఆంధ్రలో నిలిచిపోయింది రెండు గ్రామాలకు సంబంధించిన పారుదల మాత్రం అరవారికి యిచ్చేశాడు చెరువు ఆంధ్రలోనే ఉన్నది, వారిగతి ఏమి కావాలి? రేపు అక్కడవుండే రైతులంతా చెరువుక్రింద మొట్టమొదటి వారము మేము కాబట్టి, నీరు పారించ కుండా ఈ రెండు గ్రామాల తెలుగువారు యిప్పుడు అక్కడకు పోయారు, వారు ఏమి కావాలని అడుగుతున్నాను ఈ రెండు గ్రామాలలో అరవవారు మెజారిటీగా ఉన్నారా? అక్కడ 1% మెజారిటీ ఉంటేకూడా అరవవారికి యిచ్చేస్తున్నారు. ఇదేమి

న్యాయమో నాకు అర్థమే కాలేదు 51 మంది అరవవారుంటే 49 మంది తెలుగువారుంటే అది 51మంది ఉన్న అరవవారికే పోతుంది వచ్చే సంవత్సరం మనవారు ఉత్సాహం చూపిస్తే మనం 55 కావచ్చు (నవ్వులు) వారు 45 కావచ్చు, అప్పుడు మళ్ళా మారే పరిస్థితిపుంటే యీ తీర్మానానికి ఒప్పుకోవచ్చు ఇది ఎట్లా న్యాయమో నాకర్థంకాలేదు నూటికి 70 వంతులపైన ఉంటేనే ఏదైనా ఒక ప్రాంతం యింకొక ప్రాంతానికి మార్చాలని Boundary committee చెప్పింది సేలం జిల్లాలో 51 కంటే అధికంగావుంటే మనం తీసుకోవచ్చు ఒక సూత్రప్రకారం ఎక్కడైనా ఒక తీర్మానంచేస్తే అది అన్ని ప్రాంతాలలోనూ, అన్ని జిల్లాలలోనూ వర్తింప చేయాలి ఆ సూత్ర ప్రకారం చేయడం లేదు 70 లేకపోయినా, కనీసం 65గాని, 60గాని ఉంటే అట్లా చేయటం మంచిదేమోఅంటే అట్లాకూడా చేయలేదు 'Predominantly Tamil Speaking' అనే పదాలు ఆయన రిపోర్టులో అనేక పర్యాయాలు వాడినారు Predominantly Tamil Speaking అంటే ఏమిటి ? అక్కడనే తాతలతరాల నుంచిఉండి, అక్కడనే భూములు సంపాదించుకుని తరతరాలనుంచి ఉండె వారి ప్రాంతాలను predominantly Tamil speaking areaఅంటే సరిపోయేదని నేను మన ప్రభుత్వానికి, ఢిల్లీ ప్రభుత్వానికి మనవి చేస్తున్నాను "మీరు రండి, లేక ఎవరికైనా పంపండి Predominantly Tamil Speaking area ఎక్కడ ఉన్నదో పరిశీలించండి" 6, 7 సం ల క్రిందట 1948, 49 సం లలో కరువు వచ్చినప్పుడు కొన్ని వందల కుటుంబాలువచ్చి తిరుత్తని, చిత్తూరు తాలూకాలలో settle అయినారు అప్పుడు North Arcot District లో కరువు అధికంగా ఉన్నది ఆ రోజులలో చిత్తూరుజిల్లాకూడా కరువు పరిస్థితిలోనే ఉన్నది. అయినా దూరపు కొండలు నునుపులన్నట్లు ఇక్కడ పనిదొరుకుతుందేమోనని వచ్చారు అప్పుడు చిత్తూరుజిల్లాలో కరువు పనులు ప్రారంభించాము North Arcot District నుంచి అనేకమంది అరవవారువచ్చి యిక్కడ కూలినాలీ పనులు చేసుకుంటూ ఉన్నారు. అక్కడకంటె యిక్కడ కొంచెం ధాన్యందొరుకుతుందని అనేకమంది వచ్చి settle అయినారు 1951 సం లో వీరందరూ అరవజనాభ లెక్కల లోనికి ఎక్కినారు. అంతమాత్రాన 1, 2 సం ల లోనే అవి predominantly Tamil speaking area అయిపోయిందా ! 1950 లో మా జిల్లా కలెక్టరు తయారుచేసిన లెక్కలలో తేడాలుండడానికి కూడా కారణం యిదే అప్పుదనాదన్ తయారుచేసిన లెక్కలకూ, మా కలెక్టరు తయారుచేసిన లెక్కలకు తేడాలున్నాయి. Famine days లో వారుయిచ్చినదే యీ తేడాలుండడానికి కారణం.

ఇక, చిత్తూరు తాలూకాలోని కొన్ని ప్రాంతాలసంగతి చూద్దాము తమిళులు గాని, తెలుగువారు గాని మెజారిటీగా లేకుండావుంటే అది ఎక్కడ ఉందో అక్కడనే ఉంచేస్తామని ఒక నిర్ణయానికి వచ్చారు అయితే, చిత్తూరు తాలూకాలో 49½% అరవవారు, 49½% తెలుగువారు వుండే ఆ గ్రామము మాత్రం అరవవారికి ఇచ్చేయాలన్నారు ఇదిఏమి సూత్రమో, ఎలా న్యాయమో నాకు అర్థంకాలేదు తెలుగు గ్రామాలను pocket చేసి అరవవారికిచ్చేటప్పుడు చూపించిన కారణం ఇవి ఇక్కడ ఎక్కువగా అడవి ప్రాంతాలున్నాయి ఈ అడవిప్రాంతమంతాకలిపి వారికిచ్చేయవచ్చు ఈ అడవి తెలుగు గ్రామాలకూ అరవ గ్రామాలకూ అడ్డంవస్తుంది ఆవైపు అరవగ్రామానికి సంబంధించిన అడవిని అరవవారికి యిచ్చేస్తామన్నారు

అదేమి న్యాయం ? చిత్తూరు తాలూకాలో అరవలకిచ్చిన ప్రాంతంలో ఎనిమిది గ్రామాలు ఉన్నాయి ఈ ఎనిమిది గ్రామాలలో కూడా అరవవారి మెజారిటీ పెద్దగాలేదు ఏ కొద్ది మెజారిటీయో ఉంటే North Arcot borderకు గుడియాత్తం తాలూకాకు ఏ 7, 8 మైళ్ళదూరమో ఉంటే దానిని అడవిగా map లో చూపించి, దానిని contiguity గా చూపించి అడవినిదాటి, ఆ border లో లేకున్నా ఆ 8 గ్రామాలను అన్యాయంగా అక్రమంగా మద్రాసు రాష్ట్రంలో కలిపేశారు చెప్పవలసినటువంటివి అలాంటి అన్యాయాలు అనేకం ఉన్నాయి అయినా అటువంటిది కొన్ని ఉదాహరణగా మీకు మనవి చేస్తాను ముఖ్యంగా పటాస్కర్ గారు ఏ సూత్రాన్నీ అనుసరించలేదు అని చెప్పేందుకే ఇవన్నీ మనవి చేస్తున్నాను తిరుత్తణి విషయంలో గోపాలరెడ్డిగారు ఇంతకుముందే వివరంగా చెప్పినారు హోసూరు తాలూకా విషయంకూడా యిప్పుడు చెప్పాలి ఏమంటే మనం మద్రాస్ రాష్ట్రానికి, ఆంధ్రరాష్ట్రానికి సంబంధించిన boundary విషయాలన్నిటిని చర్చించాలి కాబట్టి ఇపుడు హోసూరు విషయం విడిచిపెట్టడానికి వీలులేదు. మొట్టమొదట మన మంత్రులు మద్రాసు ప్రభుత్వంతో సంప్రదింపులు జరిపినపుడు వారు హోసూరు విషయం మాట్లాడేందుకు వీలులేదంటే, హోసూరు లేకుంటేమాత్రం చర్చలలోనే దిగం, హోసూరు ఉంటేనే చర్చలలో దిగుతాం; అని వచ్చేశారు. మరల హోసూరును కూడా చర్చించేందుకు ఒప్పుకున్న తరువాతనే, హోసూరు విషయంకూడా పటాస్కర్ గారు తీర్మానంచేసే condition మీదనే మన ప్రభుత్వంవారు, పటాస్కర్ గారు మధ్యవర్తిత్వం వహించడానికి ఒప్పుకున్నారు కలకత్తాలో A. I C C Session జరుగుతూండగా, ముందే అరవ మంత్రులంతా కూడా Home Minister తో పటాస్కర్ గారిని ఈ విషయమై తీర్మానం చేయటానికి పంపమని చెప్పుకొని, వారితతంగమంతా జరిపించుకొని, శ్రీ సంజీవరెడ్డిగారిని, శ్రీ కళా వెంకట

రావుగారిని, "Home Minister గారు మిమ్ములను రమ్మంటున్నారని" అరవమంత్రులు పిలిచారు అక్కడికి పిలుచుకుపోయి ఏమీ మాట్లాడకుండా, పటాస్కర్‌గారి సమక్షంలో "మేము పటాస్కర్‌గారిని ఈ ఆంధ్ర మద్రాస్ రాష్ట్రాల సరిహద్దు విషయంలో తీర్మానం చేయడానికి కోర్తాము, మీరు ఒప్పుకోవాలి" అని అన్నారు ఆ పటాస్కర్‌గారిని ముందర పెట్టుకొని, ఆయనను నియమించడానికి ఒప్పుకోవాలంటె మన మంత్రులు ఒప్పుకోవలసిన పరిస్థితి ఏర్పడింది ముందుగా "మేము పటాస్కర్‌గారిని ఈ విధంగా నియమించ బోతామని" చెప్పిఉంటే మనవారు వద్దనిఉండేవారేమో నాకు తెలియదు ఆదినం నేను చూచినదానినిబట్టి పటాస్కర్‌గారిని ముందరపెట్టుకొని, ఒప్పుకోవాలంటే వీరు ఒప్పుకున్నారని నేను అనుకుంటున్నాను హోసూరు విషయంలో నేను ఒకవిషయం మాత్రం మనవిచేస్తాను మన ప్రభుత్వంవారు మద్రాస్‌లో మంతనాలు జరిపేటపుడు మద్రాస్ ప్రభుత్వంవారు, మన ప్రభుత్వంవారు కొన్ని షరతులు పెట్టుకున్నారు అపుడు "51 percent తెలుగువారి majority ఉన్న తెలుగుగ్రామాలను మాకు ఉండనీయండి, అట్లాగే 51% అరవవారి majority ఉన్న అరవగ్రామాలను మీకు యిస్తాము అని మనవారు షరతుపెట్టారు" అరవ తెలుగుభాషల వారిద్దరి majority లేకుండా మూడు యితరభాషలుండే ప్రాంతమున్న తావు అయితే "to illustrate the point If, in x village, the population is 40% Telugu, 30% Tamil and 30% other languages, the village should go to Andhra and this would apply vice versa also" అని మనవారు చెప్పారు ఈసూత్రప్రకారమే హోసూర్‌లో మూడుభాషలుండినా అచట అరవవారు ఉండవచ్చు కన్నడిగులు ఉండవచ్చు తెలుగువారు ఉండవచ్చు కాని ఈ border dispute ఆంధ్ర మద్రాస్ రాష్ట్రములకు సంబంధించినది మాత్రమేకాని, యిందులో మైసూరుప్రమేయం ఏమీలేదు మైసూరు మంత్రులసంగతికాని మైసూరు ప్రభుత్వంవారి సంగతికాని మనం ఆలోచించవలసిన పనిలేదు మూడు భాషలు ఒక గ్రామంలో simple majority 40, 45 per cent తెలుగువారుండి 25 per cent కన్నడిగులు ఉండి, యింకా 15 per cent అరవవారు ఉంటే ఆయిన అచట మూడు భాషలు వున్నాయి, తెలుగువారి majority 51 per cent లేదు" అని అన్నారు మూడుభాషలుండే ఒక ప్రాంతంలో 51 per cent ఎలా ఉంటారు? అలాగ ఉండేందుకు వీలు లేదు అటువంటిచోట్ల single majority చూడాలి ఎవరికి single majority అనే విషయం చూచి ఆ simple majority ప్రకారం నిర్ణయించాలి ఈ సూత్రాన్ని అవలంభించి నిర్ణయించాలని కోరినాము. ఈ సూత్రం ప్రకారం కృష్ణగిరి తాలూకాలో కాని, అరవవారికి హోసూరు తాలూకాలో కాని ఏ ప్రాంతం పోయేదానికి వీలులేదు. Contiguity లేదన్నారు మొట్ట

మొదట ఆయన, "యివి మూడు భాషలకు సంబంధించిన తాలూకాలు, కాబట్టి నేను వీటిని తీర్మానమే చేయన"న్నాడు మరల రెండవతూరి మన ప్రభుత్వం కోరినపుడు తీర్మానం చేస్తానన్నాడు. తీర్మానం చేస్తూ ఈ 50 percent కంటే majority ఉండే మూడు గ్రామాలను మాత్రం మనకు చేర్చినాడు మిగతా గ్రామాలన్నిటిలోను single majority ఉంది Contiguity ఉంది వేపంజేరి ఫిర్కాను తీసుకుందాము వారు మొట్టమొదట వేపంజేరి ఫిర్కాకు, కుప్పం సబ్ తాలూకాకు సంబంధమేలేదు, కొండలు అడ్డం ఉన్నాయి, అని చెప్పారు మన మంత్రులందరికీ మీరు వేరుగా అచటకి వచ్చి చూడండి అని నేను మనవి చేస్తున్నాను అచట ఎన్ని వేల అడుగుల ఎత్తుగల కొండలెన్నున్నాయి మృగాలుండే, ఏనుగులుండె, లేకుంటే పెద్దపెద్దవృక్షాలుండే, పెద్దపెద్దమానులుండే అడవులు ఎన్నున్నాయి? అక్కడ మూడు అడుగుల ఎత్తు ఉండేచెట్లు లేవు. అది అడివా! 10 అడుగుల 15 అడుగులపైన ఎత్తుఉండే మిట్టలులేవు, అవి బ్రహ్మాండమైనకొండలా! Boundaries కు అడ్డం వచ్చినాయట! ఇది వారు maps లో ఈ విధంగా చూపించి చేసిన మోసం, అవినీతి పనులు, అని నేను అంటాను అక్కడేమీ కొండలూ లేవు, అడవులూ లేవు, అయినా map లో మాత్రం అడవులూ కొండలు చూపించారు కుప్పంనుంచి వేపనపల్లికి నేరుగా జిల్లాబోర్డు రోడ్డు వేయబడి ఉన్నది రహదారి చాలా సక్రమంగా ఉన్నది. బండ్లు వస్తూపోతూ ఉంటాయి map లో ఈ రహదారీ సౌకర్యములు లేనట్లు చూపించారు అక్కడ జరిగిన అన్యాయం యిది ఎవరూ అడిగేవారు లేరు అసలు ఇపుడు మనకు హోసూరునుంచి వేపనపల్లి మీదుగా trunk road ఉన్నది Trunk road కు ఒక వైపున తెలుగు గ్రామాలున్నాయి, వాటిలో తెలుగువారి majority యే ఉన్నది ఒకవేళ 51 per cent కంటె అధికంగా లేకుంటే లేకుండవచ్చు కాని ఈ గ్రామాలన్నిటిలో single majority ఉంది హోసూరు తాలూకా మొత్తం మనకు వచ్చేందుకు contiguity ఉంది అది 20 మైళ్ళ వెడల్పు 8 మైళ్ళు పొడుగు గలిగి ఉందని మనవి చేస్తున్నాను ఇటువంటి న్యాయమైన విషయాన్ని అన్యాయంగా పటాస్కర్ గారు తీర్మానంచేశారు పటాస్కర్ ఏ సూత్రము ననుసరించి ఈ విధంగా చేయలేదు కాబట్టి ఈ report ను మన ప్రభుత్వం ఒప్పుకోకూడదు ఒప్పుకోకుండా scrape చేయాలని మనవి చేస్తున్నాను ఈ పటాస్కర్ గారికంటే మన మంత్రులు మద్రాస్ రాష్ట్రమంత్రులతో ఈ విషయాలు చర్చించుకొంటే బాగుండేటట్లు వున్నది. మనం మళ్ళీ ఈ question reopen చేయాలి. Census figures లో తప్పులున్నాయి, maps లో తప్పులున్నాయి, Hosur తాలూకాలో simple majority చూడవలసి ఉన్నది; కాబట్టి ఈ మూడు విషయాలు మనస్సులో

పెట్టుకొని, కొత్త maps తయారు చేయించి, మనం మన మనిషిని, వాళ్ళు వాళ్ళ మనిషిని పెట్టుకుందాము లేకపోతే కేంద్ర ప్రభుత్వంవారు, వారి యిష్టంవచ్చిన ఉన్నత న్యాయవాదిని నియమించి ఆయన అజ్ఞాయిషీక్రింద ఈ కొత్త maps ను survey చేయించి, ఆ ప్రకారం collectors కు పంపించి, నిజమైన census ప్రకారం న్యాయంగా తీర్మానం చేయనివ్వండి అరవల majority ఉంటే అరవ గ్రామాలను మనం నిలుపుకోవాలని లేదు అది మనకు వద్దు మన తెలుగుగ్రామం ఒక్కటికూడా పోకుండా చూడాలని నేను మనవి చేస్తున్నాను బయటి రాష్ట్రాలలో ఉండే తెలుగువారు వారికి ఆస్థినిమ్మని, ఉద్యోగా లివ్వమని కోరడంలేదు "తెలుగువారమై పుట్టినందుకు, తెలుగు రాష్ట్రంలో ఉండేందుకు సౌకర్యం కల్గించమని, మమ్మల్ని కూడా మీలో చేర్చు కోండి" అని వారు కోరుతున్నారు కనీసం ఇందుకొరకైనా మన ప్రభుత్వం ఒప్పుకుంటుందని ఆశిస్తున్నాను

*శ్రీ కె. వెంకటరావు అధ్యక్షా, శ్రీ చంగల్రాయనాయుడుగారు ఆఖరున చెప్పినటువంటి విషయము సాధ్యమైతే నాకంటే సంతోషించేటటువంటి తెలుగువాడు ఉండడు కాని దురదృష్టవశాత్తు భరతఖ్యాతలియందు రెండవది అయినటువంటి ఆంధ్రభాష మాట్లాడేవారు చాలావిపులంగా దేశములో అనేక ప్రదేశాలలో ఉండడంవలన, ఒకచోటనే ఉండకపోవడంవలన సుమారు 50లక్షల మంది ఆంధ్రులు ఈనాడు అంధ్రప్రదేశంలో కాక ఇతరచోట్ల ఉండవలసిన అవశ్యకత ఏర్పడింది ఆ విధంగా ఉన్నవారిలో చాలా హెచ్చుమందిని మన రాష్ట్రసరిహద్దులలోనికి తీసుకొనిరావడం అసంభవమయిన విషయం కనుక ఎంత ఉత్సాహం ఉన్నా ఎవరికి ఎంతకోరిక ఉన్నా అది సాధ్యపడదని మనము ఒప్పుకోక తప్పదు అది మన అదృష్టమనుకొంటాను. పూర్వము మనదేశాన్ని పరిపాలించిన రాజులు తమ భుజశక్తిచేత విజ్ఞానంచేత కన్యాకుమారి మొదలుకొని పాటలీపుత్రం దాకా అప్పుడప్పుడు పరిపాలించారు వెళ్ళినచోట్ల కొంతమంది తెలుగువారిని వదలిపెట్టివచ్చారు అందువలన చాలా విస్తృతమయినటువంటి మన జనాభా భారతదేశములో ఉన్నది. ఈనాడు 14 రాష్ట్రాలక్రింద మన దేశాన్ని విభజించినాకూడా భాషకనుక లెక్కకు తీసుకున్నట్లయితే హిందీ భాష తరువాత ఎక్కువమంది మాట్లాడేభాష తెలుగు అని అందరకు తెలిసినటువంటి విషయమే కాని నేను చెప్పిన కారణంచేత విస్తృతమయిన జనాభా కలిగినటువంటి తెలుగుభాష మాట్లాడే వారినందరిని మన రాష్ట్రములోనికి తీసుకొనిరావటానికి కొంతవరకు కృషి జరిగినా అందరినీ ఎప్పటికి తీసుకొని వచ్చేటటువంటి పరిస్థితులు మాత్రం లేవు. అందుచేత మనకు ఎంత ప్రేమవున్నా వారికి మనతో కలవాలని ఎంత ఉత్సాహం ఉన్నా, సాధ్యపడేటటువంటి విష

యము కాదని మనము గుర్తించుకోక తప్పదు, ఆంధ్రరాష్ట్రం ఏర్పడిన తరువాత 1954 లో యస్ ఆర్ సి ని దేశంలోని రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ నిమిత్తం ఏర్పాటుచేశారు నేను అప్పుడు మంత్రిని కాను రాష్ట్ర కాంగ్రెసు సంఘ సభ్యుడను నన్ను చంగల్రాయనాయుడుగారినీ, మరికొంతమందినీ రాష్ట్ర దక్షిణ సరిహద్దుకోసం, ఇంకా కొంతమంది స్నేహితులను ఉత్తర సరిహద్దు కోసం— ఈ రెండు ఉపసంఘాలకు ఛైర్మన్‌గా నన్ను వేసి నివేదిక తయారు చేయవలసిందని చెప్పారు వారియొక్క ఉత్తరువు ప్రకారం మద్రాసుమొదలు బళ్ళారిదాకా ఉన్నటువంటి ప్రాంతాన్ని అంతాకూడా నేను ఇప్పుడు శ్రీ చంగల్రాయనాయుడుగారు చెప్పినటువంటి ప్రాంతాలన్నిటితోసహా స్వయముగా వెళ్ళిచూచాను ఆ ప్రాంతాలకు జీప్‌లో వెళ్ళడం తటస్థించింది చంగల్రాయ నాయుడుగారు కారు ఇస్తారేమోనని అనుకున్నానుగాని, అపుడు వేరే పని ఉండడంవలన ఆయనకూడ మాతో రావడము జరుగలేదు ఆ ట్రిప్‌లో యీ హౌస్‌లో ఉన్న ఇతర గౌ సభ్యులతోకూడా పర్యటన చేయడం తటస్థించింది అందుచేత మేము ఆప్రాంతాన్ని చూడలేదనేది న్యాయమైన విషయం కాదు

శ్రీ ఎన్. పి చెంగల్రాయ నాయుడు మంత్రులు చూడవలెనని కాదు నేను చెప్పినది తీర్మానంచేసేవారు కూడా చూడాలి

శ్రీ కె. వెంకటరావు ఇదంతా వారు చూడడం ఎప్పుడూ సాధ్యం కాదు. తుదితీర్మానంచేసేది అసెంబ్లీ పైనుంచి వచ్చేటటువంటివారు ఈరకంగా చూడడం సాధ్యంకాదు బౌండరీ కమిషన్ ఐతే ఎలాచేస్తారో నాకు తెలియదు మనకు ఆ అనుభవంలేదు మనం ఒకరి జడ్జిమెంటును ఒప్పుకుంటామని చెప్పాం పంచాయితీని ఏర్పాటు చేసుకుంటామని చెప్పాము పంచాయితీ చెప్పేవారు వివాదప్రాంతంలోని ప్రతి అంగుళాన్ని చూచివచ్చి జడ్జిమెంటు చెప్పడం సాధ్యమైన విషయం కాదు యీ సందర్భంలో మనము ఒక విషయం జ్ఞప్తియందుంచుకోవాలి య్యస్ ఆర్ కమిషన్ వచ్చినప్పుడు మనము ఒక రిపోర్టు ఇచ్చాము. అన్ని రాజకీయపార్టీలవారు కూడా ఇచ్చారు ఆ మెమొరాండంలో కొన్ని నిర్ణయాలను ఏకగ్రీవమైనటువంటిఅభిప్రాయంతో ఇవ్వడం తటస్థించింది. అయితే వారు "యీ విషయమై తీర్పు చెప్పదలచుకోలేదు నేను ఆంధ్ర, మద్రాస్ పరిహద్దులను గురించే మాట్లాడుతున్నాను. దానిని గురించి వేరే నిర్ణయం చెప్పదలచుకోలేదు, మీలో మీరే సంప్రదించుకొనుట మంచిది" అని ప్రకటించారు. ఆంధ్రరాష్ట్రం ఏర్పడేటప్పుడు. ఆంధ్రరాష్ట్రం ఏర్పడటానికి కొన్ని సంవత్సరాలు ముందరే యీ విషయానికి సంబంధించిన చర్చలన్నిటి

లోను కూడా మనయొక్క కేసు తెలియచేశాము మొట్టమొదట ఆంధ్రరాష్ట్రం ఇవ్వాలనే నిర్ణయం 1949 లో జరుగుతుందని అనుకొన్నాము. అప్పుడు దరి దాపులకు వచ్చినదనుకొన్నది చేతులనుంచిదాటిపోయింది మళ్ళీ ఆ వరుసవరుస 2, 3 సంవత్సరాలవరకు ఊరుకోవడం తటస్థించింది 1953 లో శ్రీ పొట్టి శ్రీరాములుగారు చేసినటువంటి అఖండ త్యాగమువల్ల అంతక్రితమే ఆలోచింప బడుతున్న యీ సమస్యకు తీవ్రత వచ్చి ఆ రోజులలో అనుకొన్నదానికన్న తొందరగా మనకు ఆంధ్రరాష్ట్రం వచ్చింది ఆ సందర్భంలో శ్రీ వాంఛూ రాజస్థాన్ ఛీఫ్ జస్టీస్‌గారిని, ఇక్కడకు పంపించారు అప్పుడు మేము అందరం కలిసి మనయొక్క కోరికలను వారికి వెల్లడిస్తూ ఒక మెమొరాండంనుఇచ్చాము. దానిని అనుసరించి ఆంధ్రరాష్ట్రం వచ్చింది 1949 లోను, 1953 లోనూ మనము వాంఛూగారికి చెప్పినప్పుడు ఒక పునాదిసిద్ధాంతాన్ని అంగీకరించడంవల్ల ఆనాడు తెలుగు జిల్లాలని మొత్తంమీద పరిగణింపబడుతూ ఉండేటటువంటి జిల్లాలతో ఆంధ్రరాష్ట్రం ఏర్పాటుచేయాలని మనకు, మద్రాస్‌వారికి ఉన్న సరిహద్దులను తరువాత పరిష్కారంచేసుకోవాలనీ, మన రాష్ట్రంయొక్క ఏర్పాటు విలంబనం చేయకూడదు అనేటటువంటి నిర్ణయాన్ని ఇండియా గవర్నమెంటువారు చెప్ప డంవల్ల ఆరకంగా అప్పుడు సంపూర్ణమైనటువంటిది కాకపోయినా- ఆంధ్ర రాష్ట్రం ఏర్పడడం తటస్థించినది సరిహద్దులను గురించిన చర్చ వచ్చినపుడు దానికై ఎట్టి కృషిచేశామో ఆలోచించుకోవలసి ఉన్నది ఈ పరిస్థితులలో ఉండగా యస్. ఆర్ సి రిపోర్టు రావడం, దానిప్రకారం ఆంధ్రప్రదేశ్ ఏర్పడడం అలాగే ఇండియాఅంతా 14 రాష్ట్రాల క్రింద ఏర్పడడం జరిగింది

మనకు తెలిసినంతవరకు ఇటువంటి సరిహద్దు తగాదాలు 564 ఉన్నాయి ఒక గ్రామం గురించి కానివ్వండి, ఒక బోర్డర్ గురించి కానివ్వండి, మొత్తం మీద 564 ఉన్నాయి యీ 564 సమస్యలను తక్షణమే పరిష్కారంచేయడానికి ఒకటిని, అంతగాకన్నా ఎక్కువగాని బౌండరీ కమిషన్‌లను వేస్తే దానివల్ల వచ్చే అల్లకల్లోలాలు చాలా తీవ్రతరం అవుతాయని ప్రభుత్వంవారు కొంత కాలం వరకు యీ సమస్యలను అలాగే అట్టేపెట్టి తరువాత నెమ్మదిమీద సర్దు బాటు చేసుకోవచ్చుననే అభిప్రాయంతో ఒక నిర్ణయానికి వచ్చారు అప్పటికి కర్నూలులో ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వం ఏర్పడడం తటస్థించింది ఆంధ్ర ప్రదేశ్ వస్తుందనే ఆసక్తికలిగినప్పుడు యీ సరిహద్దులను అన్నిటినీ కూడా తరువాత నిర్ణయించుకుందామని అనుకున్నాము. మన రాష్ట్రానికి తూర్పున బంగాళా ఖాతం ఉన్నది మిగతా మూడు వైపుల ఏర్పడిన ఇతర రాష్ట్రాలలో ఉన్నటువంటి సరిహద్దుల సమస్యలు ఒకే పర్యాయం పరిష్కరించుకోవాలని ఒక మద్రాసు, ఆంధ్ర సరిహద్దులను మాత్రమే ఇపుడు తేల్చుకోనక్కరలేదని

ఢిల్లీకి మేము తెలియపరిచాము కాని 1949లో వాంఛూగారి దగ్గర ఒప్పుకున్న విషయం ఒకటి ఉన్నది మద్రాస్-ఆంధ్ర బోర్డర్ విషయమై సమగ్రమైన పరిష్కారం చేసుకుంటామనే మాట చెప్పడం వల్ల ఆ మాటను పట్టుకొని తమిళ ప్రభుత్వంవారు ఢిల్లీమీద చాలా ఒత్తిడితీసుకొనివచ్చారు ఢిల్లీప్రభుత్వంవారు మేము బౌండరీ కమిషన్ వేయం, మీరే ఒక పెద్దమనిషి ద్వారా దానిని పరిష్కారం చేసుకోవలసినది, లేకపోతే మీలో మీరే పరిష్కారం చేసుకొనవలసినదని చెప్పారు దానిప్రకారం మద్రాస్‌లో తమిళమంత్రులు, ఆంధ్ర రాష్ట్రమంత్రులు కలసి సంప్రతింపులు జరిపారు రెండు రోజులు సంప్రదింపులు జరిగిన తరువాత అవి విఫలమయ్యాయి దానికి ప్రధానమైనటువంటి కారణములు ఏవో నా మిత్రులు చెప్పారు మద్రాసు మంత్రులు చిత్తూరు-చెంగల్పట్టు జిల్లాల మధ్య ఉన్నటువంటి సరిహద్దులు పరిష్కారంచేసుకుందామే కాని సేలమ్-చిత్తూరు జిల్లాలకు సరిహద్దులో ఉన్నటువంటి ప్రాంతాల విషయం మేము అసలు మాట్లాడడానికి వీలులేదని చెప్పడంవల్ల, దానిని మనం అంగీకరించకపోవడంవల్ల ఆ సంప్రతింపులు విఫలమయ్యాయి అంతేకాకుండా ఏ ప్రాంతములోనైనా ఒక భాషవారు 51 శాతము లేనప్పుడు హెచ్చుగా ఏభాషకు ప్రాముఖ్యత ఉన్నదో వారికి ఆ ప్రాంతం సంక్రమించాలనేటటువంటి విషయంకూడా మేము అప్పుడు గట్టిగా చెప్పడం తటస్థించింది యీ సందర్భంలో ఇరువురి మధ్యా అగ్రిమెంటు కుదరకపోవడంవల్ల తిరిగి ఢిల్లీకి వెళ్లటం తటస్థించినది దీనిపైన చాలా పర్యాయాలు చర్చ జరిగింది ఒకమాటుకాదు పదిమాట్లు ఇటు అటూ తిరగడం తటస్థించింది ఢిల్లీకి వెళ్ళినప్పుడల్లా ఏ పనిమీద వెళ్ళినా - యీ విషయమే వారు చెబుతూ ఉండడం, మేము చెబుతూ ఉండడం జరిగింది ఆఖరికి ఒకసారి కలకత్తాలో కలుసుకున్నప్పుడు వారు, మేము అందరం ఉండగా - ఎవరినైనా ఆర్బిట్రేటరునుఒప్పుకోమని ఢిల్లీప్రభుత్వం సూచనచేసింది ఎవరినైనా పెద్ద మనిషిని సూచిస్తే వారు ఇదంతా విచారణచేసి మామధ్య సామరస్యం తీసుకొని వస్తారనే విషయం అంగీకరించాము ఆ సందర్భంలో శ్రీ పటాస్కర్ గారి పేరు వచ్చింది మేము ఎరిగి ఉన్నంతవరకు పటాస్కర్ గారు చాలా పెద్ద మనిషి పటాస్కర్ గారికి యీ సమస్యలతో చాలా పరిచయం ఉన్నది 1946 వ సంవత్సరంలో కాన్‌స్టిట్యుయంట్ అసెంబ్లీ డిశంబరు 8 వ తారీఖున సమావేశం అయినప్పుడు ఆల్ ఇండియా కాంగ్రెసు ఫెడరేషన్ అనే ఒక పెద్ద మీటింగు జరిగింది అధ్యక్షా. మీరుకూడా అక్కడ ఉన్నారు. ఆ వేళ ఏర్పడినటువంటి కమిటీకి నన్ను కన్వీనర్ గా వేసుకొన్నారు. శ్రీ పటాస్కర్ గారు అప్పుడు స్టీరింగ్ కమిటీలో అసలు భాషాప్రయుక్తరాష్ట్రాలతో కూడుకొన్నటువంటి కాన్‌స్టిట్యూషన్‌ను తీసుకొనిరావటానికి చాలా కృషి చేసినటువంటి వ్యక్తి

లలో ఒకరు అందుచేత యీ సమస్య వారికి తెలుసును అనేటువంటి అభిప్రాయం కలిగింది వారు చాలా గొప్ప ప్రాక్టీస్ ఉన్న లీడింగ్ లాయరుకూడ దేశస్వాతంత్ర్య ఉద్యమములో కృషిచేసినటువంటి గొప్పవ్యక్తి కేంద్రప్రభుత్వమంత్రివర్గంలో సభ్యులుగా ఉండి, హిందూ లా కు సంబంధించిన 4 బిల్లులు, యింకా యితర విషయాలలో వారు చేసినకృషి అందరికీ తెలుసు ఈ సందర్భంలో వారిపేరు ప్రతిపాదించినప్పుడు, అంగీకరించకపోతే పొరపాటుచేసిన వారమవుతామని, ఆ సదభిప్రాయాన్ని గుర్తించి, వారు తీర్పు చెబితే బాగుంటుందని అంగీకరించాము పటాస్కరుగారు ఒకసారి మద్రాసు, ఒకసారి హైదరాబాదువచ్చారు ఇక్కడకు వచ్చినప్పుడు మన కేసు విపులంగా వారికి చెప్పటం తటస్థించింది ఇవాళ నా మిత్రులు గోపాలురెడ్డిగారు, చంగల్రాయనాయుడుగారు చెప్పిన విషయాలు—గ్రామాల సరిహద్దులు, జనాభాలో వచ్చిన తేడాలగురించి చాలా చర్చ జరిగింది అప్పుడు గోపాలురెడ్డిగారు, అక్కడనుంచి వచ్చిన మిత్రులందరూ అక్కడ ప్రతి విషయాన్ని గురించి చెప్పినప్పుడు నేనుకూడ ఉండటం తటస్థించింది వారితో నేనుకూడ కలిసి ఈ విషయాలనుగురించి మనవాదం వారికి వివరించటంజరిగింది వారిని నేనెప్పుడు విడిగా కలుసుకున్నా, సంఘంలో కలుసుకున్నా, మంత్రివర్గం తరపున కలుసుకున్నా, ఇవాళ మనం ఏవి తప్పులని నిరూపించుటకు ప్రయత్నిస్తున్నామో యీ విషయాలన్నీ, maps గురించి, జనాభాగురించి, గ్రామసరిహద్దుల గురించి, హోసూరు గురించి, సమగ్రంగా చర్చించటం జరిగింది సుందరయ్యగారు కర్నూలులో ఉండగా నాకు ఒక map యిచ్చారు అందులో ప్రతి ఊరియొక్క స్వభావాన్నిగుర్తించి, map కత్తిరించి, ఏ ఊరు ఏ ప్రాంతానికి వచ్చేది స్పష్టంగా చూపించారు అదికూడ పటాస్కరుగారికి ఇచ్చినట్లు జ్ఞాపకం వారివద్దవుంటే తీసుకొని తిరిగి సుందరయ్యగారికి యిచ్చివేయుట నా ధర్మమని అనుకొంటున్నాను ఈ విషయములో యింకా మేము చేసిన కృషినంతా యిక్కడ వర్ణించి చెప్పుట, అనవసరము. మొదటినుంచి ఆఖరు స్టేజివరకు ఈ వ్యవహారములో ప్రతి సందర్భంలోకూడ, శ్రీ గోపాలురెడ్డిగారు హాజరుగానే ఉన్నారు ఇప్పుడు వారుచెప్పిన విషయాలన్నీ పటాస్కరుగారి దృష్టిలోకి తీసుకురాకపోవడంవలన, మనకు వ్యతిరేక తీర్పు రాలేదు. అన్నివిషయాలు వారికి చెప్పాము దానికి గోపాలురెడ్డిగారు చాలా తోడ్పడ్డారు. వారి వాదనను మేము బొమ్మక్రింద reflect చేయుటవలన యీ గొప్పతనమంతా వారిదేగాని, మాకు ఏమీ చెందదు. మిగిలిన యితర రాజకీయ నాయకులందరూ యీ విషయాలన్నీ పటాస్కరుగారికి మనవిచేశారు. వారికి చెప్పటంలో ఏదయినా డెసిమల్ పాయింట్ తేడా ఉంటే ఉండవచ్చునేమోగాని, ఏ రాజకీయ పార్టీకి చెందినవారయినప్పటికీ ఒకే స్థిరమైన అభిప్రాయముతో, సరిహద్దు వగయిరాలగురించి, లాభనష్టాలుగురించి, చెప్పటలో

ఏవిధంగానూ జంకలేదు ఇదీ వాస్తవ పరిస్థితి పటాస్కరుగారి రిపోర్టువలన ఈవిషయంలోవచ్చిన పరిణామం కూడ మనము కొంచెం విమర్శించుకోవాలి సహజంగా, ఈ ప్రక్కన ఉన్నవారు ఆ ప్రక్కకు వెళ్ళుటకు, ఆ ప్రక్కన ఉన్న వారు యీ ప్రక్కకు వచ్చుటకు బాధపడుతున్నారు ఇవాళ తిరుత్తణినుంచి ఒక స్నేహితుడు టెలిగ్రాం పంపిస్తూ గ్రామగ్రామాన్ని లెక్కచూచేటప్పుడు, గ్రామానికి ఉన్న శివారును లెక్కచూచుటకు మీకు (ప్రభుత్వమునకు) ఏమి హక్కు ఉన్నదని అడిగాడు మన ఉద్రేకంలో అట్లా అనిపిస్తుందిగాని గ్రామము అంటే దానియొక్క శివారును లెక్కవేసుకోనకుండా ఉండటం అసంభవమైన విషయమని గుర్తించాలి గోపాలురెడ్డిగారు చెప్పినట్లు తిరుత్తణి తాలూకాలో 1981 సం లో నూటికి 50 మంది తమిళులు, 49 మంది తెలుగువారు, ఒక పర్సెంటు యితరులు ఉన్నారు అర్బుదనాదం లెక్కవేసినప్పుడు 60 40 ఉన్నారు ఈ తేడా ఏమంటే సెన్సస్ పూర్తిఅయిన తరువాత District Hand Book, publish చేశారు దానిలో 1,20,000 ల మంది తెలుగువారు తిరుత్తణి తాలూకాలో ఉన్నట్లు లెక్క అర్బుదనాదం లెక్కలువేసిన తరువాత మొత్తం సంఖ్య, తాలూకాలో 87 వేలకు తగ్గింది ఇది ఒక discrepancy క్రింద మేము చూపెట్టాము వారుయిచ్చిన సమాధానం ఏమంటే మీ మనిషి దగ్గరఉండగానే యీ కూడికలు జరిగినవన్నారు. మొట్టమొదట మొత్తం తాలూకా యొక్క కూడిక పడింది కాని తర్వాత అర్బుదనాదం చూచినది 1951 లో గ్రామాల అంకెలు, విడివిడిగా గ్రామం, గ్రామం చొప్పున verify చేసిచూశామని వారి యొక్క claim ఈ విధంగా verification కు మనం ఒప్పుకున్నప్పుడు మన తరఫున ఒక సీనియర్ డిప్యూటీ కలెక్టర్ (భీమశంకరం) గారిని వారితో జత పరిచాము మద్రాసులో చర్చ జరిగిన సందర్భంలో— అప్పటికి యింకా వారు రిటైర్ కాలేదు—— పిలిచి అడిగాను ఏదైనా తప్పుఉంటే rectify చేసుకుంటాము, చెప్పమని అడిగితే, ఆయన ఒక్కటే ఖరాఖండీసమాధానం చెప్పారు— "నేను అంతా చూచాను —— యిది అంతా రైటు" అన్నారు అటువంటప్పుడు ఏమి చేయమన్నారు ? అందుచేత Official గా ఆంధ్రప్రభుత్వం map యివ్వలేదనంటే మొట్టమొదట వేసిన map లో మన భాగం ఉన్నది కనుక official గా యింకొకటి యివ్వటం అవసరం లేకపోయింది. ఈ విషయంలో చర్చలు జరిగినప్పుడు ఒక టేబుల్ మీద 6 అడుగులు ఉన్న map దగ్గర పెట్టుకొని, ఈ చర్చ అంతా జరిపాము. చర్చ జరిగిందనేవిషయం నా మిత్రులు గోపాలురెడ్డిగారికి స్వయముగా తెలుసు. అందుచేత map లేదనీ, యివ్వలేదనీ కాదు. మొట్టమొదట వేసిన map లో మనముకూడ భాగస్వాములము. ఒక్క అర్బుదనాదమ్ ఎత్తిన తప్పుపెట్టుట సరైనదికాదు. తప్పు ఉంటే భీమశంకరం యేంత్రుకూడ ఉన్నదని అంగీకరించక తప్పదు మన వాటాదారు ఒకరు ఉండ

టమువల్ల ఆ map పునాదిగా అంగీకరించక తప్పింది కాదు తరువాత బొమ్మ మీదగాని, అంకెలలోగాని ఉన్న తేడాలను సమకూర్చి వారు memorandum ద్వారా తీసుకువచ్చారు ఇక్కడ మళ్లీ విచారణచేశాము చెంగల్ రాయ నాయుడుగారు చెప్పినట్లు కలెక్టరుకు ఉత్తరాలు వ్రాసి. ఆ రకంగా యిది దిద్దుకొని, మన వాదనను మనం బలం చేసుకొనవలసిన కృషిలో ఎన్నడూ లోపం చేయలేదని మనవిచేస్తున్నాను పటాస్కర్ గారు కూడ ఈ విషయమే అక్కడ వ్రాసినారు

"The accuracy of this map is challenged by the representatives of Andhra It was pointed out in respect of some villages that there is an abnormal variation in the percentage of the population of the Andhras and the Tamils in the census of 1951 as compared with the census figures of 1931 Such cases are very few and it must be noted that the two officers, one of Madras Government and one of Andhra Government, were appointed by the Government of India in 1953 to collect the census particulars of border villages and it was on the basis of particulars collected by them that this map has been prepared "No alternative map . " అనే sentence ను విడదీసి విమర్శించుట న్యాయంకాదు. ఈ సెంటెన్సు, దానికి consequential అంతమాత్రంతో ఊరుకొనలేదు అక్కడ ప్రభుత్వం, ప్రజాప్రతినిధులు అనే తేడాలేకుండా, అందరంకలిసి కూర్చొని చర్చించాము. 'హోసూరునుగురించి 14, 15 maps తయారుచేశాము. ఇవన్నీ వారి ముందు పెట్టుట తటస్థించింది' వాదంలో లోపంవచ్చి కేసుపోలేదు. 1954 లో S. R. C వారివద్ద, తిరుత్తణి తాలూకా అంతా మనదేనని చెప్పాము తరువాత యీ వివరాలను గురించి చర్చవచ్చి నప్పుడు, గోపాలురెడ్డిగారు చెప్పినట్లు, రెండు ఫిర్కాలు (ఇరుంబు ఫిర్కా, యింకొక ఫిర్కా) వదిలిపెట్టి తిరుత్తణి సహితంగా ఉన్న తాలూకా మాకు యివ్వవలెనని, చరిత్రాత్మకంగా ఉన్న ఆధారాలుకూడ వారికి చూపించినాము. అసలు ఆపేరు తిరుత్తణి కాదని, చిరుతని అని, చిరుతని నివాస అని ఒకశతకంకూడ ఎప్పుడో వ్రాసినది చిరకాలంగా ఉన్నదని, యింకా అనేక విషయాలు చెప్పాం కార్వేటినగరం మహారాజులు తెలుగువారని, అది వారిచ్చిన డొనేషన్స్ అని, అది చారిత్రాత్మకమైనదని, దేశంలో ప్రసిద్ధికెక్కిన సుబ్రహ్మణ్య క్షేత్రాలు ఐదు ఉంటే, అందులో నాలుగు ఇదివరకే తమిళదేశంలో ఉన్నాయి కనుక ఐదవ సుబ్రహ్మణ్యక్షేత్రం మాకు వదలిపెట్టమని అడిగాము. చివరకు అంత వరకుకూడ వాదించాము 1931 వ సం. సెన్సస్ ప్రకారం తిరుత్తని రెవిన్యూ గ్రామంలో తెలుగుకు ఆనాడు మెజారిటీఉంది తిరుత్తని పంచాయితీలోమాత్రం

అప్పుడుకూడ, తెలుగుకు మెజారిటీలేదు ఈ రకంగా అతి సూక్ష్మంగావెళ్ళి మన వాదనలన్నీ చెప్పటం జరిగింది ఇరుంబి ఫిర్కా, మానూరు ఫిర్కా, వదిలిపెట్టి, మిగిలిన భాగం ఇమ్మనమని మేము చెప్పినా, అది అంగీకారము పొందలేదు

ఇప్పుడు పటాస్కరుగారు ఇచ్చినటువంటి ఎవార్డుప్రకారం వచ్చినటువంటి ఫలితం సూక్ష్మంగా ఇది—తిరుత్తని తాలూకాలో మొత్తం 338 గ్రామాలు తమిళనాడుకు వెడతాయి 47 గ్రామాలు ఆంధ్రప్రదేశ్‌లో ఉంటాయి తిరువళ్ళూరు, పొన్నేరి తాలూకాలలో ఒకచోట 76, ఒకచోట 72 మొత్తం 148 గ్రామాలు ఆంధ్రప్రదేశ్‌లోకి వస్తాయి చిత్తూరు తాలూకాలో 29 గ్రామాలు మాత్రం తమిళనాడుకు వెడతాయి పుత్తూరు తాలూకాలో ఒకగ్రామం వెడుతుంది పలమనీరు తాలూకాలో రెండు చిన్న చెరువులు వెడతాయి. హోసూరు, కృష్ణగిరి తాలూకాల్లో 3 గ్రామాలు ఆంధ్రప్రదేశ్‌కు వస్తాయి ఇవిగాక అర్నియార్ ప్రాజెక్టు ఆంధ్రప్రదేశ్‌లో మిగిలిపోతుంది ఈ లెఖ్ఖలన్నీ కూడుకొని చూసుకుంటే, మొత్తం 321 చదరపుమైళ్ళు కలిగిన ప్రదేశం మనదగ్గరనుండి తమిళనాడుకు వెడుతుంది 313 చదరపుమైళ్ళ విస్తీర్ణము కలిగిన భూభాగము మనరాష్ట్రంలో లేనిది, మనకువచ్చి కలుస్తుంది అంటే తేడా 8 చదరపుమైళ్ళు మాత్రమే జనాభా గురించి ఆలోచిస్తే—మద్రాసునుంచి ఆంధ్రప్రదేశ్‌కు వచ్చే జనాభా మొత్తం ఒక లక్ష ఉన్నది ఇందులో 61 వేలమంది ఆంధ్రులు ఉన్నారు ఆంధ్రప్రదేశ్‌నుంచి మద్రాసుకు వెళ్ళే జనాభా మొత్తం రెండు లక్షల నలభై వేలు ఉన్నది ఇందులో 77 వేలమంది తెలుగువారు ఉన్నారు. పొన్నేరి, తిరువళ్ళూరు తాలూకాలలో ఇంకా తెలుగువారు ఉన్నారు వారు మనకు రాలేదు తిరుత్తనిలో, అవతలపక్క వెళ్ళేదానిలో ఇంకా తెలుగువారు ఉన్నారు వారూ మనకు రాలేదు చిత్తూరు జిల్లాలో ఇచ్చినటువంటి 20 గ్రామాలు, తెలుగువారు ఉన్నటువంటి గ్రామాలే సరిహద్దులలో అసలు తమిళులు లేనటువంటి, అసలు తెలుగువారు లేనటువంటి గ్రామాలు ఉండవు. అందువల్ల సరిహద్దులను ఎటుమార్చినా, 1 పర్సెంటు తెలుగువారు అటో, 1 పర్సెంటు అరవవారు ఇటో ఉండక తప్పదు. ఒకప్పుడు మనం ఒక సలహా ఇచ్చాము. మద్రాసునుంచి బెంగుళూరు వెళ్ళే రైలు లైనుకు ఉత్తరం అంతా తెలుగుదేశం, దక్షిణం అంతా తమిళ దేశం అని పెట్టుకోండి అని అన్నాము దానికికూడ వారు అంగీకరించలేదు. ఆవిధంగా మనం చెప్పినట్లుచేస్తే, తిరుత్తని వారికి రాదు; హోసూరు మనకు రాదు. ఇప్పుడు మనకు తిరుత్తనిలో హెచ్చుభాగం పోవటం, హోసూరులో స్వల్ప భాగం మాత్రం రావటం జరిగింది. ఇప్పుడు తిరుత్తనిగురించి విపులమైన వివ

రాలు స్నేహితులు ఇచ్చారు చంగల్పట్టునుండి వచ్చిన పున్నేరు, తిరువళ్లూరు తాలూకాలకు సంబంధించిన గ్రామాలు గురించి నేను చెప్పాను

పుత్తూరు, పలమనేరు గ్రామాలు వదిలిపెడితే, ముఖ్యమైన సమస్య కుప్పానికి సరిహద్దులో ఉన్నటువంటి హోసూరు, కృష్ణగిరి తాలూకాలు వీటిని గురించికూడ విపులమైన చర్చ జరిగింది మన మెంబరు రామబ్రహ్మంగారు మన సరిహద్దుకు ఆరు మైళ్లు ఇవతల ఉన్నారు కృష్ణగిరి-కుప్పానికి కొండలమీంచి ఒక రోడ్డు ఉన్నది. ఆ రోడ్డు వెంబడి నేను వెళ్ళాను. వేపనపల్లి, వగైరా ఫిర్కాలలో ఉన్న గ్రామాలు చూసి అక్కడనుండి కృష్ణగిరి, హోసూరు వెళ్ళి, హోసూరుమీదుగా బెంగుళూరు వెళ్ళటం తటస్థించింది అక్కడ మంచి ఉత్సాహవంతులైన యువకులు ఉన్నారు యం యల్ ఎ మునిరెడ్డిగారు, కోదండ రామయ్యగారు ఉన్నారు కోదండ రామయ్యగారు గొప్ప పండితులు హెడ్‌మాస్టర్ ఉద్యోగానికి రాజీనామా ఇచ్చి యీ ఉద్యమంలో కృషిచేసిన గొప్ప వ్యక్తి కోదండ రామయ్యగారు వారు యం ఎ పాస్ అయ్యారు వీరవారు మా మెమోరాండం చదివితే, మేము ఎంత సూక్ష్మంగా దీనిని గురించి అర్థ్యాచేశామో తెలుస్తుంది వేపనపల్లి ప్రక్కన బూదుమట్ల అనే గ్రామం ఉంది బూదుమట్లలో సీతారాముల యొక్క దేవాలయం ఉంది మేము అక్కడికికూడ వెళ్లటం తటస్థించింది అక్కడ సీతమ్మవారు రామునికి ఎడమవైపున ఉండటం మానేసి, కుడివైపున ఉన్నది ఇది మన సాంప్రదాయానికి కొంచెం వ్యతిరేకము అక్కడ రామయ్యాగౌడ్ అనే 70 సంవత్సరాలుపైన ఉన్నటువంటి వయసుగల ఒకవ్యక్తి ఉన్నారు వారు తెలుగువారే "ఇక్కడ ఇలాంటి మార్పు వచ్చిందేమిటి ?" అని వారిని అడిగాము తిరుపతి దేవాలయంలో ఉన్న సీతారాముల విగ్రహాలలోకూడ, సీతమ్మ కుడివైపుననే ఉన్నది. నేను ఇన్ని మార్లు తిరుపతి వెళ్లినా, సీతమ్మ కుడివైపున ఉన్నదని నేను గుర్తించలేదు, ఆయన జ్ఞాపకంచేశాడు ఆయన చెప్పాడు. "తిరుపతి దేవాలయంలో ఇలాగ ఉన్నది మా ఊళ్లో శ్రీరామనవమి కళ్యాణం జరిగేటప్పుడు కళ్యాణం చేయించేందుకు తిరుపతినుంచి వస్తారండి. అంచేత మీరు తిరుపతి అయినా, మాకు ఇచ్చేయండి. లేదా మా ఊరు అయినా తీసుకువెళ్లి మీ ప్రాంతంలో కలుపుకోండి" అని ఆయన కోరాడు ఇంకా వారి మాటలు నా చెవుల్లో రింగుమంటున్నాయి ఇంత సూక్ష్మంగా కృషిచేసి, ప్రతివిషయాన్నిగురించి, మనకున్న అన్ని క్లయిమ్స్ పటాస్కర్ గారి ముందర పెట్టాము. పటాస్కర్ గారు ఇచ్చిన ఎవార్డ్‌లో హోసూరునుగురించి విపులంగా వ్రాయకపోవడంవల్ల, దానినిగురించి విచారణచేసి ఇంకో రిపోర్టు పంపించేవరకు పటాస్కర్ రిపోర్టు ఒప్పుకోము అని మేము అడ్డుపెట్టటం జరిగింది. దానిమీద మన ముఖ్య మంత్రి

గారు పటాస్కర్‌తో మాట్లాడటం, వారు అంగీకరించటం, గవర్నమెంటు ఆఫ్ ఇండియావారు కూడ అంగీకరించటం, మళ్ళీ మన వాదనలన్నీ వారికి పంపించటం జరిగింది

వేపనపల్లి ఫిర్కా ఒకానొకప్పుడు హోసూరు తాలూకాలో ఉండేది 1921 సం మార్చి 16 వ తారీఖున వేపనపల్లి ఫిర్కాను కృష్ణగిరి తాలూకాలో కలిపారు దానిని ఆ మూలనుంచి యీ మూలకు తీసుకురావటంవల్ల, ఇవాళ కృష్ణగిరి తాలూకాద్వారా కాని, మనం హోసూరు వెళ్ళటానికి వీల్లేదు ఇది వరకు అక్కడ 'బేరికి' అని ఒక తెలుగు సంస్థానం ఉండేది బేరికి తెలుగు సంస్థానంలో ఒక భాగం వేపంచేరిఫిర్కా బూదిమట్ల వగైరా అన్ని గ్రామాలతో కూడిన వేపనపల్లి ఫిర్కా మనకు వస్తే హోసూరునకు మనకు దోవ ఏర్పడుతుంది హోసూరులో ఎక్కువమంది తెలుగువారు ఉన్నారు హోసూరులో చూచుకొంటే, ఎక్కువమంది తెలుగువారు, తెలుగువారితర్వాత కన్నడులు, కన్నడుల తర్వాత తమిళులు ఉన్నారు కాని హోసూరుకు ఉత్తరప్రాంతానఉన్న భాగంలో నూటికి 60, 70 మంది తెలుగువారు ఉన్నటువంటి గ్రామాలు ఉన్నాయి కాని కృష్ణగిరే మన సరిహద్దు హోసూరు మన సరిహద్దులో లేదు దైవకృప వల్ల కోలారు మనకు వచ్చిఉంటే, హోసూరు దానంతటదే మనకు వచ్చేది కోలారు రాకపోవటంవల్ల మనకు వేపనపల్లికి ఒక చిన్న సరిహద్దు ఉన్నమాట నిజము. అక్కడ పెద్ద కొండలులేవు చంగల్రాయనాయుడుగారు చెప్పినట్లు 10 అడుగుల కొండలు కాకపోయినా, చిన్నచిన్న కొండలు ఉన్నాయి వాటిని హిల్స్ అని పెద్దపేరున పిలువవలసిన అవుసరము లేదు. అవి గుట్టలక్రింద లెక్కచూసుకోవలసిన న్యాయము ఉన్నది కాని ఆ పది పదిహేనుగ్రామాల్లో తెలుగువారికి ఖచ్చితమైన మెజారిటీ ఆ గ్రామాలలో ఉంది అని, అందుచేత వేపనపల్లి మీకు ఇవ్వటానికి వీల్లేదుగనుక హోసూరుకు వెళ్ళటానికి కూడా వీల్లేదన్న విషయం వారు చెప్పారు

"Contiguity is a sacred principle which cannot be violated' అన్న విషయాన్ని వారు ఆఖరున వ్రాయటం తటస్థించింది

ఈ సందర్భంలో యిక మనము భవిష్యత్తును గురించి ఆలోచిస్తే ఏమి జరుగుతుందో మనకు తెలియదు కోలారువారు మనలోకి వచ్చినప్పుడు, హోసూరువారు మనలోనికి రాకుండా అసలు chance పోలేదు మైసూరువారు హోసూరు కావాలని వారు claim చేస్తున్నారు. అదిగూడ చర్చకు వచ్చినప్పుడు మరల మనము అందరముకూడ అందులో భాగస్వాములము అవుతాము ఈ సందర్భములో నాకు ఒక పద్యము జ్ఞాపకము వస్తున్నది :

"సూదిబెజ్జమంత చిల్లియున్న కడవలోని జలమెల్ల కారునట్లు" అని అన్నట్లు, మనకు ఆమాత్రము చిల్లిలేకపోలేదు ఇక మిగతా విషయాలన్నీ యీ రోజున సెటిల్‌మెంటు కావటానికి మిగతా సందర్భములు ఉన్నవి అందువల్ల వాటి అన్నింటిని గురించి మనము ఆలోచించేటట్లయితే మనకు ఒక్క విషయము మాత్రము గోచరమవుతుంది కాని మేము చేసిన ప్రయత్నములో మాత్రము ఎంతమాత్రము లోపములు జరగలేదు ఒక పెద్దమనిషివద్ద మనము ఫిర్యాదు చేశాము అనుకొండి సరే ఆయన మనకు వ్యతిరేకము అనుకుంటే, వ్యతిరేకమనే అనుకొండి ఏదో ఒకతీర్పు యిచ్చారు ఆ ఇచ్చినతీర్పును మన్నించాలి అనేది ఒక ప్రధానమైన సమస్య అయింది పెద్దలు అందరియొక్క కోరికవల్ల మనము చేయవలసిన ప్రయత్నము అంతా చేశాము సరే, వచ్చేతీర్పు ఏదో వచ్చింది మనము అంగీకరించి పెట్టుకున్న పెద్దమనిషియొక్క పంచాయితీ మనము అంగీకరించడము న్యాయము గనుక, అది ప్రభుత్వము అంగీకరించినటువంటిమాట నిజమే మొన్న ప్రశ్నల సందర్భములో ముఖ్యమంత్రి సమాధానము చెబుతూ మనముందు యీ విషయము పెట్టారు సందర్భానుసారముగ మనము ఈ రోజున ఈ విషయమును గురించి చర్చించుచున్నాము మరల యీ విషయముగురించి యింకను విపులముగ చర్చించటానికి అవకాశం కలగబోతున్నది ఎందుకంటే ఒక రాష్ట్రమునుంచి యింకొక రాష్ట్రానికి ఏమే ప్రాంతమైనా బదిలీచేసేముందు కేంద్రప్రభుత్వమువారు Indian Constitution లోని Sec 3 (4) ప్రకారము మన శాసనసభ వారి శాసనసభ ఆమోదముకొరకు అడగాలి ఈరోజు ఉదయమున ఎవరో చెప్పారు. ఆ పెద్దమనిషి ఇచ్చినటువంటి award లో మద్రాసువారికి గూడ కొన్ని కష్టములున్నవి అవి మనకొక్కరికే కాదు వారియొక్క కష్టములుగూడ వారు గుర్తించుకుని వారు ఏమైనా ఒక అడుగుముందుకు వేస్తే, మనముగూడ దానికిఏదైనా చేయవలసిన ఆవశ్యకత ఏర్పడితే, అది వేరేసమస్య కాని యీ రోజున యీ రిపోర్టును స్థూలముగ ఒప్పుకోవడము జరిగింది. కాబట్టి నేను సభ్యులకు మనవిచేసేది ఏమిటంటే, గోపాలురెడ్డిగారు, చంగలరాయ నాయుడుగారు, యింకా యితర మిత్రుల సహాయముతో maps విషయములోగాని, జనాభా లెక్కల విషయములోగాని, గ్రామసరిహద్దుల విషయములో గాని చేయవలసిన అఖండమైనకృషి అంతాచేశాము. దాన్నిగురించినవిమర్శ, ఏదీగూడ అవసరము లేదనుకుంటున్నాను. ఇక మిగతా విషయాలను గురించి సభ్యులయొక్క మనస్సులలో ఉన్న అభిప్రాయాలు చెప్పేటట్లయితే దీన్నిగురించి మనము చేసుకున్న చర్చలయొక్క లాభము అందరికీ కలుగుతుందని మనవిచేస్తూన్నాను. ఇప్పటికి ఉన్నవిషయాలు అన్నీ మీకందరికీ నేను చెప్పడము తటస్థించింది

కాబట్టి సభ్యులందరు యీ విషయాన్ని గురించి చర్చించవలసిందిగ తమద్వారా నేను కోరుతున్నాను

* శ్రీ డి రామబ్రహ్మం (కుర్పం) అధ్యక్షా, ఇదివరకు పటాస్కర్ రిపోర్టును గురించి మిత్రులు గోపాలురెడ్డిగారు, చంగలరాయ నాయుడుగారు యిదివరలో మన రాష్ట్ర వ్యవహారములను గురించి కృషిచేసినటువంటి గౌ॥ కళా వెంకటరావుగారు విపులముగ సభ్యులకు చెప్పవలసిన విషయాలను గురించి చాలా argumentative గానే చెప్పారు ఏదో పెద్దలు చేశారు, కనుక ఆ రిపోర్టును మనము ఒప్పుకోవలసి ఉన్నది కాని అందులో ఏమాత్రపు కొద్ది బెజ్జము ఉన్నప్పటికినీ, దీనిని మరల పరిశీలన చేసే అవకాశములు, మనము కలుగు జేసుకోవచ్చునని అన్నారు ఇప్పుడా సరిహద్దులలో ఉన్న ఆంధ్రుల యొక్క యిబ్బందులను ప్రభుత్వమువారు, యిక్కడ ఉన్న సభ్యులందరు గుర్తించాలి

శ్రీ కె. వెంకటరావు ఇందాక గోపాలురెడ్డిగారు minorities యొక్క rights ను గురించి చెప్పారు. ఆ విషయమును గురించి చెప్పడమునకు నేను యిందాక మరచిపోయినాను ఈ జరిగిన అంగీకారములో ఉన్న condition ఒకటి ఏమిటంటే, అక్కడ ఉన్న తెలుగు భాష చదువుకునే వారికి, యిక్కడ ఉన్న అరవభాష చదువుకునేవారికి అందరికీ సమానమైనహక్కులు కలగటానికి, అందుకు బడ్జటులో provision పెట్టటానికి, దీనిని అంతా ఆలోచించటానికి ఏవిధముగ చేయాలి, యీ provision ఇటు, అటు ఏవిధముగ మార్చుకోవాలి అనే విషయాల నన్నింటిని గురించి ఒక ప్రణాళికను యివ్వడానికి నలుగురుతో ఒక సంఘము వేశారు అందులో కేరళ ముఖ్యమంత్రి నంబూద్రిపాడుగారు, మద్రాసు ఆర్థికమంత్రి సి. సుబ్రహ్మణ్యంగారు, మైసూరు ముఖ్యమంత్రి నిజలింగప్పగారు, నేను, సభ్యులుగ ఉన్నాము ఆ విషయమును గురించి కూడ విచారించటానికి ఉభయ ప్రభుత్వాలవారు అంగీకరించారు దానికి సంబంధించిన నివేదిక త్వరలోనే తయారై వస్తుందని ఆశిస్తున్నాను.

మిస్టర్ స్పీకర్ చంగల్పట్టువారు ఎవ్వరుకూడ "మేము రాము" అని అంటున్నారని యిందాక ఎవరో నాతో చెప్పారు ఆ సంగతి ఏమిటి ? ఎంత వరకు నిజం ? ఏమి జరిగింది ?

శ్రీ కె. వెంకటరావు : ఇక్కడ ఉన్నవారు మద్రాసుకు వెళ్ళమని ఏ విధముగ చెబుతున్నారో, అక్కడవారు కూడ అదేవిధముగ చెబుతూ వుండవచ్చు.

మన ఆంధ్రలోకి 79 వేల మంది అరవవారు రావాల్సి ఉన్నది అందువల్లనే వారు "మేము రావడము లేదు" అని చెబుతూ ఉండవచ్చు. అలాగే మనవారు కూడ చెబుతూ ఉన్నారు మనవారు అక్కడికి వెళ్ళకుండా, వారు వచ్చే మార్గము ఉంటే, సంతోషమే అధమపక్షము వీరు అక్కడికి వెళ్ళకుండ, వారు ఇక్కడకి రాకుండాఉంటే, అంతకంటే సంతోషమే అక్కడ తెలుగువారందరు యిక్కడికి వచ్చి ఇక్కడఉండే తెలుగువారుఇక్కడనే వుంటే, ఇక మనకు అంతకంటే కావలసినది ఏమున్నది? అదే ideal solution అనుకుంటాను అలాంటిపరిస్థితి ఏర్పడితే, ఇక నేనేమి చెప్పగలను?

శ్రీ డి రామబ్రహ్మం అక్కడవున్న సరిహద్దులలో యితర రాష్ట్రాలలో ఉన్న ఆంధ్రులకు అన్యాయము జరగకుండా దానికి ఒక కమిటీని నియమించినట్లుగా కళా వెంకటరావుగారు యిప్పుడే చెప్పారు పటాస్కర్ రిపోర్టువచ్చిన తరువాత హోసూరులో కానివ్వండి, లేదా వేపనపల్లి ఫిర్కాలో కానివ్వండి, అక్కడవున్న తెలుగు సెకన్సు అన్నికూడ యీనాడు మార్చివేస్తూ, అక్కడ పనిచేసే తెలుగు ఉపాధ్యాయులనందరినీ మార్చివేసి, అక్కడ అరవమే ఇక ముందునుంచి బోధనాభాషగా చేయబోతాము అని తల్లితండ్రులను అందరినీ యికముందునుంచి అరవము నేర్చుకోవలసిందేనని నిర్బంధముగ పెట్టిస్తూన్నారని మేము వింటున్నాము గనుక యీ విషయము మీ దృష్టికి తెస్తున్నాను ఇదివరకు ఈ సంగతి మన ముఖ్యమంత్రిగారు కూడ మన రాష్ట్రము ఏర్పడేటప్పుడు చెప్పారు. Undisputed areas అన్నికూడ రాష్ట్రవ్యాపితముగ తయారుచేసి మనయొక్క సరిహద్దుల పరిష్కారముకొరకు ప్రత్యేక కమిటీని వేసుకుంటున్నామని చెప్పారు ఆ undisputed areas లో తిరుత్తనికూడ ఒక భాగముగా వచ్చిందే అప్పుడేఅది disputed area గాఉండి ఉన్నట్లయితే అప్పుడు చిత్తూరు మనరాష్ట్రములోనుంచి మినహాయించబడి ఉండేదే. అప్పుడు బళ్ళారి జిల్లాలో కొంతభాగము మాత్రము మైసూరులోచేర్చి, కొంతభాగము ఆంధ్రలో చేర్చారు అలాంటిది చిత్తూరుజిల్లా విషయములో జరిగివుండలేదు అందువల్ల అది ఏవిధముగను disputed area గా లేకుండా పోయినప్పటికినీ, మద్రాసులో ఉన్న కొంతమంది శక్తులు ఆ ప్రభుత్వాన్ని ప్రోద్బలముచేసి, వారందరిమీద ఒత్తిడితెచ్చి మరల యీ సమస్యను తిరగతోడటానికి పునఃపరిశీలన చేయటానికి పరిస్థితి ఏర్పడింది మద్రాసులోగాని మనకు యిక్కడఆంధ్రప్రదేశ్ లోగాని ఉన్న ఉభయ ప్రభుత్వాలు కూడ కాంగ్రెసు ప్రభుత్వాలే గనుక, యీ ప్రభుత్వాల యొక్క ముఖ్యమంత్రులు కాంగ్రెసుపార్టీ మంత్రులేగనుక, వీరుయిద్దరుకూడ కూడబలుకుకుని ఈ సమస్యను మనమే పరిష్కారం చేసుకుంటాము అని ఒక ఒడంబడికను ఏర్పాటు చేసుకున్నారు. ఆ ఒడంబడిక ననుసరించి ఉభయులు యీనాము

స్యను పరిష్కారం చేస్తారని ఆశించాము వీరు పరిష్కారించుకోవడములో భేదాభిప్రాయాలు మొదట్లో రావడమువల్ల, దీనివల్ల యీ పరిష్కారము ఆలస్యము అయినందువల్ల, కేంద్రప్రభుత్వము యొక్క సలహాపైన పటాస్కారను మధ్యవర్తిగా పంపడము జరిగింది పటాస్కర్ వచ్చి ఆయనకు తోచిన విచారణ చేశారు ఒక నివేదికను ఆయనద్వారా సూత్రప్రాయముగ తయారు చేయించుకుని ఉభయ ముఖ్యమంత్రులు పరిష్కారము చేసుకున్నట్లుగ ప్రకటన పేపర్లలో వచ్చింది అయినప్పటికీ పటాస్కర్ మేధాశక్తిగల వ్యక్తి అని, వారు ఎవ్వరికి లొంగరని మన రెవిన్యూమంత్రిగారు నొక్కి వక్కాణించారు మన ప్రభుత్వము 1931 సం॥పు census లెక్కలనుబట్టి 1951 లో census లెక్కలను తయారు చేయటానికి సహాయముగా పంపబడిన శ్రీ భీమశంకరంగారు, ఆరోజులలో తాను ఒక dictionary తయారు చేసే ప్రయత్నములో నిమగ్నులై సెన్సస్ లెక్కలను నిర్లక్ష్యము చేసినందున చిట్టచివరికి ఆ లెక్కలు అరవవారికి అనుకూలంగాను ఆంధ్రులకు ఘోర అన్యాయముగాను తప్పులతో తయారు చేయటానికి ఆస్కారమైంది దీనివల్ల ఆంధ్రులకు చిక్కులు ఏర్పడినవి ఆంధ్రులకు శాశ్వతముగ అన్యాయము జరిగేటట్లు పుణ్యము కట్టుకున్నారు హోసూరు విషయములో 1931 వ సం॥ census లెక్కలకున్నూ, 1951 లో తీసుకున్న census లెక్కలకున్నూ, ఉన్న తేడాలు మీ దృష్టికి తెస్తున్నాను ఆంధ్రప్రదేశానికి, మద్రాసు రాష్ట్రములో ఉన్న హోసూరు, వేపనపల్లి ఫిర్కాప్రాంతము చేరటానికి contiguity కావాలసి వుంటుందని మంత్రిగారు చెప్పారు కాని మనకు అక్కడివి మూడు గ్రామాలు వచ్చినదానివల్ల contiguity పోయిందని అన్నారు ఒక్క కన్నడగ్రామము అడ్డముగా ఉన్నదని, contiguity ఏర్పడడము లేదని సాకు చూపిస్తున్నారు గ్రామము పేరు చింతమాకులపల్లి అక్కడ 1931 జనాభా లెక్కల ప్రకారము తెలుగువారు 45% ఉన్నారని, 24% అరవవారున్నారని, 29% కన్నడీలు ఉన్నారని తెలిసింది. కాని 1951 census లెక్కలలో తెలుగువారు 45% అని అరవవారు 3 9% అని, కన్నడలు 48 9% అని హెచ్చుచేసి చూపించారు ఈ తేడా ఎట్లు వచ్చిందో తేల్చవలసియున్నది ఇంత తేడా నిజముగ ఉన్నదో లేదో మరల census లెక్కలు తీసేటట్లయితే తెలుస్తుంది వాస్తవానికి అంత మంది ఎక్కువ కన్నడీలు లేనేలేరు అరవవారు లేకపోయినా, దీనిని ఆంధ్రులకురాకుండా చేయటానికి కన్నడీలు ఎక్కువగా ఉన్నారని చూపిస్తున్నారేకాని యిది నిజముకాదు. దీనికి contiguity మద్రాసు మైసూరు రాష్ట్రాలకు ఏర్పడేటట్లు ఆంధ్రకు కాదని చూపిస్తూ ఆంధ్రరాష్ట్రములో చేరకుండా చేయటానికి పటములో గుర్తుపెట్టి చూపిస్తున్నారు. ఇది సరికాదు.

తదుపరి మనవార్ల పల్లివుంది అక్కడ 1931 వ సంవత్సరంలో 45% తెలుగువారు, 24% అరవవారు, 29% కన్నడిగులు ఉండేవారు. 1951 వ సంవత్సరంలో దానిని 47% తెలుగువారు, 26 5% అరవవారు, 26 9% కన్నడిగులుగా చేశారు గంగమడుగులో 1931 వ సంవత్సరంలో 77 9% తెలుగువారు, 11 0% అరవలు, 10 0% కన్నడిగులు వుండేవారు ఇటువంటి contiguity వున్న గ్రామాలలో చింతకంపల్లి తప్ప మిగతా అన్నిగ్రామాలలో అధికసంఖ్యలో మన తెలుగువారే వున్నారు కాబట్టి మనం యిప్పుడు 50% ratio తీసుకోకుండా ఏ భాష మాట్లాడేవారెక్కువవున్నారో ఆ భాషనుబట్టిఅది తెలుగుభాషగా వున్నట్లయితే దానిని contiguity క్రింద తీసుకుంటే, వేపనపల్లి ఫిర్కా మొత్తంకూడా ఆంధ్రప్రదేశ్‌కు చేరవలసి వుంటుంది వేపనపల్లి ఎప్పుడయితె మన ఆంధ్రప్రదేశ్‌కు వస్తుందో అప్పుడు హోసూరు విషయంలో ఏ ఒక్కతగాదా వుండదు హోసూరు విషయంలో పూర్తిగా, ఒకటి రెండు ఫిర్కాలు తప్ప మిగతా మొత్తం హోసూరుతాలూకా అంతా తెలుగువారే ననేమాట ముఖ్యమంత్రి శ్రీ సంజీవరెడ్డిగారికి, శ్రీ కళా వెంకటరావుగారికి బాగుగా తెలుసును ఎన్నికల రోజులలో అరవం మాట్లాడితే అర్థం కానటు వంటి ప్రదేశమది అక్కడ వోటర్లజాబితా అరవం, తెలుగు రెండుభాషలలో తయారై వుంటుంది అది యీనాటికీ రికార్డులలో చూడవచ్చు. అక్కడున్న ఏ ఒక్క ప్రభుత్వపు రికార్డు తీసుకున్నా తెలుగులోనే వుంది. అటువంటి పరిస్థితు లుండబట్టి అక్కడున్న ఆంధ్రులు మనయొక్క ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం అండగా వుంటుందనే నమ్మకంతో ఒక ఉద్యమాన్ని లేవదీశారు. అది న్యాయమైన ఉద్యమం అక్కడివారు దానికి కావలసిన ఆధారాలన్నీ సేకరించి మన ప్రభుత్వం ఎదుటవుంచారు హోసూరు విషయంలో "అది త్రిభాషలకు చేరిన ప్రదేశం కాబట్టి నేను దీనిగురించి పరిశీలన చేయను" అని మొట్టమొదట చెప్పి తదుపరి మన ముఖ్యమంత్రిగారు "పుత్తూరుకు చేరినటువంటి ఒక చిన్న గ్రామానికి అన్వయించిన సూత్రాన్ని ఎందుకుగాను హోసూరుకు అన్వయించ లేదు ?" అని ఒక statement వెలువరచగా 800 జనసంఖ్యగల 3 గ్రామాలు మనవియిచ్చి, అక్కడవుండే అడవిప్రదేశం మనకు అప్పచెప్పారు ఇప్పుడు మదరాసు రాష్ట్రప్రభుత్వంవారు యిచ్చినటువంటి map లో 2, 3 రంగులు వేశారు ఆ రంగులో వేసినవారు అరవగ్రామాలకు green వేసినారు. అడవి ప్రాంతాలలోని బేచిరాకు గ్రామాలకు కూడా green వేసి ఆకుపచ్చగా వున్న దంతా పెద్ద block గా చేసి అక్కడున్న ప్రదేశమంతా అరవ ప్రదేశమేనని చూపారు. ఈనాడు అక్కడ census తీసుకుంటే హోసూరులో వున్న వారంతా తెలుగువారే. మన మంత్రి శ్రీ కళా వెంకటరావుగారు చెప్పినట్లు కోలారు మనకు లేకపోయింది. ఈనాడు నా నియోజకవర్గం కుప్పంలో

వున్నటువంటి percentage కంటే కూడా కోలారులోను, హోసూరులోను, ఎక్కువ percentage తెలుగువారున్నారని మనవి చేసుకుంటున్నాను కాబట్టి యీ విషయం పునఃపరిశీలన చేయవలసిందనీ, అందుకుగాను సరిహద్దులలో ఉన్న శాసనసభ్యులను, అనధికారులను కొందరిని, ఉభయ రాష్ట్రాల ముఖ్య మంత్రులను,—ఒక్కొక్క రాష్ట్రంలో యిద్దరు మంత్రులచొప్పున వుండే ఒక కమిటీని వేసి, ఆ కమిటీకి ఒక Judge ని వేసి పునఃపరిశీలనచేసి ఆంధ్రులకు తగిన న్యాయం కలుగజేయాలని మనవి చేస్తున్నాను పటాస్కర్ రిపోర్టు పైన యీ శాసనసభ ముందువచ్చే బిల్లును సభ్యులందరూ పరిశీలించి అప్పుడు ఆ కమిటీని వేయవలసినదిగా కేంద్ర ప్రభుత్వానికి ఒక తీర్మాన రూపకంగా మనం తెలుపవలసినదిగా మన ప్రభుత్వానికి, సభ్యులకు విజ్ఞప్తి చేసుకుంటూ యింతటితో శలవు తీసుకుంటున్నాను

*శ్రీ పి నరసింగరావు అధ్యక్షా, ఈ పటాస్కరు రిపోర్టును గురించి ముఖ్యంగా దాని ఫలితంగా affect అయే గౌరవ సభ్యులు వివరముగా చెప్పారు వారు చెప్పిన విషయాలనుబట్టి శ్రీ పటాస్కరు రిపోర్టును పరిశీలిస్తే ఆంధ్రుల మైన మనకు జరుగవలసిన విధముగా న్యాయం జరిగినట్టు కనపడడంలేదు శ్రీ కళా వెంకటరావుగారు, "మేము చాలా ప్రయత్నం చేశాము ఆంధ్రుల stand ను, case ను గట్టిగా శ్రీ పటాస్కరు ముందు, S R C ముందు పెట్టినాము" అని చెప్పారు మొత్తంమీద యీ విషయాలన్నీ పరిశీలించినట్లయితే మన ఆంధ్ర రాష్ట్రం అప్పుడప్పుడే separate కావడం, దానికుండే కొన్నిపరిస్థితులు ఉండడం యితర pre-occupations వల్లనో ఏవిధంగానో మన ప్రభుత్వం మన హక్కులను శ్రీ పటాస్కర్ ముందుగాని అంతకుముందు S R C ముందుగాని పెట్టవలసిన విధముగా పెట్టినట్టు కనపడడంలేదు Maps గురించి కూడా చర్చలోవచ్చింది ఆ సందర్భంలో "దానిని విడిగా చదివితే బాగుంటుంది" అని శ్రీ కళా వెంకటరావుగారు చెప్పారు అందులో వున్నదివున్నట్టుగా చదవాలి గాని విడిగా చదివితే అర్థం యేమీ లేదను కుంటున్నాను. మనం ఎప్పుడయితే map సరైనది కాదని census లో వ్యత్యాసాలు బాగా వున్నాయని అంటున్నామో అటువంటప్పుడు మన case ను justify చేసుకోడానికి ఎన్నో precautions తీసుకోవలసివుండె అయితే యీ రిపోర్టు చూస్తే అటువంటి precautions ఏ విధముగా తీసుకోవాలో ఆ విధంగా తీసుకోలేదని మాత్రం స్పష్టమవుతుంది. తరువాత 4 principles ను ఒప్పుకోవడం జరిగింది. అయితే ఆ principles ను తుణ్ణంగా ప్రతి గ్రామానికి వర్తింప చేస్తే ఆ ప్రకారం మనకు న్యాయం జరిగిందా, లేదా, అన్నది కూడా విచారించవలసిన అవసరంవుంది. శ్రీ పటాస్కర్ తన రిపోర్టు సమ

ర్పించిన తరువాత ఆ రిపోర్టును శాసనసభ్యుల దృష్టికి తీసుకువచ్చి దానిపై సమగ్రచర్చ జరిగిన తరువాత మంత్రులలో, ముఖ్యమంత్రులలో ఏదయినా ఒప్పం దానికి వచ్చినట్లయితే బాగుండేది అటువంటి అవకాశం కల్పించకుండా ఏదో ఒకటి commit చేయడం, తరువాత వెనక్కు రావడానికి prestige అడ్డు అను కోవడం యీ విధముగా సమస్యలను చెడగొట్టడం తప్ప మరేమి జరుగదు. అటువంటిది ఒక పొరపాటు లేక wrong step జరిగిందని చెప్పక తప్పదు ఇప్పటి కయినా అక్కడివారు యిక్కడికి రావడానికి సిద్ధంగా లేరని చెప్పారు విస్తీర్ణంలో చూస్తే 5, 6, వేల చదరపు మైళ్ళు పోతుంటే జనాభా చూస్తే చాలా ఎక్కువ సంఖ్యలో యిప్పుడు ఆంధ్రరాష్ట్రంలో వున్నవారు ఆ ప్రాంతా నికి పోతున్నట్లు కనపడుతున్నది ఈ విధంగా మొత్తంమీద border సమస్య గురించి ఎన్నో సంవత్సరాలనుంచి ఎంతో ఆందోళన చేసి ఏదో మనం సాధిస్తాం అనుకుని చివరకు దానిని పోగొట్టుకోవడం సమంజసముగా లేదని నే ననుకుం టున్నాను. ఇప్పుడు శ్రీ కళా వెంకటరావుగారు, "అక్కడవారు ఇక్కడకు రాకుండా యిక్కడవారు అక్కడకు పోకుండా status quo వుంటే బాగుం టుంది" అని చెప్పడం కూడా జరిగింది

పెద్ద ఆందోళన జరిగిన పిదప, ఈ border dispute జరిగిన తరువాత ఈ అభిప్రాయానికి రావటం సరైనది కాదని నేను భావిస్తున్నాను

మిస్టర్ స్పీకర్ వారు అట్లా అనలేదు మనవాళ్ళూ వుండాలి మన వాళ్లు అక్కడనుండి రావాలి అని అన్నారు

శ్రీ పి నరశింగరావు. మనవాళ్ళు వుండి, వారుకూడా అక్కడనుండి వస్తే చాలా సంతోషము అది జరుగక ఎక్కడివాళ్ళు అక్కడవున్నా విచారం లేదు అయినా యింకా చాలా సమయం వున్నది ఏ ప్రిన్సిపుల్‌ను బేసిస్‌గా చెప్పుకొన్నారో అందులో అన్యాయం జరిగిందని గౌరవసభ్యులు చాలామంది చెప్పారు. తగు విధముగా ఆలోచించి ఆ అన్యాయమును దూరముగా చేయటా నికి తగిన చర్యలు తీసుకోవాలని ప్రభుత్వమునకు మనవిచేస్తూ సెలవు తీసుకుంటున్నాను.

* శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య : అధ్యక్షా, పెద్ద సమస్యగావున్న విశా లాంధ్ర సాధనలో మనం చిన్న సమస్యలను దూరంచేశాము S. R. C పరిశీలన సమయంలో చిన్న సమస్యలపైగాక మన దృష్టిని ప్రధానమైన సమస్యపై కేంద్రీక రించాము విశాలాంధ్ర సాధించాము. కాని ఆనాడు చిన్నసమస్యలలో వచ్చే

పడ్డాము ఒకవిధంగా heads ను gain చేశాము Tails ను పోగొట్టుకొన్నాము బార్డర్స్ (సరిహద్దు) విషయములో ఆంధ్రప్రభుత్వం తరపున శ్రీ కళా వెంకట రావుగారు శ్రీ సంజీవరెడ్డిగారు గట్టిగా పనిచేశారని నేను చెబుతున్నాను మొదట ఒక అభిప్రాయానికి వచ్చినప్పటికి తరువాత తమ అభిప్రాయాన్ని మార్చుకొని మద్రాసు ప్రభుత్వపు "మొండిపట్టు" కు గట్టిగా సమాధానంచెప్పి హోసూరు సమస్యను మీరు చర్చించకపోతే, మీతో మాట్లాడే అవసరమే మాకు లేదని ఖచ్చితంగా చెప్పి ఆంధ్రుల అభిమానాన్ని వారు చూర గొన్నారు మనం పంపించిన శ్రీ భీమశంకరంగారు అక్కడవున్న అర్బుద నాదన్ వారిద్దరుకలిసి వేసిన అంకెలలో అర్బుదనాదన్ డామినేట్ చేశాడేమోననే అభిప్రాయం రెవిన్యూమంత్రికూడా వెల్లడించారు మనం వేసిన అధికారి మనకు అన్యాయము చేశాడు ఆ సమయంలో కాస్త 'తాత్సారము' వహించిన ఫలితం మనమందరము పొందవలసివచ్చింది 'మాకు పాత స్లిప్స్ దొరకలేదు కనుక ఏమిచేయాలో తెలియని పరిస్థితి మాకు ఏర్పడిందని' అర్బుదనాదన్ తమ రిపోర్టు తయారు చేసేటప్పుడు వ్రాశారు మనకు హోసూరు సమస్యమీద వివాదం వచ్చింది ఆ హోసూరు సమస్యను పరిష్కరించటానికి శ్రీ పటాస్కర్ వచ్చారు ఆంధ్రమహాసభ తరపున అధ్యక్షా, మీరు థార్ కమిషన్‌కు పంపిన రిపోర్టులోను అటుతరువాత అనేకసార్లు హోసూరు ఆంధ్రభాగములో వుండాలని మనం కోరుతూవచ్చాము ఆంధ్ర ఉద్యమము 1913 లో పుట్టింది నాయకులందరు జాతీయ ఉద్యమములో జైళ్ళకు వెడితే జస్టిస్ పార్టీవారు మంత్రివర్గంలోనికివచ్చి ఎప్పటికైనా ఆంధ్రులు హోసూరును అడుగుతారేమో ! కనుక ఇది బోర్డర్‌గా వుండటానికి వీలులేకుండా వేపనపల్లి ఫిర్కాను 1921 లో కృష్ణగిరికి కలిపారు దానివల్ల హోసూరు దూరమై కృష్ణగిరి బోర్డర్ కావటంజరిగింది అయినా 'కృష్ణగిరికూడా చర్చలోనికి వస్తే గాని మేము చర్చలకు రాము' అని ఆంధ్రప్రభుత్వం చెప్పింది అర్బుదనాధన్ రిపోర్టుపై ఆధారపడిన map ను మదరాసు ప్రభుత్వం మన మంత్రులముందు పెట్టింది. అదే map ను పటాస్కర్‌కు ఇచ్చింది. దాని ప్రకారం పటాస్కర్ రిపోర్టు వ్రాశారు 'దానిని మేము అంగీకరించము' అని మన మంత్రులు త్రోసి వేశారు అదే కళావెంకటరావుగారు చదివి వినిపించారు. "The accuracy of this map is challenged by the representatives of Andhra" అని వారి రిపోర్టులో వుంది. ఆంధ్రనాయకులుగా వెళ్ళినవారు వారిచ్చిన మ్యాపును ఛాలెంజి చేశారని చెప్పారు. అందుకు సంతోషం అయితే దానికిబదులు మీరు మరోమాప్ ఎందుకు ఇవ్వలేదు ? అని పటాస్కర్ మనలను ప్రశ్నించారు. "మాకు అన్యాయం జరిగింది. కృష్ణగిరి, హోసూరు సమస్యను కూడా తీసుకు

రాకతప్పదని మరల మన ప్రభుత్వం అడిగినపుడు సంజీవరెడ్డిగారు ఒక map ను ఇచ్చారు వారి రిపోర్టులో 24 పేజీలో ఇలావుంది.

"Shri Sanjeeva Reddy also handed over at the time a map of this area and stated that certain villages in Krishnagiri taluk, which had a population of over 50 per cent of Telugu speaking people and which were on the border had not been included in Andhra and that the matter should be re-examined" రెండవ map ఇచ్చిన ఫలితంగా, ఎంత జనాభా వుందని మూడు గ్రామాలను మనం సాధించుకోగల్గాము అంతవరకు సంతోషమే శ్రీ పటాస్కరు ఆ నిర్ణయం తీసుకొన్నప్పుడు మైసూరుప్రభుత్వం ఒక ఉత్తరం వ్రాసింది హోసూరు సమస్య మాకు ప్రసక్తి వుందని ఆ ప్రభుత్వం వ్రాసింది దానికి శ్రీ కామరాజనాడారు అడ్డంచెప్పారు ఇది ఆంధ్ర, మద్రాసు సరిహద్దులకు సంబంధించినది కాని మైసూరుకు ఏమీ సంబంధంలేదని చెప్పారు 1921 లో హోసూరు తీసుకుపోయిన political motive ను మనం పంపకం చేసుకొనకపోతే అసలు basis ను అర్థం చేసుకోలేము అందువల్ల కేంద్రప్రభుత్వము ఈ political motive కు పూర్వపు historical incidents, లేక accident ను జ్ఞాపకం చేసుకోవలసిన అవసరమున్నది హోసూరు తాలూకా గురించి శ్రీ భక్తవత్సలంగారు చెప్పినదానిని 22-1-56 హిందూ పత్రికనుండి నేను ఇది చదువుతున్నాను వారిలా అన్నారు

"As a Minister in charge of Forests, he was personally sorry that the forest areas of Shencotta taluk would not be forming part of this State, which was rather poor in forest resources. But against this, Gudalur and Hosur taluks, where the Tamil population was not in a majority would be retained in the State. The Madras Government laid claims, in these two taluks on grounds other than linguistic"

(Hindu dated 22-1-1956).

లింగ్విస్టిక్‌గా హోసూరులో హక్కులేదని వారు చెప్పారు. తమిళ నాడుకు భాషావాదులలో నాయకులైన గ్రామిణి 10-9-56 న ఇలా చెప్పారు అది ఇండియన్ ఎక్స్‌ప్రెస్ నుండి చదువుచున్నాను

"... The Tamilians in Hosur were a minority representing about 21 per cent of the population. If the wishes of the majority people of that area were in favour of merging it with the State which they should legitimately go, the Tamil Nad North Boundary Committee would not have any objection".

అందుచేత claim చేసేహక్కు లేదని వారే ఒప్పుకున్నారు వేపన పల్లితో సహా హోసూరు తాలూకాలో 1901 లో జనాభా లెక్కల ప్రకారం డైరెక్టరు ఇలా వ్రాశారు

'In the Hosur taluk of Salem district, 54% of the people speak Telugu 33% Canarese, but elsewhere Tamil prevails"

(*Census of India* 1901, *Chapter VI, Vol XV, Part I, Page* 99).

In 1951, Government census Telugu 43.1%

In border Census of 1955, Telugu 38 4%

1901 లో 54% వుంటే 1954 లో 43% వుంది ఈ రెండుకూడా గవర్నమెంటువారు తీసిన లెక్కలు కాని శ్రీ భీమశంకరంగారితో కలిసి తయారుచేసిన లెక్కలలో 38% వుందని చెప్పారు 1951 నుండి 1955లోగా ఎంతమార్పు వచ్చినదో మనమంతా గమనిస్తూనే వున్నాము ఇదంతా ప్రధానంగా అర్బుదనాదన్ చేశారు మన ప్రభుత్వంమీద ఒక్కటే నేరం వేయదలచు కున్నాను పటాస్కర్ కు రెండవసారి ఇచ్చిన map కొద్ది early గా ఇచ్చివుంటే హోసూరు కూడా మనకు వచ్చివుండేది హోసూరు తాలూకా బోర్డర్ లో లేదని చెప్పడం న్యాయంకాదని మనవి చేస్తున్నాను హోసూరు తాలూకా సేలం జిల్లాలోనిదికాని కృష్ణగిరి తాలూకాలోనిభాగం కాదు వేపనపల్లి ఫిర్కాకు కలిపారు కనుక మనం వదులుకోవలసి వచ్చినది

అయితే, మైసూరుప్రభుత్వం కూడా ఒకభాగం అయినరోజున దీనిని మళ్ళా పునర్విమర్శ చేయడానికి అవకాశం వున్నది అంటే యింకొకవిధంగా raise చేయవచ్చును. కాని ఇక్కడ ఒక అన్యాయపుతీర్పు జరిగింది కృష్ణగిరికి అనుకొని contiguity ఉన్నదా లేదా అని. 16, 23, 24 గ్రామాలను మనకు యిచ్చారు. ఆ ప్రక్కనేఉన్న 17 వ గ్రామంలోని జనాభా లెక్కలను చూస్తే కన్నడులు 48%, తమిళులు 3.9%, ఆంధ్రులు 45 8% ఉన్నారు ఈ లెక్కలనుబట్టి ఆ గ్రామం ఎవరికి చెందాలి ? ఈ ఇద్దరిలో ఆంధ్రులకు చెందాలని clear గా అగుపడుతున్నది. మైసూరు ప్రభుత్వానికి పోవడానికి హక్కులేదని మద్రాసు ప్రభుత్వం చెప్పింది. ఈ నిర్ణయం చేసేసందర్భంలో మైసూరుప్రభుత్వపు ప్రసక్తిని అంగీకరించలేదుకదా ! కనుక మనకు రావడానికి అభ్యంతరం లేదు ముగ్గురినీ కలిపి తేల్చుకోమని అపినారా ? అంతవరకు పూర్తిగా Central Government administration లో వుంచి, తేల్చమని చెప్పినట్లయితే యింకొకవిధంగా ఉండేదేమో. అట్లాకాకుండా, మైసూరు ప్రభుత్వానికి హక్కులేదని మద్రాసు

ప్రభుత్వం చెప్పింది, కనుక యిక వారిని అడగకూడదని acecpt చేశారు అప్పుడు యిక రెండుపార్టీలే ఉన్నాయి ఒకపార్టీ ఆంధ్రప్రభుత్వం, రెండవ పార్టీ మద్రాసుప్రభుత్వం మద్రాసు ప్రభుత్వానికి ఉన్నహక్కు 39 మీద ఉన్నది. ఆంధ్రప్రభుత్వానికి ఉన్నటువంటి హక్కు 45 8 మీద ఉన్నది ఇప్పుడు జడ్జిమెంటు 45 8 కి యివ్వవలెనా, లేక 39 కి యివ్వవలెనా ? అందువల్ల పటాస్కర్ గారు యిక్కడ పూర్తిగా పొరపాటు పడినారని చెప్పక తప్పదు అట్లాగే 19, 20, 10, 11 గ్రామాలను చూచినట్లయితే హోసూరుకు మనకు contiguity maintain అవుతున్నది 19వ గ్రామంలో కన్నడులు 18%, తమిళులు 15 6%, తెలుగువారు 83 3% ఉన్నారు ఇక్కడకూడా కన్నడులు లెక్కలోకిరారు 15% తమిళులు, 83 3% ఆంధ్రులు ఉన్నారుకనుక యిది ఆంధ్రకే రావలసియున్నది ఇక 10వ గ్రామంలో కన్నడులు 26 5% తమిళులు 26 9% ఆంధ్రులు 42 7% ఉన్నారు అందువల్ల 42 7% ఉన్న ఆంధ్రులకే యిది రావలసిన అవసరమున్నది ఇంతేకాదు, ఇంకొక చిన్న ఆశ్చర్యమున్నది ఆంధ్రకు యిదివరకు మునగాల పరగణా ఉన్నట్లు, హోసూరు తాలూకా లెక్కలలో చిగురుపల్లి అనే గ్రామం ఉన్నది, ప్రాంతం మాత్రం యీ మధ్యలో యిరుక్కున్నది ఈ గ్రామం హోసూరు తాలూకా లెక్కలలోవుంది గ్రామంమాత్రం కృష్ణగిరి తాలూకాలో కలిసిన వేపనపల్లి ఫిర్కాలో ఉంది అది enclave అన్నారు దానిని హోసూరు తాలూకాకు చేర్చాం అంటారు రెవిన్యూ లెక్కలలో చేర్చినప్రాంతం కృష్ణగిరి తాలూకాలోనే ఉన్నదికదా ? ఇది అన్యాయం ఏ ప్రాంతానికి ఆనుకొని, ఏ ప్రాంతం మధ్యలో ఉన్నదో ఆ pocket అక్కడి area కే దానిని కలపాలి అలా కల్పినట్లయితే, 4% కన్నడులు, 15 5% తమిళులు, 78 4% ఆంధ్రులు ఉన్నారు కనుక యీ గ్రామంకూడా 78 4% ఉన్న ఆంధ్రులకే వచ్చింది కాబట్టి మనం కొత్తగా ఆంధ్రప్రాంతం అడుగుటలేదు Border కు పరాసరి గానే వచ్చింది. ఇది మనకు రావలసిన అవసరమున్నది. హోసూరు తాలూకా లోని కృష్ణగిరిని కూడా పూర్వపు political accidents ను, history ని జ్ఞాపకం ఉంచుకొన్నట్లయితే, జాతీయ ఉద్యమానికి వ్యతిరేకంగా వచ్చిన జస్టిస్‌పార్టీ వర్గం ఆ రోజున ఆంధ్ర ఉద్యమాన్ని దెబ్బగొట్టడానికి పునాదులు వేసుకొని పనిచేసినందువల్ల మనం దీనిని వ్యతిరేకించవలసిన అవసరం ఉన్నది

మిస్టర్ స్పీకర్ : పటాస్కర్ రిపోర్టు ఒకటి వచ్చింది, ఏమిచేయాలో, చెప్పండి, ఏమిచేయమంటారు ?

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య పటాస్కర్ గారి రిపోర్టును 'as it is' గా అంగీకరించడానికి వీలులేదని నా అభిప్రాయం మన ప్రభుత్వం పటాస్కర్ రిపోర్టును పూర్తిగా ఒప్పుకొన్నట్లు లేదు సంజీవరెడ్డిగారు తాము చెప్పిన విషయాలను ఒక statement లో నిన్ననే సెలవిచ్చారు

"The discussion of the Pataskar Report on the floor of the Andhra Pradesh Legislative Assembly is meant only to fulfil a constitutional propriety, and it does not indicate that the Government could get it altered or modified", said Mr N Sanjiva Reddi addressing a Press Conference this morning.

The Chief Minister explained that the legislators had to express their views before a bill embodying the recommendations of the Report was placed before the Parliament Himself and the Chief Minister of Madras, Mr K Kamaraj, had entered into 'gentlemen's agreement' accepting the report on behalf of the respective Congress parties But the legislature had also to be consulted. Mr Pataskar's Report itself had no constitutional sanction, unless that was accepted by the Parliament Now that the Zonal Council had also accepted the Pataskar Report, it had become a *fait accompli*" అని వారు చెప్పినట్లు ప్రచురింపబడింది

Constitutional position ను discuss చేయడానికి మన ప్రభుత్వం యొక్క position ను explain చేశారు రెండు కాంగ్రెసు పార్టీల తరఫున మేము ఒప్పుకున్నాము అని చెప్పారు అంటే ప్రభుత్వాల తరఫున కాదు. ఈ contradiction నాకు అర్థంకాలేదు ప్రభుత్వాలు ఒప్పుకోలేదన్నారు సంజీవరెడ్డిగారు, కామరాజనాడారు గారు కలిసి పటాస్కర్ గారి మీద ఉండే గౌరవంతో ఒప్పుకొన్నారని ఉన్నది దీనిని పార్లమెంటు accept చేయాలంటారు, Zonal Committee ఒప్పుకుంది అన్నారు ప్రభుత్వ పద్ధతిని accept చేయని పరిస్థితి లేకపోయినట్లయితే సరాసరి Zonal Committee కి ఎట్లా పోయింది ? Zonal Committee కి అంత power ఉన్నదా అనే విషయంలో నాకు అనుమానం ఉన్నది. ప్రభుత్వాలు ఒప్పుకొని, వారిలో వివాదాలు వచ్చివుంటే ఆ వివాదాలలోనికి పోవాలి, కాని రెండు కాంగ్రెసు పార్టీల వైపు నుంచి, యిద్దరు నాయకులూ ఒప్పుకున్నది, Zonal Committee ఒప్పుకోవడం ఆంధ్రుల యొక్క అభిప్రాయానికి వ్యతిరేకం మొత్తం ఆంధ్రకు సంబంధించిన properties పంపకం కూడా యిప్పటికే పరిష్కారం అయినట్లులేదు కన్నడ ప్రాంతంలోని కోలారు, హోసూరు, ప్రాంతంలోని బళ్లారి లేక మహారాష్ట్ర సరిహద్దుగా వున్న ప్రాంతాలు మద్రాసులో వున్నా - ఒరిస్సా సరిహద్దు బస్తరులోని, పర్లాకిమిడి ప్రాంతాలు—వీటన్నింటిని గురించి ఆంధ్రులు

claim చేయవలసిన అవసరంఉన్నది ఇందాక ఈ claim సంగతిచెబుతూ కొన్ని వేల complaints ఉంటాయన్నారు శ్రీ వెంకట్రావుగారు Boundary Commission వేయిమనండి మన సమస్యలన్నీ ఆలోచించుకుందాము మనకు రావలసినది ఒక్క అంగుళం కూడా పోకూడదు ఇతరులది మనకు కావాలనే దురభిమానం లేదు మనకు భాష మీద వుండే స్వచ్ఛమైన అభిమానంతో నేను చెబుతున్నాను ఈ కోరికను కోరవలసిన అవసరంఉన్నది దీనిని కోరుతూ, ప్రస్తుతం యీ పటాస్కర్ రిపోర్టును దూరంగా ఉంచితే బాగుంటుందని నేను అభిప్రాయపడు తున్నాను

శ్రీ యన్ వెంకయ్య (అద్దంకి) అధ్యక్షా, ఆంధ్రులకు సంబంధించిన చాలా లాభకరమైన ప్రధానాంశాలను నేను చెప్పవలసి యున్నది

మిస్టర్ స్పీకర్ మీరు దయచేసి కూర్చోండి

శ్రీ షేక్ మౌలాసాహెబ్ (ఉదయగిరి) అధ్యక్షా, నేను చెప్పవలసిన విషయాలున్నాయి దయచేసి 5 నిమిషాలైనా పర్మిషన్ యివ్వండి

మిస్టర్ స్పీకర్ . ఇంకా మాట్లాడేవారు ముగ్గురున్నారు ఒక్కొక్కరికి 3 నిమిషాలు యిస్తాను. కాబట్టి 3 నిమిషాలే మాట్లాడండి

*శ్రీ షేక్ మౌలాసాహెబ్ అధ్యక్షా, ఇప్పుడు ఒక భారతం జరిగినట్లు జరిగింది నేను మళ్ళీ ఆ భారతమంతా చెప్పవలసిన అగత్యంలేదు. అయితే, కొన్ని విషయాలు మాత్రం ముఖ్యమంత్రిగారి దృష్టికీ, రెవిన్యూ మంత్రిగారి దృష్టికి తీసుకురావలసి ఉంటుంది మద్రాసునుంచి మనం విడిపోయేటప్పుడు ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రం కావాలని మనం అరవ రాష్ట్రం కావాలని అరవ వారు అన్నప్పుడు మొత్తంమీద ఆంధ్ర నాయకులలో అభిప్రాయభేదాలు ఏర్పడి మద్రాసునుంచి మనం చీలివచ్చి కొన్ని షరతులప్రకారం ఆంధ్రరాష్ట్రం సాధించుకొన్నాము అప్పటిలో, మనకు మద్రాసుమీద వుండే హక్కు ఎంత అనేదికూడా నిర్ధారణ లేకుండా పోయింది.

మిస్టర్ స్పీకర్ : ఇది మద్రాసు పట్టణానికి సంబంధంలేదు.

శ్రీ షేక్ మౌలాసాహెబ్ : ఆంధ్రరాష్ట్ర రాజధాని ఎక్కడ నెల కొల్పాలనే విషయమై బెజవాడలోనా, మరొకచోటా అనేదాంట్లోకూడ బేదాభి

ప్రాయాలుండి చివరకు ఏదో ఒక కర్నూలులో నెలకొల్పామనుకోండి తరువాత మళ్ళీ ఆంధ్ర ప్రదేశ్ ఏర్పడింది దీనికి రాజధానిగా హైదరాబాదు సంక్రమించింది. పెద్ద పెద్ద భవనాలతో ఉన్న పట్టణం మంచి భవనాలున్నాయనే సంతోషంతో మన సరిహద్దు ప్రాంతాలను పోగొట్టుకోకూడదు అయితే, రాజకీయ రహస్యాలద్వారా ఆంధ్రప్రదేశ్ ఏర్పడడంతో అరవ రాష్ట్రం వారికి ఇండియా ప్రభుత్వంలో ఉండే పలుకుబడి, సహాయం అప్పుడు కావలసి వచ్చింది ఆ సహాయం కావలసి వచ్చినందువల్ల చేసినందున యిప్పుడు మనం వారికి సరిహద్దు సందర్భాలలో తలఒగ్గవలసి వచ్చిందని వారు చెప్పినట్లు అంగీకరించవలసినదేనా ?

జనాభా ప్రాతిపదికపైనచూస్తే, Central Station ఎగుమతి దిగుమతులు రాకపోకలు చూస్తే ఆ ప్రాంతం అంతాకూడా ఆంధ్రకు చేరాలి కాబట్టి ఈనాడు మదరాసులో ఆంధ్రులకు అంత జనాభా ఆస్తి హక్కు ఉన్నది ఆంధ్రలో మదరాసుకు పోయేవారు, వచ్చేవారు తక్కువయని చెప్పినారు. మంత్రిగారు హద్దుల నిర్ణయంలో ఎక్కడో తిరుపతిలోని బొమ్మలనుగురించి సామెత చెప్పారు అచట మన కట్టడాలకు పోలిన మనగుర్తు భవనాలు ఉన్నాయి కాని అక్కడ మంచి నీరుత్రాగే చెరువుకు తురకవారిచెరువు అంటారు హైకోర్టుకు మంచి భవనాలున్నాయి అవిఅన్నీ ఆంధ్రులపేరులు, కట్టడాలు మన నమూనాలు

మిస్టర్ స్పీకర్ ఇంతకీ, యిప్పుడేమంటారు ?

శ్రీ షేక్ మౌలాసాహెబ్ వాటిని అంగీకరిస్తూ, మనలోవుండే లోపాలను కొంతవరకూ సర్దుబాటు చేసుకోవాలి. జనాభా ప్రాతిపదికపైన చూస్తే మద్రాసులో మన జనాభా 75% ఉన్నది అది వదలుకున్నాము. సరిహద్దు విశేజెస్‌లో కొద్ది తేడాలుకొరకు మన ఆంధ్రప్రాంతం పోగొట్టకుండా మనవారి కష్టాలు గుర్తించాలి.

మిస్టర్ స్పీకర్: ఇక మీ ఉపన్యాసము ముగించండి.

* శ్రీ పి. రాజగోపాలనాయుడు (తవనంపల్లి): అధ్యక్షా, ఇప్పుడు మనకు రెండు భాషాప్రాంతాల సమస్యలున్నాయి. ఒకటి ద్విభాషాప్రాంతానికి సంబంధించినది. రెండవది మూడు భాషలున్న ప్రాంతాలకు సంబంధించినది. పటాస్కరుగారి నివేదికలో ద్విభాషా ప్రాంతానికి సంబంధించి మాత్రమే వారు

ఒక నిర్ణయం చేసినారని తెలుస్తోంది త్రి భాషాప్రాంతానికి సంబంధించి యింత వరకూ నిర్ణయం చేయబడలేదు

"There was no agreement with regard to the trilingual areas in dispute between the parties These are areas in which neither the Tamils nor the Telugus have a population of over 50 per cent Such areas are mainly situated at the eastern end of the border and are in the two taluks of Hosur and Krishnagiri" అని అన్నారు.

"There is no agreement between Andhra and Madras about the basis of the settlement of any trilingual area. A triangular dispute regarding a trilingual area can be settled only at the instance of all the three parties" అని అన్నారు

అంతే కాకుండా revised report లో కూడా ఒక మాట అన్నారు.

"So the question of transferring any Telugu villages in Hosur taluk to the State of Andhra will and can arise only if such a link can be created by transfer of certain Telugu villages from Krishnagiri taluk to Andhra State on the basis of principles to which both the Governments of Andhra and Madras had agreed and on which my report has been based"

కనుక ఇదివరకు పటాస్కర్ గారి report లో, హోసూరును గురించి కాని కృష్ణగిరి తాలూకాలో వేపనపల్లి ఫిర్కాలో ద్విభాషా ప్రాంతాలుగా ఉన్నటువంటి గ్రామాల విషయంలో ఆయన ఏ decision కూడా యిచ్చి ఉండలేదు కాబట్టి ఆ decision యివ్వమని యిపుడు కోరవలసి యున్నది. Trilingual areas కు సంబంధించి ఈ నాడు Pataskar Report లో ఏ నిర్ణయం చేయబడలేదు. కాబట్టి దానిని యిపుడు మరల reopen చేసేదానికి వీలున్నది. దానిని reopen చేయమని మన ప్రభుత్వం వారు ప్రత్యేకంగా కోరవలసి ఉంటుంది. Trilingual area ను గురించి ఏ decision కూడా లేదు.

మిస్టర్ స్పీకర్ : కనుక ఏమిచేయమంటారు ?

శ్రీ పి రాజగోపాలనాయుడు : అందువల్ల రేపు Centre లో ఈ విషయంలో రాబోయే Legislation ను, ఈ trilingual areas ను గురించిన నిర్ణయం కానిదే చేయకూడదని, ఈ నిర్ణయం జరిగేవరకు ఆ legislation ను ఆపవలసి ఉంటుందని మన ప్రభుత్వంవారు కోరాలి. ఈ విషయంలో మద్రాస్

గవర్నమెంట్, ఆంధ్రప్రదేశ్ గవర్నమెంట్ 4 points మీదనే agree అయినారు కాని simple majority అనే విషయంలో వీరికి agreement కుదరలేదు Trilingual areas లో simple majority విషయమై యింకా నిర్ణయం కావలసి యున్నది దానిని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం కేంద్ర ప్రభుత్వంద్వారా వెను వెంటనే చేయవలసి యున్నది

*శ్రీ ఎన్. వెంకయ్య అధ్యక్షా! పటాస్కర్ గారి రిపోర్టు చాలా అన్యాయంగా ఉంది దానిని మనం వ్యతిరేకించవలసి వున్నదని నేను మనవి చేయుచున్నాను ఏ సిద్ధాంతాలను ప్రాతిపదికగా చేసికొని ఆయనను ఈ report ను యివ్వమని నియమించడం జరిగిందో— ఆ సిద్ధాంతాలకు ద్రోహంచేస్తూ ఆయన రిపోర్టునుయివ్వడం జరిగింది ఆయన సూచించిన సిద్ధాంతాల ననుసరించి చేసినట్లయితే తిరువళ్ళూరు, హోసూరు తాలూకాలలో కొన్ని ప్రాంతాలు, పొన్నేరి తాలూకాలో కొన్ని ప్రాంతాలు మనకు తప్పక వచ్చితీరాలి కృష్ణగిరి, గుడియాత్తం వగైరా ప్రాంతాలు కూడా రావలసిఉంటుంది ఇంకా కేవలం అక్రమమైనటువంటి అర్చుదనాధన్ report ననుసరించి అయినాసరే, వారిచ్చిన map ప్రకారమైనాసరే 62 గ్రామాలు తెలుగువారికి సంక్రమించవలసిఉంటాయి తిరుత్తణి తాలూకా మధ్యభాగంలో 32 గ్రామాలు మాత్రమే అరవ గ్రామాలు ఉన్నాయి కాబట్టి ఆయన సూచించిన సిద్ధాంతాలకు చాలా వ్యతిరేకంగా, పక్షపాతంతో ఈ రిపోర్టు తయారైంది న్యాయమైన సిద్ధాంతాల ననుసరించి అయితే ఇంకా ఏ 6 లక్షల మంది ఆంధ్రులో మన రాష్ట్రంలోకి రావలసిఉంది కాని ఈరోజున 90 వేలమంది అటు పోవడము, 30 వేలమంది అరవలు మాత్రం ఇటు రావడం జరుగుతోంది మొత్తం 40 లక్షల మంది ఆంధ్రులు తమ రాష్ట్రంలో లీనమౌతుంటే సంతోషించక సరిసమానమైన జనాభాఉన్న తిరుత్తణి తాలూకాను కూడా కాజేయడానికి మద్రాసు ప్రభుత్వం పన్నిన కుట్రలో మన ప్రభుత్వం పడిపోయిందని నేను అంటున్నాను.

శ్రీ పి. సుందరయ్య అధ్యక్షా, ఈ సరిహద్దు సమస్యలను చర్చించేటప్పుడు ఆవేశాలు, హృదయావేదనలు తప్పకుండా వస్తాయి మన శాసనసభలో మనం చర్చించేటపుడు మనకు యేరకంగా హృదయావేదన ఉంటుందో అదేవిధంగా మనతోటి భారత సోదరులైనటువంటి తమిళ ప్రజలు కానీ, కన్నడప్రజలు కానీ, ఈ సరిహద్దు సమస్యలను గురించి చర్చించుకునేటప్పుడు వాళ్ళుకూడా హృదయావేదనతో ఆరాట పడతారనే, సంగతి కూడా మనం మనస్సులో పెట్టుకొని చర్చించితే ఎవరికీ నష్టం కల్గకుండా అందరికీకూడా న్యాయం కలిగే, రీతిగా మనం ఈ విషయం పరిశీలించి, పరిష్కరించుకొనే దానికి అవకాశం

ఉంటుంది. నేను పటాస్కర్‌గారి report ను చాలా జాగ్రత్తగా పరిశీలించాను 1931 వ సంవత్సరపు census లెక్కలనుబట్టి 1951 వ సంవత్సరపు లెక్కలనుబట్టి వాటన్నిటినీ జాగ్రత్తగా చూచాను పటాస్కర్‌గారు అంగీకరించిన సూత్రాలను వర్తింపచేయడంలో కొన్ని చిన్నచిన్న లోపాలను మాత్రం మీ దృష్టికి తీసుకువస్తాను కాని ఆ లోపాల సంగతి అటుంచి దానిని మనం award క్రింద పరిగణించినా, ఆ లోపాలను ఆంధ్రప్రదేశ్, మద్రాస్ ప్రభుత్వాలు కూర్చుని, ఇద్దరికీ నష్టం కలుగకుండా పరిష్కరించుకోవచ్చును ఆ సూత్రాలను వర్తింపచేయడంలో లోపాలుండడంవల్ల యిద్దరికీ నష్టం కల్గింది. ఆంధ్రప్రదేశ్‌కు ఏ విధంగా అయితే నష్టం కలిగిందో అదేవిధంగా తమిళనాడుకు కూడా కొన్ని నష్టాలు కల్గినాయి ఆ ఉదాహరణలను తరువాత తెలియచేస్తాను. అటువంటి లోపాలను సరిదిద్దుకొనే దానికి మళ్ళీ పటాస్కరుగారి దగ్గరకు వెళ్ళ దానికన్న, ఇద్దరికీ నష్టం కలిగిన విషయాలలో మార్పులు చేసుకోవడానికి ఆంధ్రప్రదేశ్, మద్రాస్ ప్రభుత్వాలు ఒక ఒడంబడికకు వచ్చేదానికి యిప్పటికి మించిపోయిందిలేదు ఈ చిన్నచిన్న వివరాలకు వెళ్ళేముందు ఒక విషయం చెప్పదలచుకున్నాను

ఈపటాస్కర్ రిపోర్టు ఈసరిహద్దు సమస్యలకు పరిష్కరించేదానికి States Reorganisation Commission కన్న ఒకఅడుగు ముందుకు వేసినది. తాలూకానో ఫిర్కానో, తాలూకానో, జిల్లానో ప్రాతిపదికగా తీసుకొని States Reorganisation జరిగిన సరిహద్దులలో గ్రామం పునాదిగా తీసుకొని పరిష్కారం చేయాలని, దానికి contiguity నే ఆధారంగా తీసుకోవాలని, మధ్యన pockets ను ఉండకుండా చూడాలని, అనుకున్నాము సాధ్యమైనంతవరకు ఆ రకంగా చేస్తున్నప్పుడు natural boundaries ఉండాలని, అంటే - కొండలు, నదులు వీటితో పాటు ఏవైనా ప్రాజెక్టులు, ఒకచోట ప్రారంభమై ఇంకొకచోట ఆగేటటు వంటివి ఉంటే వాటిని సరిహద్దులుగా అంగీకరించాలని అనుకోవడం జరిగింది. ఈ సూత్రాల ననుసరించి 564 సరిహద్దు సమస్యలు మొత్తం భారత దేశంలో వుండే వివిధ రాష్ట్రాల మధ్యన పరిష్కారం కావలసి ఉన్నవి. ఈ సూత్రాల ననుసరించి సరిగా పరిష్కారం చేసుకోడానికి ప్రయత్నిస్తే ఒకరికి ఇంకొకరికి మధ్య విద్వేషాలు, మనస్పర్ధలు రెచ్చకుండా, సామరస్యంగా పరిష్కారం చేసుకోడానికి అవకాశం ఉంటుంది. ఈ సూత్రాలు యిందుకు చాలా చక్కని పునాదిగా ఉంటాయి. పటాస్కర్ సూత్రాలు ప్రజలలో ఐక్యత, సాధించే దానికొరకు, సుహృద్భావాలను పెంపొందించేదానికొరకు, ఇంకా అనేక సమస్యలు పరిష్కరించేదానికొరకు అవసరమయ్యేటటువంటి మంచి ప్రాతిపదికలతో రూపొందించబడ్డాయి. దీనికి ఒక చిన్న ఉదాహరణ యిస్తాను శ్రీ నిజలింగప్ప

గారు, శ్రీ చవాన్‌గారు బొంబాయి, మైసూరు రాష్ట్రాల సరిహద్దుల విషయంలో, మహారాష్ట్ర సరిహద్దుల విషయములో ఈ పటాస్కర్ సూత్రాలను ఆధారంగా తీసుకొని చేస్తే చాలాబాగుంటుందని ఇద్దరూ కూడా ఒక నిర్ణయానికి రావడం జరిగింది ఆంధ్రప్రదేశ్ మద్రాసు ప్రభుత్వాలు ఈ ప్రాతిపదికల ననుసరించిఉన్న Pataskar Report ను అంగీకరించినందుకు నేను అభినందిస్తున్నానని చెప్పవలసి ఉంటుంది కాని ఈ రిపోర్టులోని సూత్రాలను వర్తింప చేయుటలో కొన్నిలోపాలు జరిగినై దానికి కారణమేమిటంటే contiguity కోసమని గ్రామాలవారీగా తీసుకొన్నప్పుడు, దానిని వర్తింపజేయడంలో మరింత స్పష్టత వివరణ లేకపోవడమే Pockets అనేవి లేకుండా చూడాలన్నప్పటికీ పొన్నేరి తాలూకాలో తెలుగు గ్రామాలవిషయం చూస్తే అచట తెలుగుగ్రామాల తరువాత తమిళగ్రామాలు, తరువాత మరల తెలుగుగ్రామాలున్నప్పుడు, contiguity కోసం, ఆ తెలుగుగ్రామాల మధ్యనున్న తమిళగ్రామాలను కూడా యిటు ఆంధ్రలో చేర్చడం జరిగింది అందుచేత contiguity అనే సిద్ధాంతాన్ని భవిష్యత్తులో సరిహద్దు సమస్యలు పరిష్కరించుకొనేటపుడు యింకా కొంచెం స్పష్టంగా వివరించుకోవాలి ఈ contiguity గ్రామాలు తాలూకాలో వరుసగా వస్తున్నప్పుడు యిబ్బంది లేదు ద్విభాషిక ప్రాంతాలుగా ఉన్నప్పుడు కాని, తెలుగుగ్రామాల తరువాత తమిళగ్రామాలు తరువాత తెలుగుగ్రామాలు, మరల తరువాత తమిళగ్రామాలు ఉన్నపుడు అక్కడ contiguity అంటే pockets లేకుండా చేసుకోవలసి ఉంటుందని చెప్పడము సరిపోదు. Contiguity కోసం చూసేటప్పుడు యీ మిక్సెడ్ ప్రాంతాన్ని గ్రామసముదాయాలుగా తీసుకొని అవి ఎక్కడికి పోవాలి అనేది చూడాలి అంటే ఏప్రాంతమైనా అది 4 గ్రామాల group కావచ్చు, 10 గ్రామాల group కావచ్చు అవి ఎక్కడెక్కడికి పోవాలనే సమస్య వచ్చినపుడు సాధ్యమైనంత తక్కువమంది తమిళప్రజలు మన రాష్ట్రంలోకి వచ్చేటట్లు, అట్లాగే సాధ్యమైనంతమంది తెలుగుప్రజలు తమిళనాడుకు వెళ్ళేటట్లు, చూడాలి అంటే ఈ విధంగా మార్పులు చేయడంలో ఉద్దేశం, ఎక్కువమంది తెలుగుప్రజలు కాని, తమిళప్రజలు కాని minority గా సరిహద్దులలో ఉండకూడదనే ఎంత జాగ్రత్తగా గీతగీసినా minority గా ఎట్లాగూ ఉంటారు. కాని ఎక్కువమంది minority గా ఎక్కువగా ఉండకుండా సాధ్యమైనంతవరకు తగ్గించే దానికోసమే ఈ zones ను ఈ గ్రామసముదాయాలను, mixed గా ఉన్నటువంటి గ్రామసముదాయాలను ఏర్పరచి అటు, యిటు మార్చడంలోగల ఉద్దేశం. ఈ విధంగా మార్చే పద్ధతినమసరించితే కొన్నిచిక్కులు లేకుండా పోతాయి. పటాస్కర్‌గారు ఈ విధంగా ఈ సూత్రాన్ని ప్రత్యేకించి ఇదమిద్ధంగా చెప్పకపోయినా, పొన్నేరి తాలూకాలోని ప్రాంతంలో కొన్ని

తెలుగు గ్రామాలతోపాటు కొన్ని అరవ గ్రామాలను యివ్వడంలో ఈ సూత్రాన్ని అంగీకరించి ఆచరణలో పెట్టారు కాని దానిని consistent గా apply చేయడం జరగలేదు

కంటిగ్యుయిటీ అనే సూత్రాన్ని అప్లయిచేయడంలో లోపాలు ఉండడం వల్ల కొన్ని తమిళ గ్రామాలు తమిళ ప్రాంతాలలో చేరవలసినవి ఆంధ్ర రాష్ట్రంలో ఉండిపోవడం, తెలుగుగ్రామాలు తెలుగు ప్రాంతంలో ఉండవలసినవి తమిళ రాష్ట్రంలో ఉండడం తటస్థించినది కొన్ని వంతులు తెలుగు మెజారిటీఉన్న గ్రామాలు తమిళ రాష్ట్రంలో ఉండడం జరిగింది సరిహద్దు సర్దుబాటు విషయాలు నేను జాగ్రత్తగా పరిశీలించినపుడు ఇటువంటివి కొన్ని ప్రాంతాలు నాకు కనుపించాయి మనకు కొన్ని గ్రామాలు రావాలని మనము కోరడానికి ముందు మనం ఇచ్చుకోవలసినవి మనం గుర్తుపెట్టుకున్నట్లయితే ఉభయులు కొన్ని లోపాలను దిద్దుకోవడానికి వీలుంటుంది ఇందుకు ఉదాహరణంగా కొన్ని గ్రామాల గురించి చెబుతాను సూళ్ళూర్‌పేట తాలూకాలో తడ ప్రాంతంలో 10 గ్రామాలు 11 వేల జనాభా గలవి ఉన్నాయి. వాటిలో 9,500 మంది తమిళ ప్రజలు, 1,500 మంది తెలుగు ప్రజలు ఉన్నారు ప్రళయార్కాడ్‌కు దగ్గరగా యీ ప్రాంతం ఉన్నది దానికి ఆనుకొని తమిళప్రాంతం ఉన్నది తమిళ రాష్ట్రంలో కంటిగ్యుయిటీ ఉన్నది అందుచేత ఏ దృష్టితో చూచినప్పటికి కూడా పటాస్కరు నివేదికలోనిసూచనలను బట్టి ఆ ప్రాంతమంతా తమిళ రాష్ట్రంలో చేరాలి

మొట్టమొదట తమిళనాడులో చేరవలసిన గ్రామాలతో ఆరంభిస్తాను. మనకు రావలసిన గ్రామాలను గురించి తరువాత చెబుతాను. అన్యాయంఅంతా మనకే జరిగిందని చెప్పే విధానం అవలంబించినట్లయితే భారతదేశంలో సోదర ప్రజల మధ్య యీ సమస్యలను పరిష్కరించడానికి అది సరిఅయిన పద్ధతి కాదు కాబట్టి నేను ఆంధ్రుడనుగా, ఆంధ్ర శాసనసభ సభ్యుడనుగా మాట్లాడుతున్నప్పుడు ముందు మనం ఇచ్చుకోవలసినవి చెప్పి ఆ సూత్రం ప్రకారం మనకు రావలసినవి పిమ్మట చెప్పదలచుకున్నాను.

కళిగుండ కుప్పం ప్రాంతంలో 10 గ్రామాలతో పైవాలయం, మల్లినూరు, అడవి చూదూరు మొదలైనవి, వాటిలో 6,700 జనాభాఉంటే వానిలో 3,750 మంది తమిళులు, 1,550 మంది తెలుగువారు. 17 వందల మంది కన్నడిగులు ఉన్నారు. **Absolute** (పూర్తి) మెజారిటీ కూడా తమిళులకే ఉన్నది. అవి కొద్దిగ్రామాలే అనుకోండి. ఐనప్పటికీ కంటిగ్యుయిటీ సూత్రాన్ని

అనుసరించినట్లయితే అవి తమిళనాడులోనికి పోవాలి అదేరీతిగా పొన్నేరి తాలూకాలో పదిర్వేడు, మానల్లూరు, పాహన్‌కుప్పం, సిరివుటాలు పేట - యీ ఒక్కొక్క గ్రామంలో 3 వేల జనాభా ఉన్నది ఇవి తెలుగువారు అత్యధిక మెజారిటీగా ఉన్నటువంటి గ్రామాలు న్యాయంగా ఆంధ్రప్రదేశ్‌లో చేరవలసినవి ఇచ్చట 18 వేల జనాభా ఉన్నది యీ 18 వేలలో 12 వేల మంది తెలుగు ప్రజలు, 6 వేల మంది తమిళ ప్రజలు ఉన్నారు న్యాయంగా యీ గ్రామ సమూహంలో ఉన్న 27 గ్రామాలు ఆంధ్రప్రదేశ్‌లో చేరవలసి ఉంటుంది అదేవిధంగా తిరువళ్లూరు తాలూకాలో కూడా పూసలూరు పేట, వెల్లూరుకోట మొదలైన గ్రామాలు 20 లేక 25 ఉన్నాయి 12 వేల జనాభా ఉన్న ప్రాంతం— వారిలో 7 వేలమంది తెలుగు ప్రజలు, 5 వేలమంది తమిళ ప్రజ లున్నారు 2 వేలే అనుకోండి భేదం వీటిని అట్లనే ఉంచుదామా లేక మార్పు చేసుకుందామా అనేటటువంటిది మనం, మద్రాస్ ప్రభుత్వం చూచుకోవచ్చు కాని సూత్రం ప్రకారం సాధ్యమైనంతవరకు తక్కువమంది తమిళ ప్రజలుమన రాష్ట్రంలో ఉండాలి సాధ్యమైనంత తక్కువమంది తెలుగు ప్రజలు, అక్కడకు పోవాలి ఈ విషయం తీసుకొన్నప్పుడు ఇది కూడా ఆంధ్ర ప్రాంతానికి రావలసియుంటుంది

తిరుత్తణి తాలూకా విషయంలో కూడా సాధ్యమైనంత తక్కువమంది తమిళ ప్రజలు మన రాష్ట్రంలో ఉండేటట్లుగా మన ప్రాంతంనుంచి సాధ్యమైనంత తక్కువమంది తెలుగు ప్రజలు తమిళ రాష్ట్రంలోకి పోయేటట్లుగా ఏ పద్ధతి బాగుంటుందని నేను అనేక రకములైనటువంటి permutations combinations - ఏ గ్రామం ఎట్లా కలిపితే బాగుంటుంద అని - work out చేశాను Contiguity చెడకుండా చూడమని ఎన్నో ప్రయత్నాలు చేశాను 1951 వ సంవత్సరం సెన్‌సెస్ లెక్కలనుబట్టి కూడా యీ permutations, combinations ను work out చేశాను. యస్ ఆర్ సి వచ్చినపుడు వారికి యీ ఇన్‌ఫర్‌మేషన్ అంతా యీయవలసినదని దానిని నేను శ్రీ కళా వెంకటరావుగారికి ఇచ్చాను, నేను స్వయముగా ఇచ్చేకన్నా ప్రభుత్వం ద్వారా యిస్తే బాగుంటుందని వారికి అందచేశాను అనుకోండి 1931 వ సెన్సస్ బట్టి కాక 1951 వ సెన్‌సస్‌ను బట్టి మనకు అన్యాయం జరిగింది. అనే అనుమానం ఉన్నదికాబట్టి 1931 వ సెన్‌సస్‌ను దగ్గర పెట్టుకొని గ్రామ గ్రామం యొక్క లెక్కలను చూస్తే కొన్ని గ్రామాలలో అదివరకు తెలుగు మెజారిటీ ఉన్నది ఇపుడు తమిళ మెజారిటీ ఉన్నట్లుగా మారినది. అట్టి గ్రామాలు కొన్ని కనుపించాయి. అయితే అదే సమయంలో ఇదివరకు తమిళులు మెజారిటీగా ఉన్న కొన్ని గ్రామాలు యీ రోజు తెలుగువారు మెజారిటీగా ఉన్నవిగా

మారాయి కాని మొత్తం తాలూకాలో చూచినట్లయితే తెలుగు ప్రజల సంఖ్య తగ్గి తమిళ ప్రజల సంఖ్య ఎక్కువైనమాట నిజమే కాని మన సరిహద్దులు తాలూకా జనాభాను బట్టేకాక మిక్సెడు (సమ్మిశ్రిత) గ్రామ సముదాయాలుగా గాని లేదా గ్రామంలో మెజారిటీనిబట్టిగాని చూడాలిసి ఉంది అందుచేత తిరుత్తణి తాలూకాలో మద్రాసు రాష్ట్రంలోని సరిహద్దు సంబంధించిన గ్రామాలు చూచి నప్పటికీకూడా 1931 వ సెన్సస్‌లో తమిళ మెజారిటీఉన్న గ్రామాలే ఈ నాడు కూడా తమిళ మెజారిటీగా ఉన్నాయి కాని మెజారిటీ కొంత ఎక్కువగా కనిపై కనుపించవచ్చు అయితే ఈలెక్కలుసర్వే సెటిల్‌మెంటులు కానప్పుడు తయారు చేసిన మ్యాప్‌నుబట్టి తయారు చేశారని, సర్వే, సెటిల్‌మెంటులు అయిన తరు వాత తయారుచేసిన మ్యాప్‌నుబట్టి వర్కవుట్ చేయవలసినదని యీ నాడు ఒక తిరుత్తణి మిత్రుడు నాకు ఒకకొత్త మ్యాప్‌ను చూపించారు దానిబట్టి కూడా పరిశీలించి చూచాము దానివల్ల ఒకటి, రెండు గ్రామాలు అటు, ఇటు మార వలసి ఉంటే ఉండవచ్చు, నేను ఆ ప్రతినిధితో మాట్లాడి ఆ గ్రామాలు ఇక్కడ ఉండాలి, యీ గ్రామాలు అక్కడ ఉండాలి అని చెబితే లాభంలేదు మ్యాప్‌ను బట్టి చూచినా ఇవి అన్నీ గజిబిజిగా ఉన్నాయి. తెలుగు గ్రామాలమధ్య అరవ గ్రామాలున్నాయి అరవగ్రామాలమధ్య తెలుగు గ్రామాలున్నాయి ఏదైనా ఒక్కప్రాంతం - ఒక గ్రూప్ ఆఫ్ విలేజెస్ - తీసుకొని, యీ మ్యాప్‌లో మన ప్రజలు మెజారిటీగా ఉన్నారు, ఇది మనకు రావలసిఉంటుంది అని ఒక ప్రాంతాన్ని వర్కవుట్ చేయమని మధ్యాహ్నం రెండుగంటలవరకు వర్కవుట్ చేశారు ఆవిధంగా చేసినా మాకు కనుపించినది ఒక ప్రాంతం మాత్రమే. అదికూడా తిరుత్తణి తాలూకాకు మధ్యఉన్నటువంటి ప్రాంతం మద్దూరు, కృష్ణసముద్రం ఉత్తరాన, దక్షిణాన చెరుకులూరు, వెంగలూరు, యీ మధ్యన ఉన్న ప్రాంతం ఆంధ్రలో ఉంచడానికి వీలుంటుందా అని చాలా జాగ్రత్తగా పరిశీలించాము ఆ ప్రాంతంలో మాత్రం 16 వేలమంది తెలుగు ప్రజలు, 10 వేలమంది తమిళ ప్రజలు ఉన్నారు అయితే యీ ప్రాంతాన్ని ఆంధ్ర ప్రదేశంలో చేర్చడం చాలా కష్టమవుతుంది. మద్దూరు, కృష్ణసముద్రం ఒక్కొ క్కటి 3,500 జనాభా ఉన్నటువంటి పెద్ద తమిళగ్రామాలు. వాటికి దక్షిణాన 500 జనాభాకు మించిన తెలుగు గ్రామాలు 9 మాత్రమే ఉన్నాయి అయితే యీ కుగ్రామాలకు ఉత్తరాన ఎక్కువ మెజారిటీ ఉన్న తమిళ గ్రామాలు ఉన్నప్పుడు యీ ప్రాంత మంతయు కోరడం న్యాయం అని అనిపించు కుంటుందా? ఏవిధమైన permutations, combinations చేసినా తెలుగు మెజారిటీ సాధించడం సాధ్యంకాదు. ఇది 1951 వ సెన్సస్ లెక్కల ప్రకారమేకాదు. 1931 వ సంవత్సరం సెన్సస్ లెక్కల ప్రకారంగా కూడా అలాగే ఉంటుంది

అందుచేత ఇది విచారకరమైనది ఇంతకాలం ఆంధ్రప్రాంతంతో సంబంధం ఉండి ఈ రోజున తమిళనాడుకు యిటు తెలుగు ప్రజలు అటు మద్రాసు సరిహద్దులోకి పోవటం ఆవేదనగానే ఉంటుంది మన తెలుగు ప్రజలు అరవ భాషను నేర్చుకోవాలంటే ఎంత ఆవేదనగా ఉంటుందో అట్లాగే అటువుండే తమిళ ప్రజలు యిటు ఆంధ్రసరిహద్దులోకి రావటానికి, తెలుగుభాష నేర్చుకొనుటకు అంత ఆవేదనపడుతున్న విషయం గుర్తించాలి కాని ఆ సమస్యను యింకొక రకంగా పరిష్కరించుకొనవచ్చును ముఖ్యంగా ఈ సరిహద్దులలో వున్న మైనారిటీ ప్రజలయొక్క హక్కులు గుర్తించి రెండు ఏర్పాట్లు చేయవలసి ఉంటుంది 1) స్కూల్ ఫైనల్ వరకు విద్యాబోధ ఎవరి మాతృభాషలో వారికి ఉండవలెను అప్పుడు, ఈ సమస్య తీరుతుంది 2) స్థానిక పరిపాలన, ప్రభుత్వ వ్యవహారాలు రెండు భాషలలోను జరిపితే, ప్రజలు ఏ విధమైన అనుమానం పడటానికి వీలుండదు అయితే చదువుకొన్న వారందరికి ఉద్యోగాలను యివ్వలేము, అది వేరే సమస్య కాని నూటికి 20 మంది మైనారిటీభాష మాట్లాడే వారుంటే చదువు, పరిపాలనా వ్యవహారాలు వారివారి మాతృభాషలలో వుంటే ప్రజలు అనుమానం పడకుండా ఉంటారు ఆంధ్ర, తమిళ ప్రజలను సన్నిహితం చేసేటట్లుగా సరిహద్దులలో ఏర్పాట్లు ఉండాలి. కృష్ణాజిల్లాలో ఉన్నవారికి అరవం నేర్చుకొనడం కష్టంగాని చిన్నప్పటినుంచి అరవ ప్రజలలో మెలగినవారు అరవం నేర్చుకొనటం తమిళులు తెలుగు నేర్చుకొనడం తేలిక అవుతుంది సంబంధాలు కూడ ఎక్కువగుతవి భారతదేశంలో భాషారాష్ట్రాలు— ఒక రాష్ట్రాన్నుంచి యింకొక రాష్ట్రాన్ని చీల్చటంకాకుండా, ఒక రాష్ట్రానికి ఇంకొక రాష్ట్రం ముడివేసే గట్టిపునాదిగా సరిహద్దులు ఏర్పడాలి.

కృష్ణగిరి, హోసూరు సమస్య వచ్చినప్పుడు, యిదే సూత్రాన్ని వర్తింపజేసి సాధ్యమైనంత తక్కువమంది తెలుగువారిని యితర రాష్ట్రాలలో ఉండేటట్లు, సాధ్యమైనంత తక్కువగా యితర భాషలవారు మన రాష్ట్రంలోఉండేటట్లు ఈసరిహద్దుల సమస్యను పరిష్కరించటం అవసరం హోసూరు సమస్య మైసూరుకుకూడా సంబంధించి యున్నది అక్కడ 1,95,000 ఉన్న జనాభాలో 87 వేలు తెలుగువారు, 55 వేలు కన్నడిగులు, 37,500 తమిళులు, 15 వేలు యింకా యితర ప్రజలు ఉన్న సమ్మిశ్ర ప్రాంతం, అది 87 వేలు తెలుగువారున్న ఆ ప్రాంతం, నేను చెప్పిన సూత్రప్రకారం ఆంధ్రలో చేర్చుట అవసరం మన ప్రభుత్వం కోరిన 11 గ్రామాలు మొత్తంగా చూస్తే, నూటికి 51 మంది తెలుగువారు ఉన్నట్లు లెక్కలు చూపించినా, మైసూరు - మద్రాసు రాష్ట్రాల మధ్య దారి చేసుకుపోతున్నట్లు map లో యితరులకు కనబడుతుంది అందువల్ల convince చేయుట కష్టం అయితే దీనికి పరిష్కారం మార్గం ఉన్నది. ఆంధ్ర-

మైసూరు సరిహద్దుల సమస్య తీసుకొన్నప్పుడు, కోలార్ విషయంలో, దక్షిణాన హోసూర్, ఉత్తరాన బీదరువరకు అనేక జిల్లాలు ఉన్న ఆంధ్ర - మైసూరు సరిహద్దులు పరిష్కరించుకొనవలసి యుంటున్నది హోసూరునుంచి హైదరాబాదుకు, ఉత్తరంగా బీదర్ జిల్లావరకు తెలుగుప్రాంతం ఉన్నది బీదరు జిల్లాలో చించోళీ తాలూకావరకు ఉంది వారికి కొన్ని గ్రామాలుపోతే మనకు కొన్ని తాలూకాలు రావలసియుంటుంది మొత్తంగా ఆంధ్ర - మైసూరు సరిహద్దుల సమస్య తీసుకొన్నప్పుడు, హోసూరుకు contiguity ఏర్పడుతుంది అప్పుడు మన తాలూకు ప్రజలు ఎక్కడున్నా, ఆప్రాంతం ఆంధ్రలోకి వచ్చేటట్లు చూడవలసి యుంటుంది. అందుచేత పటాస్కర్ రిపోర్టును అంగీకరిస్తున్నప్పుడు, హోసూరుమీద మన హక్కులను వదులుకొనుటలేదు ఆంధ్ర - మైసూరు సరిహద్దులలో భాగంగా triparty గా మద్రాసునుకూడ తీసుకువచ్చి మొత్తం సరిహద్దు సమస్యను పరిష్కరించుకోవలసి యుంటుంది దానికి పునాదిగా, యీ రోజున ఆంధ్ర- మద్రాసు సరిహద్దులకు సంబంధించి ఏ సూత్రాలు పటాస్కరుగారు అనుసరించారో ఆసూత్రాలలో రాక, ఉన్న కొద్ది లోపాలను సవరించి వాటిననుసరించి నిజలింగప్పగారు, సంజీవరెడ్డిగారు- సంభాషణలు ఆరంభించి సరిహద్దు సమస్యలు పరిష్కరించుకొనుట చాలా తేలిక ఏవైనా చిన్న భేదాభిప్రాయాలుంటే, పటాస్కరుగారికో, లేక యింకెవరికైనా నివేదించుకొని ఈ సమస్యను పరిష్కారం చేసుకొనవచ్చును

ఈ రిపోర్టుకు సంబంధించి యింకొక ముఖ్యవిషయంఉన్నది తిరువళ్ళూరు తాలూకాలోని పొన్నలూరిపేట మొదలైనగ్రామాలు ఉన్నవి ఏప్రాంతమయితే తమిళనాడులో పెట్టారో వాటి యొక్క 1931 జనాభా లెక్కలు చూస్తే తెలుగు ప్రజల మెజారిటీ చాలా ఉన్నది. కాని ఈరోజున తమిళుల మెజారిటీ కనపడుతుంది 1931 లో గాని, 1951 లో గాని జనాభా లెక్కల లోపాలు జరిగియుండవచ్చును ఇప్పుడు ఆ విషయంకాదు నేను 1957లో ఉన్న జనాభా లెక్కలను బట్టి చూడ యిది మనకు రావలసిన ప్రాంతం ఏమైనా, యిది మనం అంగీకరించవలసిన రిపోర్టు. దీని వలన తమిళనాడుకు కొంత నష్టం జరిగియుండవచ్చును. ఆంధ్రప్రాంతానికి కొంత నష్టం జరిగియుండవచ్చును. వీటిని గురించి యింకా ముందు పరస్పరం మాట్లాడుకొని పరిష్కరించుకునేందుకు ప్రయత్నంచేస్తూ, యీ రిపోర్టును అంగీకరించినందుకు రెండు ప్రభుత్వాలను అభినందిస్తూ, దీనిని వెనువెంటనే సాధ్యమైనంతవరకు అమలుజరిపి, Act తీసుకువచ్చి, దాని ననుసరించి మిగిలిన సరిహద్దులను పరిష్కరించుకునేందుకు ప్రభుత్వం ప్రయత్నంచేయాలని కోరుతున్నాను. ఈ సరిహద్దులనుంచి నాకు దురదృష్టకరమైన, విచారకరమైన రిపోర్ట్సు వస్తున్నాయి. మన ఆంధ్రప్రాంతానికి వచ్చే

ప్రాంతాలలో electricity మొదలైన పనులన్నీ ఆపుచేశారని, అదేరీతిగా తిరుత్తణి ప్రాంతంలో కూడ కొన్ని కొన్ని పనులు ఆగిపోయినవని తెలిసింది. ఈ సరిహద్దు సమస్య యీరకంగా ఉన్నప్పుడు మొత్తంగా ప్రజలకు ఉపయోగంగా ఉన్న పనులు, అటు మద్రాసు ప్రభుత్వం, యిటు ఆంధ్రప్రభుత్వం చేయకుండా ఉంటే రెండు ప్రాంతాలకూ నష్టంగా ఉంటుంది కాబట్టి వెంటనే బిల్లు తెచ్చి, చిన్నచిన్న సమస్యల మీద ఒక పరిష్కార మార్గానికి వచ్చి ప్రజలకు యిబ్బందిలేకుండా పనులు కొనసాగించటం మంచిది సంభాషణల ద్వారా చిన్న సమస్యలు పరిష్కరించుకొనడం అవసరం తమిళ ప్రజలు అనవసరంగా మా రాష్ట్రంలో ఉండటం, తెలుగుప్రజలు మద్రాసురాష్ట్రంలో ఉండటం ఎందుకని, ఆవిధంగా సంభాషణల ద్వారా పరిష్కరించుకుంటే, పార్లమెంటుకూడ ఏమీ అభ్యంతరంపెట్టదు ఈ రెండు ప్రభుత్వాలు అంగీకరిస్తే వారు ఆమోదిస్తారు ఆరకంగా వెనువెంటనే వచ్చే సెషన్‌లోగా యీ బిల్లు పాస్‌అయి అమలుజరిగితే ప్రజలకు ఏ యిబ్బందులూ కలుగకుండా సామరస్యంగా పనులు చేసుకొనేందుకు వీలుంటుంది ఇంతకంటె యిప్పుడు ఎక్కువ చెప్పేది లేదు కనుక ఆ ప్రకారం చేయవలెనని కోరుతూ ముగిస్తున్నాను

* శ్రీ యన్ సంజీవరెడ్డి అధ్యక్షా, శ్రీ పటాస్కరుగారి రిపోర్టుమీద మిత్రుల ఉపన్యాసాలు విన్నాను సుందరయ్యగారి ఉపన్యాసం విన్నతరువాత నేను చెప్పగలిగినది ఏమీ లేదేమోననిపిస్తున్నది వారు గట్టిగా శ్రమచేసి చదివి, మద్రాసుకు పోవలసినవి కొన్నిగ్రామాలు ఉన్నవని, మనకు రావలసినవి కొన్ని ఉన్నవని వారు చెప్పిన సమాధానం చాలా సమంజసముగా ఉన్నది నూటికి నూరుపాళ్ళు దానిని నేను అంగీకరిస్తున్నాను కాని నా మిత్రులు గోపాలు రెడ్డిగారు, వారి తిరుత్తని తాలూకా చీల్చబడుచున్నదని, దాదాపు 75% వారి నియోజకవర్గం అటు మద్రాసురాష్ట్రంలో చేర్చబడుచున్నదని విచారం వెలిబుచ్చారు వారి నియోజకవర్గములో ఉన్న ఆందోళన, వారు పడుతున్న బాధ నేను అర్థము చేసుకొనగలను వారితోబాటు చెంగల్‌రాయ నాయుడు గారు కూడ sympathetic గా బాధపడుతున్నారు పాపం! వారి బాధకూడ కొంచెం అర్థము చేసుకొనవలసినదే ఒక కథ జ్ఞాపకము వస్తున్నది ఇద్దరు మిత్రులు బండ్లు కట్టుకొని—ఉప్పు ఒకరు, టెంకాయ ఒకరు—సంతకు తీసుకొని పోతున్నారు. మధ్యలో వర్షము వచ్చింది ఉప్పు తీసుకుపోతున్నవాడు అది కరిగి పోతున్నదని ఏడిస్తే, టెంకాయలు తీసుకుపోతున్నవాడు యింకా ఎక్కువగా ఏడ్చినాడట ఎందుకో ఆరకంగా sympathetic గా చెంగల్‌రాయ నాయుడు గారు బాధపడుతున్నారు. కాబట్టి వారికికూడ నా సానుభూతి అందచేస్తున్నాను.

వారి నియోజకవర్గంలో అయిదారుగ్రామాలు అటు రాష్ట్రంలోకి పోతున్నవి. ఆ గ్రామాలవారుకూడ వారికి ఓటుయిచ్చారు

శ్రీ యన్ పి చంగల్‌రాయనాయుడు మూడైగ్రామాలు పోతున్నాయండి

శ్రీ యన్ సంజీవరెడ్డి వారి నియోజకవర్గం సంగతి చెప్పాను. ఏమైనా తిరుత్తణిలో ఉన్న ఆవేశము నేను అర్థము చేసుకొనగలను ఇంత కాలంగా ఆంధ్రులతో కలిసిఉన్నవారు ఈనాడు ఒక్కసారి విడిపోయి ప్రక్కన మరొకరాష్ట్రంలో చేరటం కొంచెం కష్టంగానే ఉంటుంది కాని యిది ఎప్పుడో ఒకనాటికి సర్దుకోవాలి నాలుగేండ్లుగా యీ బోర్డరుఇష్యూస్, అట్లా పెరుగుతూ పోతున్నది ఈ నాలుగేండ్లుగా మద్రాసునుంచి వచ్చిన ఉరవసోదరులు తిరుత్తణిలో ఉపన్యాసాలు పెట్టి మమ్ములను తిట్టినన్నితిట్లు యిక 40 ఏండ్లలో ఎవరు ప్రయత్నంచేసినా తిట్టలేరు అన్నితిట్లు తిట్టారు ఈ ఆంధ్రప్రభుత్వం తాత్కాలికం (temporary) అన్నారు ఆంధ్రమంత్రులంతా తాత్కాలికం అన్నారు గవర్నరుగారిని కూడ spare చేయలేదు అందరినీ నాలుగేండ్లు తిట్టారు చాలామంది పెద్దలే నన్ను అడిగారు "ఇన్ని పచ్చిబూతులు తిడుతూంటే, అవ్వకూడనిమాటలు బహిరంగసభలలో అంటూంటే, నీ ఆంధ్ర రాష్ట్రంలోకి వచ్చి ఆంధ్రులను యీ రకంగా అవమర్యాద చేస్తూంటే మీ ప్రభుత్వం ఏమిచేస్తున్నది"అని నన్ను పెద్దలు అడిగారు. Constitutional Headsగా అధికారంలో ఉన్నవారు, మనకన్న ఎక్కువ తెలుసుననుకొన్న పెద్దలు అడిగారు దానికి నేను సమాధానం చెప్పాను

అందుకు మనం ఏమిచర్య తీసుకొన్నా, అధికప్రాముఖ్యతఇచ్చి వాళ్ళను రెచ్చ కొట్టినట్లు అవుతుందితప్ప మనకు లాభంలేదని చెప్పాను ఆ విధంగా సమాధానం చెబుతూ, నాలుగేళ్ళు తిట్లు భరిస్తూ వచ్చాము. బోర్డర్ విషయం గురించి పోలీసు రిపోర్టులు చూస్తే, ప్రతిరోజూ ఒక ఉపన్యాసం పది తిట్లు అందులో ఉండేవి అవి చదువుకొంటూ నాలుగేళ్ళు గడిపాము "మిమ్మల్ని ఇన్ని తిట్లు తిడుతూంటే, మీరుకూడ మా హోసూరు తాలూకాకో, ఆ పక్క తాలూకాకో వచ్చి ఎందుకు తిట్టరు ?" అని అక్కడున్న తెలుగువారు మమ్మల్ని చూసి బాధపడేవారు. "పోనీ, నువ్వు మంత్రిగా ఉన్నావు. నీవు రాలేకపోతే, కనీసం గోపాలురెడ్డి చంగల్రాయ నాయుడుగారు వంటి గట్టివారిని అక్కడకు తిట్టుటకు ఎందుకు పంపించవు ? నీవు తెలుగువారికి ద్రోహం చేస్తున్నావే? ఇద్దరు తిట్లేవాళ్ళను అక్కడకు పంపించలేకపోతివే?" అని వారు అన్నారు కాని, అందులోని ఇబ్బందులు నాకు తెలుసు ఈ సరిహద్దు సమస్యలను పరిష్క

రించుకోటానికి మద్రాసు ప్రభుత్వము సానుభూతికరంగా ఉన్నది కామరాజ నాడార్‌గారు కూడ, యీ సమస్యను రాజీగా పరిష్కరించుకోవాలనే అభిప్రాయంతో ఉన్నారని నాకు తెలుసు మనం పోయి తెలుగువాళ్ళను రెచ్చగొడతాము అనుకోండి అక్కడున్న తెలుగువాళ్ళకు అరవవాళ్ళకు తగాదా ఏర్పడుతుంది. వాళ్ళలో వాళ్ళు కీచులాడుకొని తన్నుకొంటారు. అక్కడ ఉపన్యాసం ఇచ్చి మనము వెళ్ళిపోతాము కాని వాళ్ళకు పెట్టిన తగాదాలు మాత్రం శాశ్వతంగా నిలిచిపోతాయి ఆ ప్రాంతాలు అటు మద్రాసు రాష్ట్రమునకు పోయినా, ఇటు ఆంధ్రరాష్ట్రమునకు వచ్చినా, అక్కడి ప్రజలు మాత్రం దెబ్బలాడుకొంటూనే ఉంటారు, కాబట్టి, అది సరైనపద్ధతికాదు - అన్న ఉద్దేశంతోనే యీ నాలుగేళ్ళలోను ఒకసారి అయినా మన బోర్డర్ దాటి నేను ఆ తెలుగు ప్రాంతానికి పోలేదు నా మిత్రులనుపోయి అక్కడ రెచ్చకొట్టమని నేను చెప్పలేదు అటుప్రక్క ఉన్నటువంటి నా మిత్రులు కామరాజ నాడార్‌గారుకూడ ఆ పనికి పాల్పడలేదు మద్రాసు ప్రభుత్వానికి లోనుకాని వాళ్ళు కొందరు, వారి విశ్వాసానికి గురికానివారు కొందరు అక్కడి అరవ వారిని రెచ్చకొట్టటానికి పూనుకొన్నారు ఇలాంటి పరిస్థితుల్లో పార్లమెంటులో జవహర్‌లాల్ నెహ్రూగారు "ఏదోవిధంగా సరిహద్దు సమస్యలను పరిష్కరించుకోవాలి, ఇది ఒక పెండింగ్ క్వశ్చన్ దీనికి ఏదోఒక రకంగా సొల్యూషన్ కనిపెట్టాలి" అని చెప్పారు వారు చెప్పినప్రకారం ఒక ఆర్‌బిట్రేటర్‌ను వేయటానికి ప్రయత్నం జరిగింది "ఆర్‌బిట్రేటర్ వరకు ఎందుకు ? మనమే కలసి చర్చించుకొని పరిష్కరించుకొందాము ఆంధ్ర మద్రాసు రాష్ట్రాలు మొన్నటిదాకా కలిసే ఉన్నాయి. వేరువేరు రాష్ట్రాలలో మనం ఉన్నా. మనమందరము స్నేహితులము మరో పెద్దమనిషివచ్చి చెప్పటము ఎందుకు ? మనమే తేల్చుకొందాము" అన్న ఉద్దేశంతో గోపాలరెడ్డిగారు (అప్పుడు వారు ముఖ్యమంత్రిగా ఉన్నారు.) నేను, కళా వెంకట్రావుగారు మద్రాసు పోవటం, అక్కడ చర్చించుకోవటం జరిగింది కాని ఆ సమస్యలను అంత సులభంగా తేల్చుకోలేక పోయినాము ఉద్రేకాన్ని రెచ్చగొట్టటం సులభము. అక్కడ మేము ఎగ్రిమెంటుకు వచ్చి, ఏదైనా సొల్యూషన్ ఏర్పాటు చేసుకొంటే, "మీరు చేస్తున్నది తప్పు ఇదంతా ద్రోహం ఆంధ్రులకు ద్రోహం కలిగింది. ఆంధ్రులే ద్రోహం చేసినారు" అని గంభీరంగా మన వెంకయ్యగారిలాంటి వారు ఎంతమంది ఉపన్యాసం చేస్తారో అని జంకాము. లేకపోతే ఆ దినమే తీర్మానం అయిపోయేది. ఆ విధంగా జంకి అప్పటికి మానుకొన్నాము

తరువాత, నేను ఢిల్లీలో కామరాజ నాడార్ వాళ్ళతో మాట్లాడాను. "ఏమిటి ఇది ? మనమే ఎందుకు తేల్చుకోలేము ?" అని కామరాజ నాడార్

గారితో చెప్పినాను. అట్లా మాట్లాడుతున్న సమయంలో అరవం, తెలుగు కాని మళయాళమిత్రులు ఒకరు "ఏమిటీ తగాదా అంతా ? ఎందుకు యీ యుద్ధం ? ఎట్లా పంచుకొన్నా కొందరు ఎటూ ఇటు ఉండక తప్పదు, కొందరు అటు వెళ్ళక తప్పదు కొందరు తెలుగువాళ్ళు అరవ ప్రాంతానికి వెళ్ళకతప్పదు కొందరు అరవవాళ్లు తెలుగు ప్రాంతానికి రాకతప్పదు మీరు కొత్తగా తెలుగువారు, అరవవారు లేని రాష్ట్రాన్ని సృష్టించుకోలేరు మీరు ఎట్లా విభజించుకొన్నా, సరిహద్దులలో బైలింగ్వల్ ఏరియాస్ ఉండి తీరుతాయి" అని సూచించారు కాని మద్రాసులో ఉన్న పరిస్థితులనుబట్టి, అక్కడ ఉన్న యాజిటేషన్ బట్టి, మేము అలా చేయలేకపోయాము మేము ఒక రకమైన తీర్మానానికి వస్తే యీ యాజిటేషన్ కంటిన్యూ చేయటానికి కొందరికి అవకాశం ఇచ్చినవార మౌతామేమో, ఈ తగాదాలు శాశ్వతంగా నిలిచిపోతాయేమో, అని తలచి, ఎవరైనా ఒక పెద్దమనిషి ద్వారా తీర్మానం చేసుకొంటే మంచిది అని అనుకొన్నాము "నేను రైలు కూల్చేస్తాను, సత్యాగ్రహం చేస్తాను" అని అనేవాళ్ళకు యాజిటేషన్ చేసే అవకాశం ఇవ్వకుండా చేయటానికే ఆ విధంగా అనుకొన్నాము ఆ పెద్దమనిషి మనకు కేవలం సలహామాత్రమే ఇస్తారు వారు చెప్పేది మాండేట్ కాదు

విశాలాంధ్ర రాష్ట్రం ఏర్పడిన తర్వాత నవంబరు 7, 8 తేదీలలో కలకత్తా వెళ్ళినపుడు, నేను, కామరాజ నాడార్ అక్కడ ఉన్నప్పుడు హోమ్ మినిస్టర్ పంత్‌గారు ఒక సలహా ఇచ్చారు "మీరు ఇద్దరు ఇంత స్నేహంగా ఉంటారు, ఏ మీటింగ్‌కు వచ్చినా కలిసివస్తారు, ఎక్కడ కూర్చున్నా కలసి కూర్చుంటారు, మరి యీ చిన్న తగాదా పెట్టుకోవటం ఏమిటి ? ఇది మీ రెండు రాష్ట్రాలకు మంచిది కాదు. పోనీ మీరు డెలికేట్‌గా ఫీల్ అవుతూంటే, పటాస్కర్‌లాంటి ఒక పెద్దమనిషిని తీసుకోండి వారు చెప్పే న్యాయాన్ని మీరిద్దరూ అంగీకరించటంలాంటి చిన్నపని అయినా చేయలేక పోతున్నారా ?" అని వారు అన్నారు పటాస్కర్‌గారు మనకు తెలుసు ఇదివరకు వారు కేంద్రంలో లా మినిస్టర్‌గా ఉండినారు. చాలా పెద్దమనిషి, వయస్సులో, యోగ్యతలో, తెలివితేటల్లో, అన్నింటిలోకూడ పెద్దవారే. కాబట్టి వారిని అంగీకరించటానికి మాకు ఏమాత్రం ఆక్షేపణ లేదని నేను కామరాజనాడార్ ఒప్పుకొన్నాము. ఆ విషయం పక్షులందరకూ తెలుసు. అది రహస్యం కాదు. పటాస్కర్‌గారు మద్రాసు వెళ్లారు. అక్కడ పరిశీలన చేశారు మద్రాసులో ఇచ్చిన మేప్స్‌గురించి వెంకటరావుగారు చెప్పారు. ఆవిషయాలు తిరిగి చెప్పవలసిన అవసరంలేదు. అది ఎవరో ఇచ్చిన మేప్ కాదు. మనము వాళ్లు కలిసిఇచ్చిన మేప్ అది. మనవాళ్ళు మోసపోయారని మనం అనుకొంటే,

అవతల ఉద్యోగస్థులు మోసపోయారని అవతలవాళ్ళు అనవచ్చు "తిరుపతి వరకు మాది వడవెంగళం మాది" అని ఉపన్యాసాలు ఇచ్చే పెద్దమనుష్యులు "మన అద్భుదనాదన్ పోయికూడ వడవెంగళం వరకు వ్రాయలేదేం?" అని బాధపడటంకూడ జరగవచ్చు కాబట్టి మనం మన ఉద్యోగస్థులను నిందించి లాభంలేదు కొన్ని తేడాలు ఉన్నాయని చెప్పండి, ఒప్పుకొంటాను లేదా జనాభా లెక్కలు తూచితూచి సక్రమంగా చేయలేదు అని చెప్పండి ఒప్పుకొంటాను ఎవరో మోసపోయారని, ఎవరో మోసం చేశారని, ఎవరో తప్పు చేశారని అనుకోవటము మనదే పొరపాటు మన ఉద్యోగస్థులు జాగ్రత్తగానే పరిశీలన చేశారు ఎంతపరిశీలనచేసి, జాగ్రత్తగా కార్యక్రమం చేసినా, అప్పుడప్పుడు కొన్ని పొరపాట్లు జరుగుతాయి అలాంటి పొరపాట్లు జరిగితే జరిగి ఉండవచ్చు ఆ మేప్ జాయింట్‌గా తయారు చేసిన మేప్. ఆ మేప్ క్లియర్‌గా లేదన్న ఉద్దేశంతో లేటర్ స్టేజిలో ఇంకొక మేప్ ఇచ్చాము ఆ మేప్‌ను ఆధారం చేసుకొని మాత్రమే వారు రిపోర్టు అంతా వ్రాయలేదు. వారు మళ్ళీ హైదరాబాదుకు వచ్చినారు మంత్రులు, ఇతర పెద్దలు, హోసూరు పెద్దలు, తిరుత్తని పెద్దలు, చంగల్పట్టు పెద్దలు, మన శాసనసభ్యులు—వీరందరి సలహా సంప్రతింపులు తీసుకొన్న తర్వాతనే మనము మన తరఫున వాదనంతా పటాస్కర్‌కు వినిపించాము. మన వాదన వినకుండా, ఎవరో ఇచ్చిన మేప్‌బట్టి మన ఆస్థిఅంతా మద్రాస్‌కు పంచిపెట్టాడు అని అనుకోవటంవల్ల లాభంలేదు. వారు మన వాదనంతా విన్నారు వారు రిపోర్టు వ్రాశారు పుత్తూరు తాలూకాలో ఉన్న ఒక గ్రామాన్ని మదరాసు రాష్ట్రంలో కలిపారు పుత్తూరు నా నియోజకవర్గము పోయిన గ్రామం మాత్రం నా నియోజకవర్గంలోది కాదు అది గోపాలరెడ్డిగారి నియోజకవర్గం అనుకొంటాను ఒక తాలూకాలో ఒకే గ్రామాన్ని అటుప్రక్కకు మార్చగలిగితే, అదే ప్రిన్సిపుల్‌పైన, మనకు కృష్ణగిరి తాలూకాలో కనీసం 11 గ్రామాలు వస్తే, హోసూరుకు ఒకదారి ఏర్పడుతుందని అనుకొన్నాము సుందరయ్యగారు చెప్పినట్లు, రెండు రాష్ట్రాలమధ్య ఒక సందుచేసుకొని చీల్చుకొని మళ్ళీ హోసూరులో మనం కలవాలి. ఎంతో నేరోగా అంటే, కొంగగొంతు ఉన్నట్టు ఉంటుంది. చిన్న మూడు మైళ్ళ బోర్డరు సృష్టించుకొని దాంట్లోంచి మనం పోవాలి మన కోరిక పటాస్కరు అంగీకరించి ఆ 11 గ్రామాలు మనకు ఇచ్చినా, మేప్‌లో చూస్తే మాత్రం చాలా రెడిక్యులస్‌గా కనుపిస్తుంది ఆ నేరో బోర్డరులో విపరీతమైన కొండలు ఉన్నాయి అక్కడ రోడ్లులేవు. జనాభాఉన్న గ్రామాలు లేవు. కాని హోసూరులో మన మిత్రులు ఉన్నారు. అక్కడ 51 పర్సెంటు తెలుగువారు లేకపోవచ్చు కనీసం 38 పర్సెంటు అయినా ఆంధ్రులు ఉన్నారు వారిమీద ఉన్న అభిమానంతో హోసూ

రును, కృష్ణగిరి తాలూకాలోని 11 గ్రామాలును మాకు ఇమ్మనమని ప్రార్థించాము, కాని రాలేదు ఇది కేబినెట్ తీర్మానము, ఇది ఏ సంజీవరెడ్డో చేసిన పని కాదు ఏ కళా వెంకటరావో చేసిన పని కాదు

తరువాత, మేము ఢిల్లీ పోయినపుడు, కామరాజనాడార్‌గారితో మాట్లాడినాము సుందరయ్యగారు చెప్పినట్లు కామరాజనాడారుగారు కూడా "సూళ్లూరుపేటలో 11 గ్రామాలు ఉన్నాయి ఆ విషయంకూడా రి-ఓపెన్ చేయాలి, మరికొన్నిచోట్ల మరికొన్ని గ్రామాలు ఉన్నాయి, అవికూడా రి-ఓపెన్ చేయాలి" అని అడగవచ్చు కాని వారు మంచివారు కాబట్టి ఆ విధంగా అడుగ లేదు వారు ఆ విధంగా అడిగితే నాకు ఆక్షేపణలేదు. "All right, we will refer it to Pataskar again" అని పంత్ ఎదుట చాలా ఫెయిర్‌గా కామరాజ నాడారుగారు అన్నప్పుడు, మనకన్నా ఆ మనిషిలోనే ఎక్కువ ఉదారత కనిపించింది నాలుగు గ్రామాలు సంపాదించుకోటానికి, 15 వందల జనాభాను సంపాదించుకోటానికి, ఇంకో మేవ్ సబ్‌మిట్ చేసి, ఇంకా తగాదాను పెంచి మనం తీసుకువచ్చినది ఏమిటి ? మనం 600 జనసంఖ్య సంపాదించుకొన్నాము. పది మైళ్ళు పొడుగున ఉన్నటువంటి నాలుగు అడవులు సంపాదించుకొన్నాము సుందరయ్యగారు చెప్పినట్లు కామరాజనాడారుగారు కనుక, సూళ్లూరు పేటలోని గ్రామాలకు పట్టుపట్టితే తప్పకుండా ఆ గ్రామాలు వారికి పోయి ఉండేవి కాని, వారు తగాదా పడలేదు. మనం అడిగినదానికి ప్రతిఫలంగా వారు మరొకటి అడగలేదు

పటాస్కరుగారు న్యాయంగా విచారించారు వారు రిపోర్టు వ్రాసి ఇచ్చారు పటాస్కరు పెద్దమనిషి

ఆయన న్యాయమును సమర్థించే పెద్దమనిషి ఆయన న్యాయము తప్పి ఎవరో మద్రాసువారికి లాభకరముగ చేయాలని అనుకునే పెద్దమనిషి కాదు. ఆయన యొక్క రెండవ రిపోర్టు ఇచ్చినతరువాతనే ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము అంగీకరించటానికి నిశ్చయించింది. ఇక మనము మన యొక్క వ్యతిరేకతను వెల్లడించడములో అది మూర్ఖము తప్ప మరొకటి కాదని అనిపించింది. అందు కనే మన ప్రభుత్వం పటాస్కర్‌గారి రిపోర్టును అంగీకరించింది మిత్రులు కామ రాజ నాడార్ వగైరాలు హైదరాబాదుకు వచ్చినప్పుడు జోనల్ కౌన్సిలులో దీనిని గురించి అంగీకరిస్తూ తీర్మానముచేయడము ద్వారా ఆంధ్రప్రదేశ్ భారత దేశములోని యితర రాష్ట్రాలకు సరిహద్దుల సమస్యా పరిష్కారమున మార్గ దర్శకముగ ఉండేటట్లుగా ముందు ఆంధ్ర మద్రాసు రాష్ట్రముల యొక్క సరి

హద్దుల సమస్య పరిష్కారము చేయాలనే ఆశతోనే యీ కార్యక్రమము యీ విధముగ ఏర్పాటుచేయబడింది ఈ పరిష్కారము ప్రకారము మరికొన్ని గ్రామాలు మనకు రావచ్చు చంగలరాయనాయుడుగారు, గోపాలురెడ్డిగారు మాట్లాడుతూ కొన్ని గ్రామాలు మార్చుకునే అవకాశములు ఉన్నవని అన్నారు కూడ కాని యిప్పుడు మనము కొన్ని గ్రామాలు కావాలని అడిగేటట్లయితే మనము కూడ వారికి కొన్ని గ్రామాలు యివ్వటానికి సిద్ధముగ ఉండాలి సుందరయ్యగారు సూచించిన ప్రకారము వారి గ్రామాలు ఏమిటో తెలుసుకుని అవి అన్నీ వారికి యిచ్చి మనము కూడ వారి వద్ద నుంచి కొన్ని గ్రామాలు పుచ్చుకోటానికి మనము అంగీకారముగ ఉండాలి ఇలా చేసుకునేటట్లయితే మంచిదే కాని యికమీదట మరల వారితో తగాదాలు పెట్టుకోకూడదు అంతటితో సంతృప్తిపడాలి ఆవిధముగ మనము ఒక నిశ్చయానికి వచ్చి వారిని మనము అడుగవచ్చు. "ఇదుగో మద్రాసు రాష్ట్రము నుంచి మాకు యిన్ని గ్రామాలు రావాలి అని చెపుతూ, ఇదుగో యీ గ్రామాలు మీవి గనుక, యివి మీరు తీసుకోండి" అని చెప్పేటట్లుగా తయారయి, ఏదోఒక రాజీమార్గముతో మనము ముందుకు వెళ్లితే, యీనాడేకాదు, యింకా కొన్ని నెలలకైనాసరే పార్లమెంటులో యీ మార్పులను గురించి బిల్లు రాకముందు, ఏరోజునఅయినా సరే మనము, వారు ఉభయులం అంగీకరించి ఏర్పాటుచేసుకుంటే, ఢిల్లీప్రభుత్వం వారికి ఏలాంటి ఆక్షేపణ ఉండదు, వారు సంతోషముతో అంగీకరిస్తారు ఆ ప్రకారము బిల్లు తయారుచేసి, మన ఉభయుల అంగీకారమునకు పంపుతారు దానిని మన ఎసెంబ్లీలలో pass చేసి పంపితే, ఢిల్లీప్రభుత్వమువారు ఆమోదిస్తారు దీనికి వారి ఆక్షేపణఏమీఉండదు కాబట్టి మనము అలాంటి ప్రయత్నము చేయడములో మనకు ఏమీ నష్టముఉండదు. ముఖ్యమంత్రిగారే చేయాలనిగాని, లేకపోతే కళా వెంకటరావుగారే చేయాలనిగాని లేదు కాబట్టి యిప్పుడు తగాదాలు అన్నీ తీరిపోయినవి కనుక యికమీదట ఏలాంటితగాదాలు మనముపెట్టుకోవాలనిలేదు గనుక మరెవరైనాసరే, వారికి మనకు ఒక common friend గా ఉన్నవారు వెళ్ళి ఇదుగో మాకు యిది యివ్వండి, ఇవి మీరు తీసుకోండి అని అడిగి settle చేసుకోవచ్చు. అంతేగాని శివజ్ఞాన గ్రామణిలాంటివారిని, లేదు వడవేంగడంలాంటి వారిని, లేకపోతే మన ఆంధ్రులలో ఆంధ్ర గ్రామణిని ఒకరిని తయారుచేసి యిదుగో కోయంబత్తూరువరకు మేము యివ్వము, అంతవరకు మాకు కావాలి, లేకపోతే రాజపాలయంలో తెలుగువారు ఉన్నారు, గనుక రాజపాలయము వరకు మాకు కావాలి అని మనము కోరుతూ తగాదాలు పెట్టుకొని అడిగితే అవి అన్నీ అయ్యేపనికాదు. అవి అన్నీ కలలేగాని, అది అంతా జరిగేవని ఏమీ కాదు. ఊరకనే తగాదాలు పెంచుకోవడమే అవుతుంది కాని, పరిష్కారము మాత్రము సున్న. కాబట్టి చిన్నచిన్న సర్దుబాట్లు యింకా ఏవైనా ఉంటే,

సుందరయ్యగారు, గోపాలురెడ్డిగారు సూచించిన ప్రకారము మద్రాసు ప్రభుత్వానికి ఏదైనా friendly గా ఒక letter వ్రాయవచ్చు ఏమని అంటే ఈ పరిస్థితి యిట్లాఉన్నది, మీకేమీ ఆక్షేపణ లేకపోతే, యీ పది గ్రామాలు మీరు తీసుకోండి యీ నాలుగు గ్రామాలు contiguous గా ఉన్నవి గనుక, యివి మాకు యివ్వండి అని చెప్పగలిగితే మాత్రము వారికి ఏలాంటి ఆక్షేపణలేదు అందుకు మన ప్రభుత్వము గట్టిగా కృషిచేస్తుంది ప్రయత్నిస్తుందికూడా అప్పుడు మనము ఏకగ్రీవముగ అంగీకరించటానికి మనకు వీలుఅయితే, మాకు ఎలాంటి ఆక్షేపణలేదు కాని ఇద్దరికి మధ్య ఏలాంటి తగాదా పెట్టుకోవడము అనే సమస్య ఏ మాత్రము ఉండకూడదు ఈ బార్డర్సు విషయములో యింతటితో తగాదాలు అన్ని తెగిపోవాలని నా అభిప్రాయము మీరందరు దీనిని అంగీకరించాలని నా కోరిక మనకు యింకా ఎన్నో సమస్యలు ఉన్నవి ఇక పోయినంతకాలము యీ సమస్యలపైననే మన కాలమంతయు వృధాచేస్తేకాదు. మనకు యిచ్చినచోట్లు అన్నీ బాగుచేసుకోవలసి యున్నది కాని, యివి మరల మద్రాసు రాష్ట్రములోనికి ఎప్పుడు పోతాయో ఏమో అని అనుకుంటూ, అక్కడ రోడ్లు వేయడము, electricity ని extend చేయడము, అవి ఏవీకూడ జరపకుండా కూర్చుని ఉండడము మంచిదికాదు. నిజానికి మనకు వచ్చినది బాగా developed area నేను అక్కడ చంగల్పట్టు జిల్లాలో కొంత దూరము పోయి చూచివచ్చాను ఆ ఏరియా అంతా బాగా develop చేయబడి యున్నది ఇక మీదట యింకా తగాదాలు contiune చేసుకుంటూపోతే వారు కూడ మనకు వచ్చినవికూడ మరల పోతాయేమో అని వారు అక్కడ ఒక్క దమ్మిడీ ఖర్చు చేయరు అన్ని పనులు నిలిపివేస్తారు ఇది settle అయ్యేవరకు ఆ ప్రాంతాలు undeveloped గా అలాగే ఉండిపోతాయి. మనకు ఏ ఏరియా అయినా పోతుందేమోనని వారు అనుకుంటే, వారు దానిమీద ఒక్క దమ్మిడీ ఖర్చు చేయరు. వారు ఎందుకు ఖర్చు చేస్తారు? అక్కడ చేయవలసిన developments అన్నీ నిలిపివేస్తారు.

ఇక యీ transferred area లో minorities యొక్క విద్యావిషయమును గురించి మన గోపాలురెడ్డిగారు చెప్పారు. ఈ విషయమును గురించి మేము Zonal Council లో చర్చించాము. దీనినిగురించి బాగా ఆలోచించాము. ఏ రాష్ట్రములోనిక అయినా bye-lingual areas వచ్చేటట్లైతే అక్కడ మాతృభాషను ఏర్పాటుచేయాలి అని, అది general సమస్యగా ఆలోచించి దానికి ఒక Sub-Committee ని ఏర్పాటుచేశాము. ఈ విషయము వెంకట్రావుగారు బహుశః మీకందరికీ చెప్పేఉంటారనుకుంటాను. కాబట్టి minority ప్రజల యొక్క భాషనుగురించిన తగాదా ఏమీలేదు. నేను చెబుతున్నది ఒక్క ఆంధ్ర

రాష్ట్రము తరఫుననేకాదు మనకు యీ border areas లో ఉన్న భాషను గురించి మద్రాసు ప్రభుత్వమువారు చాలా ఉదారంగా ఉన్నారు వారిబార్డరు ఏరియాలో తెలుగుభాష మాట్లాడేవారు ఉంటే, వారికి తెలుగుభాషను ఏర్పాటుచేసే అవకాశము కల్పిస్తారని ఆశిస్తున్నాము ఆంధ్రరాష్ట్రము తరఫున నేను చెబుతున్నాను ఎవరైనాసరే మన రాష్ట్రములోనికి వచ్చేటట్లైతే, వారికి కావలసిన విద్యావసతులు, స్కూల్సు ఏర్పాటుచేయడము మనయొక్క ధర్మము అది న్యాయము గనుక, తప్పకుండా ఏర్పాటుచేస్తాను అని, నేను యీ సభ ఎదుట మీ అందరితరఫున, మద్రాసురాష్ట్రమునుంచి ఆంధ్రరాష్ట్రములోనికి రాబోయే ప్రాంతాలలో ఏ ఏ భాషవారు ఉంటారో, వారికి అవసరమైనవారి భాష విషయంలో హామీ యిస్తున్నాను కాబట్టి మద్రాసువారైనను, మనమైనను సుహృద్భావముతో సర్దుబాటు చేసుకోవాలిగాని, దీనికి వేరే మార్గమున పోవడము అనేది ఉండదు కాబట్టి minority వారి భాషనుగురించి వారు ఎవరైనాసరే అనుమానించనక్కరలేదు ఇంకా మనకు ఏన్నో ముఖ్యమైన సమస్యలు ఉన్నవి అవి అన్నీగూడ చూచుకోవలసి యున్నది మనము మైసూరు ప్రభుత్వమువారితో రాజోలిబండ ప్రాజెక్టును గురించి చర్చించవలసి యున్నది రాజోలిబండ ప్రాజెక్టుక్రింద మనకు 10 గ్రామాలు వచ్చినవి ఆ ప్రాజెక్టు ప్రాంతముఅంతా మనక్రిందకు వచ్చింది. ఆ ప్రాజెక్టు ఎడమప్రక్కన head works మనవైపున ఉన్నవి. మనము యీ సమస్యను గురించి మైసూరు ప్రభుత్వముతో న్యాయముగ సర్దుబాటు చేసుకున్నారని అనుకునేటట్లు చేస్తే ఇంకొక రాష్ట్రప్రభుత్వముతో యిలాంటి సమస్యలు ఏవైనా ఉంటే, అవి సర్దుబాటు చేసుకోటానికి వీలు అవుతుంది అందుకు మనము ప్రయత్నించాలి మొన్న మైసూరుప్రభుత్వము వారితో మాట్లాడవలెనని వెళ్ళినప్పుడు, అక్కడ Irrigation Minister తో గూడ చర్చించాను Irrigation గురించి Electric powers గురించిన విషయాలు మేము చర్చించుకున్నాము అన్నివిషయాలు చాలా సంతోషముగా, సుహృద్భావముతో చర్చలు ముగిసినవి. మేము చర్చించిన విషయాలన్నీ బహు జాగ్రత్తగా రాజీ మార్గములో ఏర్పాటు చేసుకోవడము జరిగింది, చిన్నచిన్న border సమస్యలు మనకు మైసూరు ప్రభుత్వముతో గూడ ఉన్నవి. కోలారు తాలూకాను గురించి ఆశపడడమువల్ల లాభములేదు. ఇక మీదట బళ్లారి విషయము తిరగతోడడము అనవసరము. బళ్ళారి విషయము, ఎప్పుడో మనమంతా మరచిపోయిన విషయము. ఆ మరచిపోయిన తగాదాలు మరల తిరగతోడుకొని యింకా అవి పెట్టుకోవాలంటే చాల సులభముగ పెట్టుకోవచ్చు. కాని అది కాదు సమస్య. అదిగాక, యితర చిన్న చిన్న issues ఉన్నవి. ప్రాజెక్టు ఏరియాలో ఉన్నచోట్లలోగాని, రోడ్లుపైనా ఉన్నచోట్లలోకాని కొన్ని సమస్యలు

యింకా తీర్చుకోవలసినవి ఉన్నవి చిటల్ దుర్గమునుంచి బళ్ళారికి పోవాలంటే, మధ్య మన రాష్ట్రము ఉన్నది అక్కడ మన రాష్ట్రమునకు ఉన్న ప్రాంతము సుమారు 7 మైళ్ళు ఉన్నది ఆ ఏడుమైళ్ళ పొడుగున రోడ్డు ఏమీ వేయలేదు ఇదివరకు ఎప్పుడో వేసినరోడ్డు ఏదైనా ఉంటే, దానిని repair అయినా చేయించలేదు ఆ రోడ్డు బాగాలేని కారణముచేత అక్కడ రాకపోకలకు చాలా యిబ్బందులు పడుతున్నారు. అలాంటివి చిన్న చిన్న bits అయినా మనము వారికి విడవలేదు కాని విడవడములో తప్పులేదు అక్కడ రాకోలిబండ ప్రాంతములో మనకు వచ్చినచోట్ల చాలా అననుకూలముగ ఉన్నప్పటికినీ, దానిని మనము పుచ్చుకోవడములో తప్పేమిలేదు రెండు రాష్ట్రాలమధ్య స్నేహితము అనేది ఒకటి పెంపొందించుకుంటూ ఉంటే యిలాంటి సమస్యలు ఎన్నో తీర్చు కోటానికి వీలు అవుతుంది అలాగాకుండా బళ్లారి యింకా మాదే, అది మాకు రావలసిందే రాలేదు. అది యివ్వండి, బెంగుళూరులో సగమునుంది తెలుగు వారు ఉన్నారు గనుక అదిగూడ మాకే కావాలి అని యీ మాదిరిగ మనము తగాదాలు పెట్టుకొని వారితో ఏ మాత్రమైనా అన్నాము అంటే, ఇక వారు మనదగ్గర కేరారు మనతో సంప్రదింపులు జరపరు ఇక మనము తగాదాలు పెట్టుకోవాలంటే, తగాదాలు పెట్టుకోవచ్చు. మన ఆంధ్రత్వము అంతా వారి మీద నూటికి నూరుపాళ్ళ కాదు, నూటికి రెండువందలపాళ్ళు కూడ వారిమీద కురిపించవచ్చు కాని ఫలితము మాత్రము సున్న ఈ సంగతిమాత్రము బాగా జ్ఞాపకము ఉంచుకోండి. ఆ విధమైన తగాదాలు మన ప్రభుత్వము ప్రారంభిస్తే మనము ఆంధ్రరాష్ట్రమునకే కాదు, ఆంధ్రప్రజానీకానికే మనము ద్రోహము చేసినవార మవుతాము కాబట్టి మనప్రక్కన ఉన్న రాష్ట్రాలతో మన స్నేహము పెంపొందించుకుంటూ ఉంటేనే మన సమస్యలు ఏవైనా ఉంటే, అవి మనము సులభముగ, స్నేహపూరితముగ పరిష్కారము చేసుకుంటూ ఉండవచ్చునని నా ఉద్దేశము. ఇక మిగిలిన border disputes ను గురించి నేను యిప్పుడు చెప్పదలచుకోలేదు. ఆక్కడ పర్లాకిమిడి గాని, సిరువంచ తాలూకా వగైరాలు మనకు రావలసినవి ఉన్నవి. ఆ విషయాలను, ఆ ప్రాంతాల సంగతి మన అధ్యక్షులవారికి బాగా తెలుసును

**శ్రీ జి. లచ్చన్న :** On a point of information, Sir, మిగతా ఒరిస్సా రాష్ట్రం సరిహద్దు సమస్యలను గురించి ఒరిస్సా రాష్ట్రప్రభుత్వముతో గాని, మధ్యప్రదేశ్ రాష్ట్రప్రభుత్వముతో గాని, ఇప్పుడు మనము మద్రాసు వారితో స్నేహ పూరితముగానే సంప్రదింపుల ద్వారా పరిష్కరించుకొన్నట్లుగా ఆ సమస్యలుకూడ పరిష్కారము చేసుకోటానికి ఏమైనా ఆలోచనలు జరుగు తాయా !

శ్రీ యస్. సంజీవరెడ్డి ఇప్పుడు ఆ ప్రభుత్వాలతో చర్చించుకోవడము తప్ప వేరే సులభమార్గము ఏమీలేదని కేంద్ర ప్రభుత్వమువారే చెప్పారు మనము దాని విషయములో ఇందులో ఏ ఒక్క ప్రభుత్వముతో నైనా సరే సంప్రదింపులు జరుపుకోవాలనుకుంటే, మనము ఏ ప్రాంతమునైనా కోరే టప్పుడు, దానికి సమానంగా ఏ ప్రాంతమునైనా యివ్వటానికి సిద్ధముగా ఉండాలిగదా పర్లాకిమిడి మనకు కావాలని అంటే, మన ప్రాంతము నుంచి కొంత హెచ్చు ఏరియాను వారికి యివ్వాలి. మన ప్రజానీకము ఒప్పుకుంటే, మనము వారికి ఇన్ని గ్రామాలు అని యిస్తే వారు తిరిగి మనకు ఇన్ని గ్రామాలు యిస్తారని ఏదో ఒక విధముగ చర్చించుకోవచ్చు అందులో తప్పేమీలేదు మనము ఆ ప్రయత్నము చేయవచ్చు కాని ముందు మన రాష్ట్రములో ఒరియా మాట్లాడేవారి యొక్క అంగీకారము కుదుర్చుకుంటే ఢిల్లీ ప్రభుత్వమువారి ఆక్షేపణ ఏమీ ఉండదని అక్కడ కేంద్రప్రభుత్వములోని **Home Minister** గారు, యిందుకు యితర పెద్దలుకూడ చెప్పారు ఆ ప్రయత్నము నేను ఇంకా ప్రారంభించలేదు కాని ప్రస్తుతములో ఇది తెగిపోతే, తరువాత ఆ విషయములో మనము యింకొక direction లో పోవటానికి వీలు అవుతుంది ఇప్పటికి మద్రాసు వ్యవహారము తెగిపోయినట్లేనని అనుకుంటున్నాను ఇక మీదట మైసూరువారితో చర్చలు ప్రారంభించాలని అనుకుంటున్నాము కొంతవరకు వారితో చర్చలు జరగాయి మైసూరుయొక్క **border disputes** విషయములో చక్కగానే చర్చలు జరుపుకుని, పరిష్కారము చేసుకోగలిగితే, ఒరిస్సా విషయముకూడ ఏమంత పెద్దపనికాదు ఆ ప్రభుత్వముతో మాత్రము చర్చించటానికి తరువాత ప్రయత్నిస్తాము కాని అది యిప్పుడు వెంటనే మాత్రము ఏమీ చేయలేము. ఇప్పుడు మద్రాసు విషయములో మనమిత్రులు ఎవరైనా యీ అంగీకారము బాగాలేదని అంటే నేను వారిని ఒక్కటే ప్రార్థిస్తున్నాను ఇప్పుడు జరిగిన పరిష్కారముకంటే యింకొక అంగీకార యోగ్యమైన మార్గము ఏదైనా ఉంటే చెప్పండి ఆ మార్గము బాగా ఉన్నదని మనమందరము ఏకగ్రీవముగ ఒప్పుకుంటే దానిని కామరాజు నాడారుగారికి చెప్పి వారియొక్క అంగీకారమును పొందటానికి నాకేమి అభ్యంతరములేదు కాని యిక్కడ మనము ఒక ఉపన్యాసము చేసి, మనకుఉన్న మంచి గ్రామము పోయిందని అనుకుంటే అక్కడ మద్రాసులోనివారు కూడ కామరాజునాడారును ఎంతోమంది తిట్టుతూనే ఉన్నారు " మంచి **Developed area**, మంచి ప్రాజెక్టు ఏరియాను యిచ్చి వేశారు. దానికిబదులు మనకు వచ్చింది ఏమీలేదు. తిరుత్తని అంతా ఒట్టి **famine area**. అక్కడ ఒట్టి కూటికికూడ లేనటువంటి ప్రజానీకము ఉన్నారు. అలాంటి **famine area** ను తీసుకుని మంచి **well developed project area** ను

యిచ్చివేశారు అక్కడ అంతా electrified area, ఆ ప్రాజెక్టు ఒక కోటి రూపాయలు పైగా ఖర్చుచేసి తయారు చేసుకున్నాము అటువంటి మంచి చోటును యిచ్చివేశారు తిరుత్తనిలో దేవుడు ఉన్నాడని తీసుకున్నారా ? దేవుడు ఉంటే ఏమిచేస్తారు తిరుపతిపోయి దేవుడుని చూస్తే వద్దంటారా ? బెనారెస్‌పోతే వద్దంటారా ? రామేశ్వరముపోతే వద్దంటారా ? అక్కడ దేవుడు ఉన్నాడని తీసుకోవడము ఎందుకు ? మంచి ప్రాజెక్టును వదిలిపెట్టారు" అని కామరాజు నాడారును వారిపార్టీ మీటింగులోనూ, ఎసెంబ్లీలోనూ కూడా తిట్టుతూనే ఉన్నారు అక్కడ ఆయనను కూడ వదిలిపెట్టలేదు రెండు పక్షములవారికి కొంచెముగా బాధ ఉన్నదంటే, ఇందులో నిజంగా న్యాయమైన పరిష్కారమే చేసుకున్నాముగదా అని నాకు అనిపిస్తున్నది ఏదో ఒక పక్షము సంతోషిస్తూ, అంతా మనకే వచ్చిందిలే, ఇక మనది ఏమీలేదు అని అనుకుంటే అందులో ఏదో మోసము జరిగిందని అనుకోవచ్చు అక్కడ కామరాజునాడార్ చేసింది తప్పు అని నిందించేవారు ఉంటే, ఇక్కడ కూడ మనము వారు ఏదో పొరబాటు చేశామని అనుకొంటూంటే, పటాస్కర్ రిపోర్టు అక్కడ ఏదో కొద్దిగా ఆ గ్రామాలు మార్చడములో న్యాయమును తప్పి మాత్రము లేదని అనిపిస్తుంది. కాబట్టి యీ ప్రభుత్వము తరఫున, మీ అందరి తరఫున దీన్ని అంగీకరించాము అంగీకరించడము ద్వారా మన రెండు రాష్ట్రాల మధ్య స్నేహము అభివృద్ధి చేసుకున్నవారమవుతాము అందువల్ల మీరు అందరుకూడ దీన్ని అంగీకరించాలని కోరుతూ, యింత సహకారమును యిస్తూ మాట్లాడిన సుందరయ్యగారిని నేను అభినందిస్తూ, ఇతర మిత్రులు అందరు కూడ అలాంటి సహకారమును యివ్వవలసిందిగా ప్రార్థిస్తున్నాను.

*Mr Speaker*. The House now stands adjourned till 8-30 A.M on Monday.

*The House then adjourned till Half Past Eight of the Clock on Monday, the 18th November, 1957.*